# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 18 సంచిక : 3 హైదరాబాద్ 224 మార్చ్ 2020 పేజీలు : 68 రు. 25

* సంక్షోభ కాలపు బడ్జెట్ - రెండు వ్యాసాలు
* బిఎస్ఎన్ఎల్ పతనానికి కారకులెవరు?
* ప్రలోభాలే ప్రధానంగా మునిసిపల్ ఎన్నికలు
* రాజధాని ఆందోళన ఆర్థిక మూలాలు
* ఢిల్లీ శాసనసభ ఎన్నికల ఫలితాలు
* భావ వ్యక్తీకరణ రాజద్రోహమా?
* ఇయు కూటమికి బ్రిటన్ వీడ్కోలు

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

## మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్స్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు

| | | |
|---|---|---|
| రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ (సోల్ డిస్ట్రిబ్యూటర్) | ఆబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| నవోదయ బుక్‌హౌస్ | కాచిగూడ, హైదరాబాద్ | 90004 13413 |
| సహచర బుక్‌మార్క్ | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| బాల రాజేశ్వర బుక్ డిపో | నల్లకుంట బస్ స్టాప్ హైదరాబాద్ | 9705055738 |
| వెంకటేశ్వర బుక్‌స్టాల్, స్టేషనరీ | నల్లకుంట, శంకర్‌మఠ్ హైదరాబాద్ | 040-66131071 |
| ఫస్ట్ లక్కీ పాన్‌షాప్ | విద్యానగర్ సిగ్నల్స్ హైదరాబాద్ | 9848672831 |
| సుధాకర్ బుక్‌స్టాల్ | సన్‌మాన్ హోటల్ పక్కన, తార్నాక హైదరాబాద్ | 9949337605 |
| వెంకటేశ్వర బుక్‌స్టాల్ | రామ్‌నగర్ గుండు హైదరాబాద్ | 9502964995 |
| భవాని బుక్‌స్టాల్ | శివం రోడ్ హైదరాబాద్ | 9849836996 |
| శ్రీభవాని బుక్‌స్టాల్ | శివం రోడ్ (ఇండియన్ బ్యాంక్ దగ్గర) హైదరాబాద్ | 9640712555 |
| ఓరియన్ బుక్‌స్టాల్ | అంబర్‌పేట్ (శ్రీరమణ టాకీస్ దగ్గర) హైదరాబాద్ | 7702535137 |
| అరవింద్ బుక్ స్టాల్ | రామంతాపూర్ (టివి స్టూడియో ఎదురుగా) హైదరాబాద్ | 8977995537 |
| నేషనల్ బుక్‌హౌస్ | అబిడ్స్, హైదరాబాద్ | 9394495189 |
| దుర్గా భవన్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9030656640 |
| డైమండ్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9885127491 |
| రాజు రామ్‌దాస్ బుక్‌స్టాల్ | మెహదీపట్నం, హైదరాబాద్ | 7799244409 |
| రిలయబుల్ బుక్ సెంటర్ | నానల్‌గూడ, హైదరాబాద్ | 040-23512447 |
| ఇస్ప్రెక్ట్రం బుక్‌హౌస్ | లంగర్‌హౌజ్, హైదరాబాద్ | 98486 68354 |
| శ్రీ లక్ష్మి బుక్‌స్టాల్ | హైదర్‌గూడ, హైదరాబాద్ | 98855 81249 |
| మల్లిఖార్జున బుక్‌స్టాల్ | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ | 90594 40756 |
| సుధీర్ బుక్‌స్టాల్ | తార్నాక, హైదరాబాద్ | 95426 04166 |
| లడ్డు బుక్‌స్టాల్ | పంజగుట్ట, హైదరాబాద్ | 99492 15135 |
| వినోద్ బుక్‌స్టాల్ | సరూర్‌నగర్, హైదరాబాద్ | 95536 03603 |
| రాజారెడ్డి బుక్‌స్టాల్ | చందానగర్ బిఎచ్‌ఇఎల్ | 93466 07648 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | చిక్కడపల్లి, హైదరాబాద్ | 94900 99373 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | బాగ్‌లింగంపల్లి-సుందరయ్య విజ్ఞాన కేంద్రం, హైదరాబాద్ | 94900 99378 |
| రాజ్ బుక్స్ స్టేషనరీ | ఓల్డ్ బస్‌స్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | 87905 60097 |
| అక్షర బుక్ వరల్డ్, ఎటిసి మార్కెటింగ్ | న్యూ టౌన్, మహబూబ్‌నగర్ | 90102 10464 |
| శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| భాస్కర్ పాన్ షాప్ & జనరల్ స్టోర్ | కోహెడ | 95021 82545 |
| గణేష్ బుక్‌స్టాల్ | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| వినయ్ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| పాండు బుక్‌స్టాల్, కూల్‌డ్రింక్స్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, మిర్యాలగూడ | 98857 38144 |
| సత్యసాయి బుక్‌స్టాల్ | ఖమ్మం | 79890 81728 |
| రాజన్న బుక్ స్టాల్ | హనుమకొండ చౌరస్తా | 93955 07773 |
| మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| మణి బుక్‌స్టాల్ | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| సురేష్ బుక్‌స్టాల్ | శివాలయం వీథి, ప్రొద్దటూరు | 81210 02112 |
| క్రిసెంట్ న్యూస్ ఏజెన్సీ | కడప | 98852 35846 |
| పద్మావతి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| అనేక బుక్‌స్టాల్ | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| మైత్రీ బుక్‌హౌస్ | మజీద్ వీథి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| రాజేశ్ బుక్‌సర్వీస్ | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ | డాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| రాఘవేంద్ర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |
| శ్రీదేవి సాయి కూల్‌డ్రింక్స్, కమ్యూనికేషన్స్ | దేవి చౌక్, రాజమండ్రి | 98489 84394 |
| త్రినాథ్ పాన్ షాప్ | మరిడి మహాలక్ష్మి టెంపుల్, రాజమండ్రి | 99519 76044 |

224 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మార్చ్ 2020
సంపుటి : 18
సంచిక : 3





'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై 'VEEKSHANAM' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థిక సహాయం అందించిన కుడక చంటి, నేలటూరు, తూర్పుగోదావరి- రు. 250; చీకట్ల సుబ్బారావు, రాజమండ్రి - రు. 250; కంటిపుడి సుబ్బారావు, బొబ్బిలంక, తూర్పుగోదావరి - రు. 1,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

తెలంగాణ ప్రభుత్వం ఇటీవల వీక్షణం సంపాదకుడిపై కేసులు పెట్టడం, మళ్లీ ఇప్పుడు పత్రికపై నిందలు వేసి మావోయిస్టులతో సంబంధముందని ప్రచారం చేయడం చూస్తుంటే చాలా ఆశ్చర్యం వేస్తుంది. ఎందుకంటే ఇదే పత్రిక తెలంగాణ ఆవిర్భావానికి ముందు తెలంగాణ రాష్ట్రం ఆ ప్రజల న్యాయమైన హక్కనీ, ప్రత్యేక రాష్ట్రంగా చేయడమే ధర్మమనీ తెలంగాణ కోసం పోరాడి, ప్రాణాలర్పించిన త్యాగమూర్తుల ఫలితం. ఆ ప్రజల పోరాటాలను ప్రశంసిస్తూ తెలంగాణ ఆవిర్భావం కోసం ఎన్నో ఉత్తేజభరిత వ్యాసాలు ప్రచురించిన వీక్షణం ఆనాడు మావోయిస్టు అనుబంధ పత్రిక కాలేదేమీ? ప్రభుత్వం ఏర్పడిన తర్వాత ప్రజాహిత కార్యక్రమాలు ప్రభుత్వం చేపట్టినప్పుడు ఫోటోలతో సైతం ప్రచురించి ప్రశంసించినప్పుడు మావోయిస్టు సపోర్టు పత్రికా కాలేదెందుకు?! ప్రజాధనాన్ని యజ్ఞాల పేరునా, యాగాల పేరునా దుర్వినియోగం చేస్తునప్పుడు నిష్పాక్షికంగా అదే ప్రభుత్వ చర్యల్ని నిరసిస్తూ రాసిందీ అదే పత్రిక. పత్రికా ధర్మాన్ని సక్రమంగా నిర్వహించిందని పైన పేర్కొన్న మంచి చెడుల్ని రెంటినీ సరైన విధంగా ప్రస్ఫుటింపచేసిన పత్రిక ఇప్పుడిలా హఠాత్తుగా, ఆకస్మికంగా తీవ్రవాదుల పత్రిక అయిపోయిందా! 150 సంవత్సరాల క్రితమే హిందూమత దురన్యాయాల మీద దండెత్తి, దళితులకీ, స్త్రీలకీ విద్యను దూరం చేసిన బ్రాహ్మణాధిపత్యంపై జీవితమంతా పోరాడి, తుదిశ్వాస వరకూ బ్రాహ్మణిజం పైనా, హిందూమతం పైన, దాని దుర్మార్గాలపైన పోరాడిన మహాత్మా జోతిరావ్‌ఫూలే, సావిత్రిబాయి గురించి తెలిసిన కూడా నేడు ఆ బ్రాహ్మణీయ శక్తులు చెప్పిన హిందూ మతానుకూల ఆధ్యాత్మిక బోధనల ద్వారా విద్యను మార్చాలని ప్రయత్నించే కెసిఆర్ గారూ! ప్రజలకు జ్ఞానానందించే వీక్షణంపై నిందలు వేయడం తగునా!

**– బి.ఎ. నారాయణరావు**

విశాఖపట్నం

ఫిబ్రవరి సంచికలో రామకృష్ణ వ్యాసం 'జీయర్ దొరల కనుసన్నల్లో తెలంగాణ విద్య' బాగుంది. తెలంగాణలో ఒకపక్క రోజురోజుకూ విద్య పూర్తిగా ప్రైవేటీకరణ చెందుతున్న క్రమంలో విద్యను సృజనాత్మకంగా తీర్చిదిద్దాల్సింది పోయి దానికి ఆధ్యాత్మిక రంగును పూయడం దుర్మార్గం. ఇది భవిష్యత్ తరాలకు చాలా ప్రమాదకరం. విద్యార్థులపై మత ప్రభావం ఎక్కువైతే ఇప్పటికే అగ్గిబుగ్గవుతున్న దేశం మరింత అల్లకల్లోమవుతోంది. రచయిత ఉపాధ్యాయుడుగా తన వృత్తి పట్ల, విద్యార్థుల భవిష్యత్తు పట్ల ఎంతో ఆందోళన వ్యక్తం చేశారు.

**– టి. రాములు**

మిర్యాలగూడ

దేశంలో, రాష్ట్రంలో ప్రస్తుతం నెలకొన్న పరిస్థితులపై సంపాదకీయం, సంపాదకీయ వ్యాఖ్యలు బాగున్నాయి. ముఖ్యంగా దేశ రాజధానిలో కొనసాగుతున్న అల్లర్లపై వచ్చిన సంపాదకీయం ఆలోచనాత్మకంగా ఉంది. పౌరసత్వ సవరణ చట్టానికి వ్యతిరేకంగా సాగుతున్న ఉద్యమం ఇప్పుడు మరింత తీవ్రరూపం దాల్చింది. దీని మూలాలను చెబుతూ, రాజకీయ పార్టీల స్వార్థం వల్ల దేశ పౌరుల్లో ఉన్న భయాందోళనలపై సంపాదకులు వెలుగు ప్రసరించారు. అభినందనీయం.

**– గాదె వెంకట రమణ**

హైదరాబాద్

వీక్షణం పత్రిక ఇన్ని సంవత్సరాలుగా నిరంతరాయంగా కొనసాగడం దానికదిగానే పెద్ద సంకల్పం. ప్రజాపక్షంగా, ప్రజాకాంక్షలకు అనుగుణంగా వస్తున్న పత్రికలను పాలకులు ఎప్పుడు కంటకింపుగానే చూస్తున్నారు. ఇలాంటి పత్రికలను కాపాడుకోవడం పాఠకులుగా, పౌరులుగా ప్రతి ఒక్కరి బాధ్యత.

**– హరినాథ్ కుమార్**

వరంగల్


Statement about ownership and other particulars of periodical **Veekshanam** as required to be published in the first issue of every year after the last day of February

Form IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Hyderabad |
| 2. Periodicity of its publication | : | Monthly |
| 3. Printer's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 4. Publisher's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 5. Editor's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 6. Name and addresses of individuals who own the newspaper | : | N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*

*(N. Venugopal Rao)*

Date : 1st March, 2020 Signature of the Publisher


**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# ఆప్ గెలుపు -కొత్త భ్రమలు, ఢిల్లీ మారణ కాండ - కొత్త నిరాశలు



నిరాటంకంగా సాగుతున్నట్టనిపిస్తున్న సంఘ్ పరివార్ హంతక జగన్నాథ రథ చక్రాలు ఏ చిన్న గులకరాయి తగిలి తడబడినట్టనిపించినా సంతోషపడే విచారకర విషాద స్థితికి దేశం చేరింది. వరదలో కొట్టుకుపోతున్న మనిషికి గడ్డిపోచ దొరికినట్టు, ఆ గడ్డిపోచ తనను కాపాడుతుందా లేదా అనే ఆలోచన లేకుండా దాన్ని దొరకబుచ్చుకుని సంబరపడ్డట్టు ఢిల్లీ ఎన్నికల్లో ఆమ్ ఆద్మీ పార్టీ విజయంతో దేశంలోని ప్రగతిశీల శిబిరంలో కొత్త ఆశలూ కొత్త భ్రమలూ మొదలయ్యాయి. అదేదో సంఘ్ పరివార్ ఓటమిగా సంతోషం వ్యక్తమయింది. ఆమ్ ఆద్మీ పార్టీ అనేకానేక పార్లమెంటరీ పాలకవర్గ పార్టీల్లో ఒకానొకటి మాత్రమే. అదే తానులో ముక్క. అయినా తమను తాము వామపక్ష శిబిరంలో ఉన్నామని భావించేవారిలో కూడ ఈ ఆశలూ భ్రమలూ కలిగాయంటే భౌతిక పరిస్థితి ఎంత దారుణంగా ఉందోని అర్థమవుతుంది. ఆప్ భాజపాను మట్టి కరిపించిందని నీరాజనాలు అందుకున్న ఢిల్లీలోనే పెద్దఎత్తున మొదలైన హిందుత్వ మారణకాండ, దాని పట్ల ముఖ్యమంత్రి కేజ్రీవాల్ స్పందించవలసినట్టుగా స్పందించకపోవడం, దానితో ఆ ఆశలు చెల్లాచెదురైనట్టు ప్రగతిశీల శక్తులు నిరాశ పడడం లాంటి పరిణామాలు రెండువారాల్లోనే వేగంగా జరిగిపోయిన భౌతిక పరిస్థితిని కూడ అర్థం చేసుకోవలసి ఉంది.

భారత పార్లమెంటరీ ఎన్నికల రాజకీయాల్లో ఉన్న ఏ ఒక్క పార్టీకీ ప్రజానుకూల స్వభావం లేదు. అన్నిటికన్నీ పాలకవర్గ పార్టీలే. పాలకవర్గ ముఠాలలోని ఏ ముఠాకు ఏ పార్టీ ప్రాతినిధ్యం వహిస్తున్నది, లేదా ఏ పార్టీ ఒకటి కన్న ఎక్కువ ముఠాల ప్రయోజనాల కాపాడడానికి సమన్వయం సాధిస్తున్నది, బేరసారాలాడుతున్నది అనేదే ఇవాళ భారత రాజకీయాల ప్రధానాంశం. దేశంలోని కార్పొరేట్ పాలకవర్గాల దళారీ ప్రయోజనాలు, వారి తోబుట్టువులైన భూస్వామ్య వర్గాల సామాజిక భావజాల ప్రయోజనాలు, ఈ ఇద్దరి మిలాఖత్తును నిర్దేశించే అంతర్జాతీయ సామ్రాజ్యవాద ద్రవ్యపెట్టుబడి ప్రయోజనాలు తీర్చని ఏ పార్టీ కూడ ఇవాళ రాష్ట్రాల్లో గాని, కేంద్రంలో గాని అధికార పీఠం దరిదాపుల్లోకి కూడ వచ్చే అవకాశం లేదు. ఎన్నికల గెలుపు ఓటముల్లో ప్రజల పాత్ర కన్న ప్రధానమైనవి డబ్బు, మద్యం, ప్రలోభాలు, బెదిరింపులు, హింసాకాండ. ఏడు దశాబ్దాల ఎన్నికల రాజకీయాలలో అనేక మంది ప్రత్యర్థులలో ఎక్కువలో ఎక్కువ ఎవరు కావాలో ఎంచుకునే అవకాశం కన్న ఎవరు వద్దో వ్యక్తీకరించే అవకాశమే ప్రజలకు మిగిలింది. ఇవాళ దేశంలో కొనసాగుతున్న పార్లమెంటరీ వ్యవస్థ నిజమైన ప్రజా ప్రాతినిధ్య వ్యవస్థా కాదు, ఈ ఎన్నికల్లో వ్యక్తమయ్యేది నిజమైన ప్రజాభిప్రాయమూ కాదు. ఈ మౌలిక అవగాహన వదులుకోకుండా విభిన్న రాజకీయ పక్షాల మధ్య ఉన్న చిన్న తేడాలను, ఆయా పార్టీల ప్రజాకర్షణను, స్వల్పస్థాయి తేడాలను, వ్యవస్థను మార్చకుండానే తాత్కాలిక ఉపశమనాలు అందించి ప్రజలలో భ్రమలు సృష్టించగల స్థితిని, ప్రజల భౌతిక అవసరాలు, సమస్యలు తీర్చకుండానే భావోద్వేగాలను, మత, కుల, ప్రాంత దురభిమానాలను రెచ్చగొట్టి పబ్బం గడుపుకునే స్థితి వంటి భిన్నత్వాన్ని కూడ గుర్తించాలి.

ఈ నేపథ్యంలో అరవింద్ కేజ్రీవాల్ అనే యువ ప్రభుత్వాధికారి సారథ్యంలో, అవినీతిపై పోరాటం అనే నినాదంతో, అన్నా హజారే ఆందోళన కెరటాలపై ఆమ్ ఆద్మీ పార్టీ ప్రయోగం మొదలైంది. అది ప్రజలను ఆకర్షించడానికి కొన్ని కొత్త ఎత్తుగడలు వేసిన పార్టీ మాత్రమే గాని ప్రజల పార్టీ కాదు. ఆధునికత అబ్బిన ప్రభుత్వాధికారిగా కొత్త యువతరానికి ఆకర్షణీయమైన నినాదాలు ఇవ్వగలిగి, మెప్పించగలిగిన కొత్త తరహా రాజకీయ నాయకుడిగా కేజ్రీవాల్ ప్రారంభమయ్యాడు. నిజంగానే వ్యవస్థను మార్చకుండానే, వ్యవస్థ లోపలనే, అవినీతిని తగ్గిస్తే, నిజమైన సంక్షేమ భావనను అలవరచుకుంటే సాధించగల విద్యా, వైద్య, రవాణా రంగాల ప్రజాసేవలను అందించాడు. ఈ పనులన్నీ వాటికవిగా ఎంత ప్రశంసనీయమైనవైనా, ప్రజలకు అందుబాటులోకి వచ్చినవైనా, అవి కొనసాగుతున్న దోపిడీ పీడనల వ్యవస్థను మార్చేవి కావు. ఒకరకంగా వ్యవస్థ మీద ఆశలను పెంచే ప్రమాదకరమైనవి. ప్రపంచీకరణ, హిందుత్వ మతోన్మాదం, కుల సమస్య, ఆదివాసి సమస్య, మహిళా సమస్య వంటి ఇవాళ్టి భారత సమాజపు ప్రధాన సమస్యలన్నిటి విషయంలోనూ కేజ్రీవాల్ ఇప్పటివరకు మౌనమైనా వహించాడు, ప్రజావ్యతిరేక అభిప్రాయాలైనా వ్యక్తీకరించాడు. కనుక పాఠశాలలు బాగుచేశాడనో, మొహల్లా క్లినిక్‌లు ఏర్పాటు చేశాడనో, ఉచిత రవాణా సౌకర్యం ఏర్పాటు చేశాడనో, ఉచిత లేదా చౌక విద్యుత్ అందించాడనో కారణాలతో ప్రగతిశీల శక్తులు కూడ ఆయనను తలకెత్తుకోవడం అనుచితం, అసందర్భం. భాజపాతో ఢీకొంటున్నాడని చాలమంది అనుకుంటున్నారు గాని దాన్ని కూడ నిశితంగా పరిశీలించవలసి ఉంది. ఒకానొక రాజకీయ పార్టీగా భాజపాకు ఎదురునిలిచాడేమో గాని సంఘ్ పరివార్ భావజాలానికి ఎదురు నిలిచాడా అనే ప్రశ్నకు సరైన జవాబు లేదు. ఎన్నికలకు ముందు షాహీన్ బాగ్ పట్ల మౌనం ఎత్తుగడల మౌనమనీ, ఆ తటస్థత వహించడమే భాజపాను ఓడించడానికి అవసరమనీ కూడ సమర్థనలు వచ్చాయి. జైశ్రీరామ్ కు పోటీగా హనుమాన్ చాలీసా పఠించడాన్ని కూడ సమర్థించినవారున్నారు. కాని ఎన్నికల ఫలితాలు వెలువడి, సరిగ్గా రెండు వారాలు గడిచీ గడవక ముందే ఈశాన్య ఢిల్లీలో తనకు వోటేసిన ప్రజలనే, ముస్లింలనే ఆర్ ఎస్ ఎస్ గూండాలు తగులబెడుతున్నప్పుడు, బీభత్సకాండ జరుపుతున్నప్పుడు కేజ్రీవాల్ ముఖ్యమంత్రిగా ఏం చేస్తున్నాడో చరిత్ర నమోదు చేస్తున్నది. "భాజపా ప్రత్యర్థి" అనే భుజకీర్తులు తగిలించుకున్న వ్యక్తి సంఘ్ పరివార్ కనీసం బాధితులకు అండగా నిలవడానికి, సాంత్వన పలకడానికి, హింసను ఆపడానికి చిన్నమెత్తు ప్రయత్నం కూడ చేయడం లేదు. ఢిల్లీ పోలీసు వ్యవస్థ కేంద్ర ప్రభుత్వం కింద ఉంటుందనీ, దాని మీద ఢిల్లీ ముఖ్యమంత్రికి అధికారం లేదనీ వాదన కోసం ఒప్పుకున్నా, ముఖ్యమంత్రి, డెబ్బై స్థానాలకు అరవై మూడు స్థానాలు గెలుచుకున్న శాసనసభ్యులు తమ తమ నియోజకవర్గాల ప్రజల దగ్గరికి వెళ్లి వారికి అండగా నిలబడడానికి, కనీసం హంతకదాడులు జరుపుతున్న గూండాలను పేరుపెట్టి ఖండించడానికి అడ్డం వచ్చేదేమీ లేదు. కేజ్రీవాల్ ముసుగు తొలగిపోవడం అవసరమే గాని అది ఇంత విషాదకరంగా, డజన్ల కొద్దీ ప్రాణాలను బలితీసుకుని జరగడమే విచారకరం. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# గష్తీ నిషాన్ 53 మల్లొచ్చిందా?

తెలంగాణోన్ని గద బాంచెన్, మనోల్లు రాసిన వొయ్యిలు జదువకపోతె ఎట్ల అని ఆడోటి ఈడోటి ఏది దొరికితె అది జదివిన. మారె, మా దొర జదివినన్ని జదవలే గని. ఆయినంటే అరవై ఏలో డెబ్బై ఏలో వొయ్యిలు జదివిండట గద. నా నించి అంతేడైతది గని, ఏదో నా లెక్కల నేను సదువుకున్న. ప్రజల మనిషి అని ఒక నవలున్నది. అవ్వల్ దర్జగుంటది. మన తెలంగాణ బతుకు కత. అయ్యగారు, ఆయినె పేరేందో, ఆల్వార్ స్వామో ఏందో. నూరేండ్ల కిందటి సంగతులు శాన రాశిండట. గా వొయ్యి శాన పాతది, ఇప్పుడంత కాలం మారిపోయింది, గా బతుకు ఇప్పుడాడున్నది. గదంత పాత ముచ్చట. ఇప్పుడంత ఐటెక్ అని మావోడు ఇంగిలిపీసుల నన్ను దిట్టుకుంట చెంగడ బింగడ ఎగురబట్టె. గిదేం కతరో, కాని కాలమచ్చింది. అవును గావచ్చు మావోడు జెప్పేదే నివద్దె గావచ్చు అని నేనుసుత అనుకున్న. పాతకాలమోన్ని గద. కని నిన్న ధర్నా చౌక్ ల గా సారెవరో పండొలిశినట్టు ముచ్చట జెప్తాంటె నాకు జెటుక్కున మల్ల గా వొయ్యే యాదికొచ్చె. గా సారేమన్నడో ఎరికెనా? ఎంగల్రావు కాలంల, శెంద్రబాబు కాలంల, రాశ్శేకర్రెడ్డి కాలంల తీర్గనే పొల్లగాండ్లను పోలీసోల్లు పట్టుకపోతాంండ్రట. తీరొక్క కేసులు పెడ్తాండ్రట. అరిగోస పెడ్తాండ్రట. ఇగ్గో మన తెలంగాణల, కొట్లాడి తెచ్చుకున్న తెలంగాణల గీతీరుగ తెలంగాణ బిడ్డలను అరిగోస పెట్టుడేందయా అని సబ బెట్టుకుందామనుకున్నరట. ధర్నాచౌక్ కాడ పొద్దటి నుంచి పొద్దుగూకే దాక కూసుంటమన్నరట. రాా్, ఎంతమాత్రం కుదరది అని పోలీసు దొరలు అడ్డం దిరిగిండ్రట. ఇగ గీ సబోల్లు అదాలత్ కు బోయిండ్రట. పోలీసు దొరలేమో అదాలతుకొచ్చి, మారె మేమెందుకు ఒద్దంటం, సబ పెట్టుకోనియ్యిండ్రి అని ఇకమతు జేసిండ్రట. మల్ల పోలీసు దొరల కాడికి వోతె, ఇగ్గో మీరు ఆరు గంటలు కూసుంటమంటాండ్రు, కుదరది, మూడు గంటలే కూసోవాలె. మీరు ఐదు నూర్ల మంది ఒస్తామంటాండ్రు, కుదరది, ఇన్నూరు మంది కంటె ఒక్కడెక్కువ రావొద్దు. ఆడ ఎవలెవలు మాట్లాడ్తరో మాకు పేర్లియ్యాలె. ఆల్లు ఏమేమి మాట్లాడ్తరో రాసియ్యాలె. రాసిచ్చిందానికన్న ఒక్క ముక్క ఎక్కువ మాట్లాడొద్దు అని పోలీసు దొరలు సాఫ్ సీదా జెప్పిండ్రట. గా సారు గా ముచ్చటంత ఇడమర్శి జెప్తాంటే నాకు జెట్న గా పాత వొయ్యే యాదికొచ్చింది. దాంట్ల గుడ నిజాం జమాన్ల సబ బెట్టుకోవాల్నంటె ఎంత అరిగోస బడాల్నో మస్తుగ రాసిండు. నిజాం జమాన్ల గష్తీ నిషాన్ తిర్పన్ అని ఉండేదట. అంటె ఎవరైన సరే సబ పెట్టుకోవాల్నంటె అమీన్ సాబుకు కమ్మ రాసియ్యాల్నట. ఆ సబకు ఎవలెవలు ఒస్తరు, ఎవలెవలు మాట్లాడ్తరు, ఏమేమి మాట్లాడ్తరు కుల్లంకుల్ల రాసియ్యాల్నట. అదంత అమీన్ సాబు ఒప్పుకుంటెనె సబ బెట్టుకోవాల్నట. పాపం ప్రజల మనిషి నవలల అసుంటి సబ సంగతి, అమీన్ సాబుతోటి జగడమైన సంగతి అన్ని పూసగుచ్చినట్టు రాసుకచ్చిండు. ఆ వొయ్యి రాశి ఏ అరువై ఏండ్లయిందో డెబ్బై ఏండ్లయిందో, కాని యాడున్న గొంగడి ఆడ్నే ఉన్నట్టున్నది గద. నిజాం రాజ్జెం బోయిందంటిరి గాదు బాంచెన్. నాకు దెల్వకడుగుత. నిజామోడెంతరా, వాని బిషాదెంతరా అని పాటలు పాడ్తిమి గాదు, గోల్కొండ కోట కింద నీ గోరి కడ్తం కొడక అని పండ్లు నూరితిమి గాదు. మరి మల్ల గోల్కొండ కోట మీదనే జెండ ఎగిరేసి సర్కారు నడుపుతాండట గద పెద్ద దొర. అయితె గష్తీ నిషాన్ తిర్పన్ ఉన్నట్టే, గోల్కొండ రాజ్జెమో, నిజాం రాజ్జెమో, పోలీసు రాజ్జెమో ఉన్నట్టే. గంతేనా?

వీ

### సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# అసలు సమస్య రాజధాని కాదు, సమన్యాయం!

ఆంధ్రప్రదేశ్ సమాజంలో, రాజకీయాలలో ఎంత దుస్థితి కొనసాగుతున్నదంటే రెండు నెలలుగా సమాజమూ రాజకీయాలూ అన్నీ మౌలిక సమస్యలను వదిలి, కొత్త ఆలోచనలు వదిలి అవే అవే పాత వివాదాల చుట్టూ తిరుగుతున్నాయి. ఒక్క రాజకీయ పక్షమని కాదు, ఒక్క ప్రజా సంఘమని కాదు, ఒక్క ప్రజా సమూహపు ఆలోచన అని కాదు, అందరికందరూ ఒక్క రాజధాని సమస్య చుట్టూనే తిరుగుతున్నారు. రాష్ట్రమంతా అనేక సమస్యలు చుట్టుముట్టినా, దాదాపు ప్రతి ప్రజా సమూహమూ ఏదో ఒక సమస్యతో, ఎన్నో సమస్యలతో సతమతమవుతున్నా అవేవీ పట్టనట్టు, పట్టించుకోకుండా రాజధాని, వికేంద్రీకరణ అనే కల్పిత వివాదం చుట్టూ తిరుగుతున్నారు. ఏ సమస్యలోనైనా, ఏ సందర్భంలోనైనా ప్రజల మౌలిక సమస్యలను చర్చనీయాంశం చేయవలసిన వామపక్షాలు, ప్రగతిశీల ఆలోచనాపరులు కూడ మౌలిక సమస్యలను వదిలి ఈ పాలకవర్గాలు సృష్టించిన వివాదంలో శ్లేష్మంలో పడ్డ ఈగలా కొట్టుకుంటున్నారు. విద్య, వైద్యం, ఆరోగ్యం, రవాణా, సుస్థిర అభివృద్ధి, వ్యవసాయ, పారిశ్రామిక అభివృద్ధి, ప్రజల ఆత్మగౌరవం, సామాజిక న్యాయం వంటి మౌలిక సమస్యల గురించి జరగవలసిన చర్చ అంతా రాజధాని చుట్టూ జరుగుతున్నది. రాజధాని అంశం కూడ కూలంకషంగా చర్చకు రావడం లేదు. పాత రాజధానే కావాలనే చంద్రబాబు నాయుడు వైపా, కొత్త రాజధాని ఏర్పాటు చేయాలనే జగన్ మోహన్ రెడ్డి వైపా అనే అనవసర ద్వంద్వంలోకి ప్రతి ఒక్కరినీ లాగుతున్నారు. కమ్మల రియల్ ఎస్టేట్ ప్రయోజనాల వైపా, రెడ్ల రియల్ ఎస్టేట్ ప్రయోజనాల వైపా అని దీని అంతరార్థం. కమ్యూనిస్టు పార్టీలతో సహా ఆంధ్రప్రదేశ్ రాజకీయాలలో, సమాజంలో ఉన్న ప్రతి ఒక్కరూ ఈ గుడుగుడు గుంచంలో తిరుగుతున్నారు. అక్కడి నుంచి కొంచెం లోతుకు వెళ్లి, ఆ రెండు పాలకపక్షాల ప్రయోజనాలకూ భిన్నంగా, ప్రజల ప్రయోజనాలకు అనుగుణంగా ఈ సమస్యకు పరిష్కారాలను కనిపెట్టవచ్చునా, అసలు ఈ సమస్యకు ఎంత ప్రాధాన్యత ఇవ్వాలి, ఇంతకన్న తీవ్రంగా రాష్ట్ర ప్రజలను పట్టి పీడిస్తున్న సమస్యల పరిష్కారానికి ఏ ఆలోచనలూ ఆచరణలూ చేయవచ్చు అనే మౌలిక ప్రశ్నలే ఒక్క రాజకీయ పక్షానికన్నా, కనీసం కమ్యూనిస్టులమని తమను తాము పిలుచుకుంటున్నవారికైనా రావడం లేదు. ఒక రాష్ట్రమన్నాక రాజధాని ఉండవలసిందే. పాలనా కేంద్రంగా ఆ రాజధాని ప్రజలకు అందుబాటులో ఉండవలసిందే. అందుబాటులో ఉండడం కోసమని ప్రతి ఊరిలో, ప్రతి జిల్లాలో, ప్రతి ప్రాంతంలో రాజధాని పెట్టడం కాదు, పాలనను వికేంద్రీకరించి అన్ని ప్రాంతాలకూ సమన్యాయం జరిగేట్టు చూడడం ముఖ్యం. ఆలోచనాపరులెవ్వరైనా ముందుకు తేవలసింది ఈ సమన్యాయం సమస్య. ఇల్లలుకుతూ పేరు మరిచిపోయిన ఈగలాగ పాలనా వికేంద్రీకరణకు మూలమైన సమన్యాయం అనే మౌలిక భావనను విస్మరించి వికేంద్రీకరణను సారరహితంగా చర్చకు తెస్తున్నారు. ఇప్పటికైనా ఆంధ్రప్రదేశ్ ఆలోచనాపరులు రాజధాని సమస్య నుంచి పైకి ఎదిగి సమన్యాయం, సామాజిక న్యాయం గురించి ఆలోచించడం మంచిది.

వీ

# పశ్చిమాసియా 'శాంతి' ప్రణాళిక

- బైరెడ్డి సతీష్

గత జనవరిలో అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ ఇజ్రాయిల్ ప్రధానమంత్రి బెంజమిన్ నెతన్యాహు సమక్షంలో పాలస్తీనా ప్రతినిధి పక్కన లేకుండానే పశ్చిమాసియా 'శాంతి' ప్రణాళికను ప్రకటించాడు. శతాబ్దపు ఒప్పందంగా ప్రచారం చేయబడిన ఈ ప్రణాళిక దశాబ్దాలుగా రక్తమోడుతున్న పాలస్తీనాకు న్యాయం చేస్తుందా? ద్విరాజ్య విధానానికి వీలు కల్పించిన ఓస్లో ఒప్పందం స్ఫూర్తిని ఈ పరిష్కార ప్రకటన ఏమైనా ప్రతిబింబిస్తున్నదా? చీమల పుట్టలోకి పాములు జొరబడి చీమలనే చిందర వందర చేసిన చందంగా ఉన్న అరబ్బుల ఆవేదనకు అంతిమ పరిష్కారం ఆమోదయోగ్యమైనదేనా? చారిత్రకంగా ఇజ్రాయిల్ అనుసరిస్తున్న విధానాలు వాటిని అమెరికా వెనకేసుకొస్తున్న వైనం చూసిన వారెవరికీ ఈ ప్రణాళిక శాంతి ప్రణాళికలా గోచరించదు. ఇజ్రాయిల్ రాజ్యానికి పాలస్తీనాను సామంత రాజ్యంగా మార్చే ప్రయత్నాన్ని శాంతి ప్రక్రియ పేరుతో మరోసారి అన్ని అంతర్జాతీయ న్యాయ సూత్రాలను తోసిరాజని ఏకపక్షంగా ప్రకటించిన ఈ ప్రణాళికను ప్రకటించిన సందర్భం కూడా గమనించదగినది. అమెరికా అధ్యక్షుడు ట్రంప్‌పై అభిశంసన ప్రక్రియ ఒకవైపు, అవినీతి ఆరోపణల్లో చిక్కుకొని, రెండుసార్లు జరిగిన ఎన్నికల్లో మెజారిటీ సాధించలేక మార్చ్ 2న మరోసారి ఎన్నికలను ఎదుర్కోబోతున్న ఇజ్రాయిల్ ప్రధాని బెంజమిన్ నెతన్యాహూ మరోవైపు. ఈ ఒప్పందం ప్రకారం 1967లో ఇజ్రాయిల్ ఆక్రమించుకున్న ప్రాంతాలన్నీ ప్రధానంగా జోర్డాన్ వ్యాలీ సారవంతమైన భూములన్నీ ఇజ్రాయిల్ చేతుల్లోకి వెళ్తాయి. వెస్ట్ బ్యాంకులో ఇజ్రాయిల్ ఏర్పరచిన 40 వేల జనావాసాలకు చట్టబద్ధత కల్పించబడుతుంది. ఇజ్రాయిల్‌కి జెరూసలేం అవిభజిత శాశ్వత రాజధానిగా కొనసాగుతుంది. జెరూసలేం తూర్పున ఓ మూలన పాలస్తీనా రాజధాని ఉంటుంది. ఇజ్రాయిల్ తీవ్రవాద సంస్థగా ముద్ర వేసిన హమస్‌ను శాశ్వతంగా నిర్మూలించాలి. ఈ ఒప్పందం అమలులోకి వస్తే చారిత్రకంగా పాలస్తీనాకు న్యాయబద్ధంగా దక్కాల్సిన భూభాగంలో కేవలం 15 శాతం మాత్రమే చెందుతుంది. ఇజ్రాయిల్ జైలులో మగ్గిపోతున్న ఏ పాలస్తీనా కుటుంబానికి పాలస్తీనా ప్రభుత్వం ఆర్థిక సహాయం అందించకూడదనే అమానవీయమైన ప్రతిపాదన కూడా ఉన్నది. వెస్ట్ బ్యాంకుపై ఇజ్రాయిల్ మిలిటరీ నియంత్రణ కొనసాగుతుంది. అంతర్జాతీయ క్రిమినల్ కోర్టులో పాలస్తీనా వేసిన కేసులన్నీ ఎలాంటి షరతులు లేకుండా ఉపసంహరించుకోవాలి. ఇలాంటి ప్రతిపాదనల్ని చూసినప్పుడు ఇజ్రాయిల్ ఏం కోరుకుంటుందో అమెరికా అదే అందించినట్టు అర్థం అవుతుంది.

ఈ మొత్తం వ్యవహారంలో పేరుకు మధ్యవర్తిని అని చెప్పుకుంటున్న అమెరికా ఏకపక్షంగా ఇజ్రాయిల్‌ను వెనకేసుకొస్తున్నదని అర్థం చేసుకోవడం పెద్ద కష్టమైన పనేమీ కాదు. యూదులు అరబ్బుల ఘర్షణలో యూదులే బాధితులు అన్నట్టు అమెరికా వ్యవహరించడం వెనుక అమెరికా ఆర్థిక వ్యవస్థ, ఆయుధ వ్యవస్థ నిర్మాణంలో యూదుల పాత్ర కీలకంగా ఉండటమే. రాబోయే ఎన్నికల్లో ట్రంపుకు విరివిగా విరాళాలు అందాలన్నా, ఓట్లు రాలాలన్నా ఇజ్రాయెల్‌ని ఎత్తుకోవడం మినహా మరో మార్గం లేదు. అటు ఇజ్రాయిల్‌లోను ఈ ఎజెండాను ఎవరు ఎత్తుకుంటే వారే ఇజ్రాయిలీ రక్షకులని ముద్ర పడిపోయింది. పేరుకు శాంతి ప్రణాళిక మాత్రమే కానీ ఈ మొత్తం ప్రక్రియలో ఎక్కడా ఐక్యరాజ్య సమితి తీర్మానాలు గాని, అంతర్జాతీయ న్యాయ సూత్రాల స్ఫూర్తి గాని మచ్చుకైనా కనిపించదు. పాలస్తీనీయులకు ఏమాత్రం ఆమోదయోగ్యం కానటువంటి ఏ ప్రక్రియ ప్రగతిని సాధించదు. పశ్చిమాసియా ఇప్పటికే నివురు కప్పిన నిప్పులా ఉన్నది. పరిస్థితి చేయి దాటిపోతే మరింత రక్తపాతమే తప్ప 'శతాబ్దపు ఒప్పందం' సాధించేదేముండదు! వీ





❖ **ప్రతిఘటనా భారత్ జయిస్తుంది** – ఇప్టూ ప్రసాదు (పిపి) – పి.డి.ఎస్.యు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కార్యవర్గం ప్రచురణ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: ఎ. రవిచంద్ర, డోర్ నెం. 53–4–40/1, రామనర్సయ్య భవన్, క్రీస్తురాజపురం, విజయవాడ – 8, ఫోన్ – 9490151292



❖ **నాగర్‌కర్నూలు జిల్లా సాహిత్య చరిత్ర** – గుడిపల్లి నిరంజన్ – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణలు – 102 పేజీలు, 1/8 డెమీ, రు. 40



❖ **ఉర్దూ సాహిత్య చరిత్ర** – మూలం డా. ఎహతెషామ్ హుస్సేన్ – అనువాదం శ్రీ యస్. సదాశివ – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణలు – 326 పేజీలు, 1/8 డెమీ, రు. 130




❖ **అస్తిత్వ** – తెలుగు షార్ట్ ఫిక్షన్ ఫ్రమ్ తెలంగాణ – ప్రధాన సంపాదకులు నందిని సిధారెడ్డి – సంపాదకులు కె. దామోదర్‌రావు, ఎలనాగ – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణలు – 448 పేజీలు, 1/8 డెమీ, రు. 250
పై మూడు ప్రతులకు: తెలంగాణ సాహిత్య అకాడమి, కళాభవన్, రవీంద్రభారతి, హైదరాబాద్ – 500004, ఫోన్ : 040 – 29703142




❖ **విప్లవ కథ 2003 – 2010 –** విరసం ప్రచురణలు – 256 పేజీలు, 1/8 డెమీ, రు. 200



❖ **పట్టణాలకు ప్రవహిస్తున్న అడవి బిడ్డల చెమట, నెత్తురు** – (ఛత్తీస్‌గఢ్ అటవీ ప్రాంత వలస కూలీలపై ఒక అధ్యయనం) – గమిత – విరసం ప్రచురణలు – 64 పేజీలు, 1/8 డెమీ, రు. 50



❖ **దండకారణ్య కథలు 3 –** (2016 – 2019) – విరసం ప్రచురణలు – 216 పేజీలు, 1/8 డెమీ, రు. 150




❖ **నేరేడురంగు పిల్లవాడు** – కథలు – పాణి – విరసం ప్రచురణలు – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 150,
పై నాలుగు ప్రతులకు: పాణి, 87/106, శ్రీలక్ష్మీనగర్, బి–క్యాంప్, కర్నూల్–518002, ఫోన్ : 9866129458



❖ **దగ్గుమాటి పద్మాకర్ కథలు** – ఈస్తటిక్ స్పేస్ – సిక్కోలు బుక్‌ట్రస్ట్ ప్రచురణలు – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: సిక్కోలు బుక్‌ట్రస్ట్, శ్రీకాకుళం – 532001, ఫోన్ : 9989265444




❖ **కథలు – గాథలు – భారతదేశ చరిత్ర, సామాజిక జీవన చిత్రం – ఐదవ భాగం** – దిగవల్లి వేంకటశివరావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణలు – 302 పేజీలు, 1/8 డెమీ, రు. 220




❖ **విశ్వకథావీధి –** దేశదేశాల కథలు – సంకలనం–1 – పురిపండా అప్పలస్వామి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణలు – 206 పేజీలు, 1/8 డెమీ, రు. 170,
పై రెండు ప్రతులకు : నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్), జి.ఎస్.ఐ. పోస్ట్, హైదరాబాద్ – 500068, ఫోన్ : 040 – 29884454




❖ **జాతీయ & అంతర్జాతీయ ఉత్సవాలు –** కాలెండర్ ఆఫ్ ఈవెంట్స్, డా. బుర్ర మధుసూదన్ రెడ్డి, పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 144 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, ఫ్లాట్ నెం. 2, బ్లాక్–6, ఎపిఎచ్‌బి, బాగ్ లింగంపల్లి, హైదరాబాద్ – 500044, ఫోన్ : 040 – 27678430



❖ **బొటానికల్ జూ** – వెజిటబుల్ కార్వింగ్ – డా. కందేపి రాణీప్రసాద్ – స్వాప్నిక్ ప్రచురణలు – 142 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: స్వాప్నిక్ పబ్లికేషన్స్, సృజన్ చిల్డ్రన్స్ హాస్పిటల్, పాత బస్‌స్టాండ్ దగ్గర, సిరిసిల్ల – 505 301



❖ **మారుతున్న లైంగికత – కొత్త హక్కుల రచ్చ** – బాలగోపాల్ స్మారక సదస్సులో చదివిన ప్రసంగ వ్యాసం – ఎ. సునీత – భిన్న స్వరాలు ప్రచురణ – 30 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు: జి.ఎస్. నాగేశ్వరరావు, అడ్వకేట్, ఎన్‌జిఓ మేడమీద, కొత్తపేట, తెనాలి – 522201; ఫోన్ – 7981582807




❖ **మనకేం కావాలి** – ఆంగ్లమాధ్యమమా లేక ఆంగ్ల భాషా పరిజ్ఞానమా – ఎనిశెట్టి శంకర్ – స్నేహ ప్రచురణలు – 16 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు: తుర్లపాటి లక్ష్మి, ఫ్లాట్ నెం. 104, శారద సుందర్ రెసిడెన్సీ, బాపునగర్, చౌడి దగ్గర, సరూర్‌నగర్, హైదరాబాద్ – 500036, ఫోన్ : 9704225469




❖ **తను నేను వాక్యం** – కవిత్వం – బిల్ల మహేందర్ – అఆ ప్రచురణలు – 44 పేజీలు, 1/8 డెమీ, రు. 100,
పై రెండు ప్రతులకు: బిల్ల మహేందర్, ఇ.నెం. 35–7–674, టిఎన్‌జిఓస్ కాలనీ, ఫేస్–11, వడ్డేపల్లి, హన్మకొండ, వరంగల్ – 506370, ఫోన్ : 91776 04430

# సంక్షోభ కాలపు బడ్జెట్

*కేంద్ర బడ్జెట్ ప్రస్తుత సంక్షోభాన్ని అధిగమించేందుకు ప్రయత్నించకుండా అంకెల గారడీలా ఉందనీ, సామాన్య ప్రజల జీవితాలను మరింత ఛిద్రం చేస్తూ కార్పొరేట్లకు పెద్ద ఎత్తున రాయితీలు ఇచ్చిందనీ అంటున్నారు* **డా. ఎ. పున్నయ్య**

**భా**రత పార్లమెంట్‌లో బడ్జెట్ ప్రవేశం ఈసారి కవితా పరిమళాలతో విరబూసినా తావిలం లేని పువ్వులా వెలవెలబోయింది. మోదుగు పూవు ఎంత ఎర్రగా పూసినా పరిమళం లేని దాన్ని ఎవరూ తలలో ధరించరు కదా! ఇది అంతే తాము ప్రవేశపెట్టిన పరిమళభరితమైన బడ్జెట్ పూలను 'మోడీ' సులోచనాల్లోంచి అవలోకించమని చెప్పడమే గాక, కౌటిల్యుని మౌలిక సూత్రాలను సైతం తమ దృష్టికోణానికి పరిపడా సవరించుకునే 'కుబుద్ధి' స్పష్టమైంది. ఆర్థిక మంత్రి సుదీర్ఘ బడ్జెట్ ప్రసంగం కశ్మీరీ కవిత, తమిళ కవుల పలుకులు ఉటంకిస్తూ ప్రాచీన సింధూ నాగరికత వైభవాన్ని గుర్తు చేసింది.

తమిళ సాహిత్యంలో ప్రధానమైన తిరుకురాల్ లోని సంపద గొప్పతనాన్ని ప్రస్తావించింది. కౌటిల్యుని అర్థశాస్త్రంలో పన్నుల విధానాన్ని గుర్తుచేసిందే కాని వ్యవసాయం, విద్యా, వైద్య రంగాలకు సింహభాగం కేటాయింపులుండాలన్న స్ఫూర్తిదాయకమైన ఆలోచనలను అమలు చేయలేదు. కౌటిల్యుడు ప్రజలకు పన్ను చెల్లించడం బాధాకరంగా ఉండకూడదంటాడు. పువ్వు నుంచి తుమ్మెద తనకు సరిగ్గా కావాల్సినంత తేనుని గ్రోలినట్లు జీవించడానికి వీలుగా పన్ను వసూలు చేయాలన్న సత్యాన్ని ఉటంకించి దాని ప్రకారం పన్ను విధానం బడ్జెట్‌లో ప్రతిబింభించి ఉంటే ఆదర్శంగా ఉండేది. కాని దానికి భిన్నంగా ఉండడం ఈ బడ్జెట్‌లో గమనార్హం. కావున ఈ బడ్జెట్ అసాంతం కవితలతో అలరించిన కాల్పనిక బడ్జెట్ కాని వాస్తవికత కొరవడిందనేది యథార్థం.

### విషమిస్తున్న ఆర్థిక మాంద్యానికి పరిష్కార మార్గం చూపని బడ్జెట్

గతంలో ఎన్నడూ లేనంతగా ఆర్థిక మాంద్యం భారతదేశాన్ని తీవ్రమైన ఒడిదుడుకులకు గురిచేస్తుంది. కొనుగోలు శక్తి తగ్గడంతో సమిష్టి డిమాండ్ తగ్గింది. ఈ ప్రభావం స్థూలంగా ఆర్థిక రంగాన్ని బలహీన పరిచింది. ఈ క్రమంలో వృద్ధిరేటు పల్టీలు కొడుతూ ఏడేళ్ల కనిష్ట స్థాయికి పడిపోయింది. ఊర్ధ్వముఖంగా ద్రవ్యోల్బణం వేగం పెంచింది. నిరుద్యోగం నాలుగున్నర దశాబ్దాల గరిష్టస్థాయిని తాకింది. పేదరికం విళయ తాండవం చేస్తోంది. ఈ ధాటికి కొన్ని కంపెనీలు మూతపడితే మరికొన్ని కంపెనీలు ఉత్పత్తిని తగ్గించుకుంటున్నాయి. ఫలితంగా లక్షలాది మంది ఉపాధి కోల్పోయి రోడ్డు మీదికి వస్తున్నారు. మొత్తం ఆర్థిక వ్యవస్థ తీవ్రమైన అలజడికి గురైంది. ఈ కీలక సమయంలో ప్రవేశపెట్టిన బడ్జెట్ సాంప్రదాయకంగా, ఆశామాషిగా కాకుండా దేశ పౌరులందరి ఆర్థిక సాధికారత సాధించేందుకు దోహదపడాలి. ఆర్థిక వృద్ధిని పునర్జీవింపజేసి నూతన దశాబ్దంలో ఆర్థిక రంగ పునాదులను బలోపేతం చేస్తుందని, ఉపాధి కల్పనతో పాటు మౌలిక వసతుల ప్రాధాన్యత ఉంటుందని ఆర్థిక రంగ విశ్లేషకులతో పాటు ప్రజలందరు ఆసక్తిగా ఎదురు చూశారు. కాని ఈ బడ్జెట్‌లో బలహీనపడిన ఆర్థిక వ్యవస్థను నిర్మాణాత్మకంగా తీర్చిదిద్దే కనీస చర్యలు కనిపించడం లేదు. ప్రజల ఆదాయం పెట్టుబడులతో పాటు డిమాండ్ వినియోగాన్ని పెంచేందుకు కేటాయింపుల్లో ప్రాధామ్యాలేమి లేవు. మొత్తంగా ఈ బడ్జెట్ రైతులకు, మధ్యతరగతికి, సామాన్యులకు, వేతన జీవులకు సైతం రిక్త హస్తాలను చూపి కార్పొరేట్లకు, పెట్టుబడిదారులకు మాత్రం గతం మాదిరిగానే అభయ హస్తాన్నిచ్చింది.

దేశ ఆర్థిక వ్యవస్థను పీడిస్తున్న ప్రతికూలతలను గుర్తించకుండా, వాస్తవాలతో సంబంధం లేకుండా చక్రీయ హెచ్చుతగ్గుల కారణంగానే ఆర్థిక వ్యవస్థ పురోగతి మందగించిందని ఈ సంక్షోభ పరిస్థితిని అప్పులు తీసుకొని ప్రస్తుతం అమల్లో ఉన్న కార్యక్రమాలకు నిధులను సమకూర్చి నామమాత్రంగా కొత్త పథకాలను ప్రకటించడంతో దేశ ఆర్థిక వ్యవస్థ మెరుగు పడుతుందని, మరోసారి ఆర్థిక వ్యవస్థ కుంగుబాటును మసిపూసి మారేడుకాయ చేసి చూపారు.

స్థూలంగా ఘనమైన లక్ష్యాల ప్రకటనే కాని వాటిని సాధించడానికి అవసరమైన, ఖచ్చితమైన ప్రణాళికలు లేని దుస్థితి ఈ బడ్జెట్‌లో కనిపించింది. కాని ఆర్థిక సంక్షోభం నుంచి దేశాన్ని గట్టెక్కించేందుకు అసలైన పరిష్కార మార్గాలు చూపలేదు. అస్తవ్యస్త ఆర్థిక విధానాల వల్ల దేశ జనాభాలో ఒక శాతంగా ఉన్న అత్యంత సంపన్నుల దగ్గర 74 శాతం ప్రజలందరికీ ఉన్నంత సంపద పోగు పడింది. ఇది ఆర్థికాభివృద్ధికి చిహ్నం కాకపోగా, రాబోయే సామాజిక, ఆర్థిక మహా సంక్షోభానికి నిలువెత్తు హెచ్చరిక మాత్రమే.

### ద్రవ్యలోటు అంచనాల్లో వైఫల్యం

వెనక్కి లాగుతూ భయపెడుతున్న ద్రవ్యలోటు ఒకవైపు, రోజురోజుకూ అంతకంతకూ దిగజారుతున్న ఆర్థిక వ్యవస్థ తీరును ఒప్పుకోలేని అశక్తత నేపథ్యంలో గత సంవత్సరం సవరించిన బడ్జెట్ అంచనాలకంటే 12.73 శాతం అధికంగా రు. 30,42,230 కోట్ల భారీ బడ్జెట్‌ను ఈ సంవత్సరానికి ప్రవేశపెట్టారు. ప్రత్యక్ష పన్నుల ద్వారా రు. 24.23 లక్షల కోట్లు, పన్నేతర ఆదాయం ద్వారా రు. 3.85 లక్షల కోట్లు, అప్పుల ద్వారా రు. 8.49 లక్షల కోట్లు, ప్రభుత్వ రంగ సంస్థల ద్వారా లాభాల్లో డివిడెంట్స్ ద్వారా రు. 1.55 లక్షల కోట్లు, ప్రభుత్వ రంగ పెట్టుబడుల ఉపసంహారణ ద్వారా రు. 2.10 లక్షల కోట్లు ఈ బడ్జెట్‌కు ఆదాయాన్ని అంచనా వేశారు. మొత్తంగా పన్ను ఆదాయంలో గతం కంటే ఈ బడ్జెట్‌లో అధనంగా 12 శాతం వృద్ధిని చూపారు. గత బడ్జెట్‌లో దేశ వృద్ధి రేటులో ద్రవ్యలోటును 3.3 శాతానికి పరిమితం చేసి చూపగా, అది 3.8 శాతానికి చేరింది. ఈ బడ్జెట్‌లో ద్రవ్యలోటును 3.5 శాతానికి

సవరించారు. పడిపోయిన ప్రభుత్వ రాబడుల దృష్ట్యా ద్రవ్యలోటు కట్టడి లక్ష్యాలను 0.5 శాతం పెంచుతున్నట్లు అంచనా వేయడం వంచనా శిల్పానికి నిదర్శనమే. ఈ అంచనాలు సత్య దూరమైనవి. ఒకపక్క కార్పొరేట్ పన్నును తగ్గించింది. వ్యక్తిగత ఆదాయ పన్నును కూడా తగ్గించామని చెపుతూనే ఈ తగ్గింపు వల్ల రు. 2.15 లక్షల కోట్ల ప్రత్యక్ష పన్నుల ఆదాయం కోల్పోతున్నామని ఒకవైపు వాపోతూనే మరోవైపు రాబోయే సంవత్సరానికి 2.6 లక్షల కోట్ల స్థూల పన్ను పెరుగుతుంద నడాన్ని ఈ ప్రభుత్వం ఎట్లా సమర్థించుకుంటుందో తెల్పాల్సిన అవసరమున్నది.

### పరిగణించని ఆర్థిక సర్వే సూచికలు

బడ్జెట్ ముందు సంవత్సరంలో దేశంలో ఆర్థిక పరిస్థితులు ఎలా ఉన్నాయో, రాబోయే సంవత్సరంలో ఎలాంటి ఆర్థిక విధానాలు పాటించాలో అన్ని విభాగాధిపతులతో చర్చించి ఒక నివేదికను సమగ్రంగా ప్రభుత్వం తయారు చేస్తుంది. ఈ నివేదికను ఆర్థిక సర్వే అంటారు. ఈ సర్వేను ఆర్థిక మంత్రి బడ్జెట్ ప్రవేశ పెట్టడానికంటే ఒకరోజు ముందు పార్లమెంట్‌లో ప్రవేశ పెడతారు. ఈ సర్వే నిజానికి అన్ని శాఖల పనితీరుకు ప్రతిబింబంగా ఉంటుంది. దేశ ఆర్థిక వృద్ధి లక్షణాలను నిశితంగా పరిశీలిస్తుంది. ఈ సంవత్సర ఆర్థిక సర్వే మందగమన పరిస్థితుల తీవ్రతను తెలిపింది. వ్యవసాయ పారిశ్రామిక వృద్ధిరేట్లు తగ్గుల వలన 2019-20లో స్థూల జాతియోత్పత్తిలో 5 శాతం వృద్ధి తగ్గిందని సర్వే స్పష్టం చేసింది. ఈ అనుభవం ప్రకారం బడ్జెట్‌లో కేటాయింపుల్లో ప్రాధాన్యతలుంటే దేశం పురోగతి చెందుతుంది. దురదృష్టవశాత్తు దీనికి విరుద్ధంగా కేటాయింపులున్నాయి. వైద్య పరిభాషలో 'ఆర్థిక సర్వే'ను వ్యాధి లక్షణాల నిర్ధారణ నివేదిక లాంటిది. సాధారణంగా వైద్యులు ఆ నివేదిక ఆధారంగా ఆ జబ్బుకు తగిన ఔషధాల మోతాదులను అందిస్తే ఆ జబ్బు నయమవుతుంది. కాని ఆర్థిక మంత్రి జబ్బు ఒకటని నిర్ధారిస్తే ఔషధమొకటిచ్చింది. దీంతో ఉన్న జబ్బు నయం కాకపోగా కొత్త కొత్త జబ్బులోస్తాయనేది చారిత్రక వాస్తవం.

ఆర్థిక సర్వేతో పాటు దేశ ప్రధాన ఆర్థిక సలహాదారుని సలహాలను కూడా పరిగణలోకి తీసుకోలేదని ఈ బడ్జెట్ కేటాయింపులు తెలియ జేస్తున్నాయి. ప్రస్తుతం 3 లక్షల కోట్ల డాలర్లుగా ఉన్న స్థూల దేశీయోత్పత్తి 2024-25 నాటికి 5 లక్షల కోట్ల డాలర్లకు చేరాలంటే కనీసం వృద్ధిరేటు 11 శాతమైనా ఉండాలి. నిజానికి 5 నుండి 7 శాతం దగ్గరే కొట్టుమిట్టాడడం గమనార్హం. మార్చ్‌తో ముగియనున్న ఈ ఆర్థిక సంవత్సర వృద్ధిరేటు 4.5 శాతానికే పరిమితమై 11 ఏండ్ల కనిష్టానికి దిగజారనుందనేది వాస్తవం. ఈ నేపథ్యంలో మరిన్ని ఉద్దీపన చర్యలు ప్రకటించాల్సిన అవసరముంటే ఈ బడ్జెట్ ఆర్థిక సర్వేలో చెప్పిన విషయా లను పూర్తిగా విస్మరించడం విశ్లేషకులతో పాటు, ప్రతిపక్ష నాయకులతో పాటు, అధికార పక్ష నాయకులను సహితం విస్మయ పరిచింది.

### గందరగోళపరుస్తున్న వృద్ధిరేట్ల అంచనా

స్థూల దేశీయోత్పత్తి వాస్తవిక వృద్ధిరేటు 5 శాతం కంటే తక్కువ ఉంటే ద్రవ్యోల్బణాన్ని సైతం కలుపుకొని చెప్పే నామమాత్రపు వృద్ధిరేటు 10 శాతంగా అంచనా వేశారు. అర్థం కాని, అర్థమే లేని గణాంకాలతో దేశ ప్రజల ఆలోచనలను బోల్తా కొట్టిస్తున్నారు. ముఖ్య రంగాలైన వ్యవసాయానికి 2.1 శాతం, విద్యకు 4.7 శాతం, గ్రామాభివృద్ధికి 2.9 శాతం, వాణిజ్య పరిశ్రమలకు 0.7 శాతం, వైద్యానికి 3.8 శాతం నిధులను కేటాయించి చేతులు దులుపుకున్నారు. ఇంకా ఆశ్చర్యంగా సబ్సిడీల రూపంలో రైతులకు, అల్పాదాయ వర్గాలకు లబ్ధి చేకూర్చే ఆహార, పెట్రో ఎరువుల సబ్సిడీ మొత్తంలో 25 శాతం మేర కోత విధించారు. దీని వలన కొనుగోలు శక్తి తగ్గి వస్తు డిమాండ్ తగ్గుముఖం పడుతూ వృద్ధిరేట్లు తగ్గుతాయి. ఒకవైపు వృద్ధిరేట్లు సాంకేతికంగా తగ్గే అవకాశాలు కన్పిస్తుంటే వృద్ధిరేట్ల లక్ష్యాలు మాత్రం పెరుగుతున్నట్లు ప్రకటిస్తున్నారు. ఏది ఏమైనా ఈ కీలక సమయంలో ప్రజల కొనుగోలు శక్తిని పెంచే ముఖ్యమైన రంగాల్లో తగిన కేటాయింపులుంటేనే వృద్ధి సాధ్యమవుతుంది. అతి ముఖ్యమైన రంగాలైన వ్యవసాయం, గ్రామీణాభివృద్ధి, విద్య, వైద్యం తదితర రంగాలకు బడ్జెట్ అవసరమైనంత కేటాయించకపోవడం ముమ్మాటికిది ప్రగతి నిరోధక చర్యే. ఇది దేశ పురోభివృద్ధితో పాటు సామాజికాభివృద్ధిపై దీని ప్రభావం చూపుతుంది.

### వ్యవసాయ గ్రామీణాభివృద్ధి రంగాలు అప్రధానం

ఆర్థిక మందగమనం నుంచి గ్రామీణ భారతాన్ని గట్టెక్కించేందుకు దండిగానే నిధులు కేటాయించాల్సిన అవసరమున్నది. నేటికి దేశంలో 70 శాతంగా ఉన్న రైతులకు పంట పెట్టుబడికి రుణాలందక, పంటకు సరైన గిట్టుబాటు ధర రాక అప్పుల బాధతో సతమతమవుతూ అన్నదాతలు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. దేశంలో ఏటా 16 వేల మంది రైతులు బలవన్మరణం పాలవుతున్నారు. అంటే సగటున రోజుకు 40 మంది రైతుల ప్రాణాలు గాలిలో కలుస్తున్నాయి. కాని 2016 నాటి రైతుల ఆత్మహత్యల వివరాలు 2018 విడుదల చేసింది. 2017-198, 2019 సంవత్సరాల ఆత్మహత్యల వివరాలను నేటికీ తొక్కిపెట్టింది. దీనిని కప్పిపుచ్చుకునేందుకు 2022 నాటికి అన్నదాతల ఆదాయాన్ని రెట్టింపు చేస్తామంటుంది. సంకల్పాన్ని స్వాగతించాల్సిందే కాని ఆచరణేది.

### పాత పథకాలకే 16 సూత్రాల ప్రణాళికగా పేరు

రైతు సంక్షేమానికి కేంద్రం 16 సూత్రాలను ప్రకటించింది. ఈ అట్టహాసపు ప్రకటనను నిశితంగా గమనిస్తే వ్యవసాయ భూమి ఆధునీకరణ, పాల ఉత్పత్తి సామర్థ్యం పెంపు, చేపల ఉత్పత్తి పెంపు, మార్కెటింగ్ ప్రాసెసింగ్, రసాయన ఎరువుల వాడకాన్ని తగ్గింపుకై చర్యలు, నాబార్డుల నుండి గిడ్డంగుల నిర్మాణానికి చర్యలు, కోల్డ్ స్టోరేజీల పెంపు, ఉద్యాన పంటల పెంపు, సాగునీరు పెంపు లాంటివన్ని కూడా కొనసాగుతున్న పథకాలే. ఒక్క కిసాన్ రైలు, కిసాన్ ఉడాన్ (విమానం) ద్వారా త్వరగా పాడైపోయే ఉత్పత్తులను రవాణా తప్ప మిగిలినవన్ని పాత పథకాలే.

2023 నాటికి ఆహార ధాన్యాల ఉత్పత్తిని 200 లక్షల టన్నులకు పెంచుతామన్నారు. కాని ఏ ప్రాతిపదికన ఉత్పత్తి పెరుగుతుందో స్పష్టం చేయలేదు. ఇంకా ఆశ్చర్యంగా యువతను ప్రోత్సహించి వ్యవసాయ రంగాల్లో భాగస్వామ్యం చేస్తామంటున్నారు. నేడు వ్యవసాయ ఉత్పత్తులకు మద్దతు ధరను ముందే ప్రకటించాలని చేసే రైతాంగ పోరాటాలను పరిగణలోకి తీసుకోలేదు.

పంటల సేకరణ, నిల్వ, శుద్ధి, బీమా మొదలైన వాటిలోకి కార్పొరేట్లు, బహుళజాతి కంపెనీలు మరింత ఎక్కువ చొరబడడాన్ని ఈ బడ్జెట్

ప్రతిపాదిస్తుంది. మెజారిటీ ప్రజలను మెప్పించడానికి వ్యవసాయ రంగానికి ప్రాధాన్యత ఇచ్చినట్లు ప్రకటిస్తుంది. బడ్జెట్ పత్రాలను పరిశీలిస్తే కేటాయింపుల ప్రకటనకు చేసిన ఖర్చుకు మధ్య చాలా వ్యత్యాసం ఉంటుంది. 2019-20 బడ్జెట్‌లో 9.83 శాతం కేటాయింపులుండగా, 2020-21 బడ్జెట్‌లో 9.30 శాతానికి పడిపోయింది. గత బడ్జెట్‌లో 2.68 లక్షల కోట్లు, దీనిని ఈ సంవత్సరం 2.83 లక్షల కోట్లకు పెంచారు. ద్రవ్యోల్బణం పరిగణలోకి తీసుకుంటే వాస్తవ బడ్జెట్ తగ్గినట్లే. గత సంవత్సరం పిఎం కిసాన్ పథకానికి రు. 75,000 కోట్లు కేటాయించి అందులో 70 శాతంగా అనగా రు. 54,000 కోట్లు మాత్రమే ఖర్చు చేశారు. పిఎం ఆశాకి గత సంవత్సరం 1500 కోట్లు కేటాయిస్తే, ఈసారి అందులో మూడోవంతు కేవలం రు. 500 కోట్లు కేటాయించడం దారుణం. రైతాంగానికి మరింత కేటాయింపులు ఉండవలసిన సమయంలో కేంద్ర ప్రభుత్వం మరోసారి నిర్లక్ష్య వైఖరి అవలంభించింది. దీనితో రైతుల ఆదాయాలు రెట్టింపు సాధ్యం కాదు కదా పొదుపులు, ఆహార భద్రత, ఉపాధి మొదలైన వాటిపై తీవ్ర ప్రభావం ఉంటుంది. రైతుల ఆదాయాన్ని రెండింతలు పెంచడానికి ఈ బడ్జెట్ ఏ విధమైన రోడ్ మ్యాప్‌ను చూపించలేకపోయింది.

### విద్యా రంగ అభివృద్ధే సమగ్రాభివృద్ధి

ఒక దేశాన్ని ధ్వంసం చేయాలంటే అణుబాంబులు అక్కర్లేదు. క్షిపణులు అసలే అనవసరం. కేవలం ఆ దేశపు విద్యా విధానాన్ని దిగజార్చితే ఆ దేశపు డాక్టర్ల చేతులో రోగులు హరీ అంటారు. ఆ దేశపు ఇంజనీర్లు కట్టిన భవనాలు, వంతెనలు కుప్పకూలిపోతాయి. ఆ దేశపు ఆర్థిక శాస్త్రవేత్తల గణాంక నిపుణుల చేతుల్లో ఆర్థిక వ్యవస్థ కుదేలవుతుంది. ఆ దేశపు మత ప్రచారకుల చేతుల్లో మానవత్వం మంటకలుస్తుంది. ఆ దేశపు న్యాయమూర్తుల చేతుల్లో న్యాయం ఉరేసుకుంటుందని విద్యా విధానం పతనమైతే ఆ దేశం అన్ని రంగాలల్లో పతనం అవుతుందని దక్షిణాఫ్రిక విశ్వవిద్యాలయ ప్రవేశ ద్వారం వద్ద రాసి ఉన్న వ్యాఖ్యాలు ప్రపంచ దేశాలన్నింటికీ వర్తిస్తాయి.

గతంలో విద్యా, వైద్య రంగాల అభివృద్ధిపై అభివృద్ధి చెందిన దేశాల పేర్లను కోట్ చేసేవాళ్లం. కాని నేడు దేశ రాజధాని ఢిల్లీ నిలువెత్తు నిదర్శనంగా మారింది. ఢిల్లీలోని విద్యాభివృద్ధి దేశానికే తలమానికంగా మారింది. 2019-20 ఆర్థిక సంవత్సరంలో రు. 60 వేల కోట్లతో ఢిల్లీ ప్రభుత్వం బడ్జెట్ ప్రవేశపెడితే కేవలం విద్యా, వైద్య రంగాలకు 38.47 శాతం నిధులు కేటాయించింది. ఇందులో విద్యా రంగానికి రు. 15,601 కోట్లు (26 శాతం), వైద్య రంగానికి రు. 7,480 (12.47 శాతం) కోట్లు ప్రతిపాదించింది. ప్రభుత్వ విద్య కార్పొరేట్లను మించింది. ఈ ప్రభుత్వ ఆచరణాత్మక అడుగులు బడుగుల జీవితాలలో కాంతిని నింపినాయి. కాని కేంద్ర ప్రభుత్వం విద్యా రంగం మీద పెట్టుబడులను క్రమంగా తగ్గిస్తుంది. విద్యారంగ అభివృద్ధే సమాగ్రాభివృద్ధిగా భావించాలి.

### ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి విద్యా రంగమే వెన్నెముక

ఈ దేశంలో విద్యా హక్కు అమలు జరగాలంటే ప్రాథమిక విద్యను కీలకంగా ముందుకు తీసుకుపోవాలి. సర్వశిక్ష అభియాన్‌కు బదులు సమగ్ర శిక్ష అన్న పేరుతో పథకాన్ని ప్రారంభించారే తప్ప, కేటాయింపులు క్రమంగా తగ్గిస్తున్నారు. మొత్తం విద్యా రంగానికి 2018-19 బడ్జెట్‌లో 3.47 శాతం కేటాయిస్తే, 2019-20 నాటికి 3.42 శాతానికి కుదించారు. ఈ బడ్జెట్‌లో 99,312 కోట్లుగా మొత్తం బడ్జెట్‌లో 3.2 శాతం మొత్తంగా బడ్జెట్‌లో విద్యా రంగానికి కేటాయింపులను తగ్గించడమంటే ఈ దేశాన్ని పతనం చేయడమే. విద్యా రంగంలో వృద్ధి విద్యా కోర్సులకు ప్రాధాన్యత లేకపోవడం వల్ల నిరుద్యోగం గతంలో లేనంతగా పెరిగిపోయింది. 31 మిలియన్ల యువత ఖాళీగా గడుపుతున్నారు.

విద్యా రంగంలోకి పెట్టుబడులు అధికంగా కేటాయించి కృత్రిమ మేధా ఐఒటి, బిగ్ డేటా, మెషన్ లర్నంగ్ వంటి ఆధునిక కోర్సులకు ప్రాధాన్యతను విస్తరింపచేయాలి. ప్రపంచంలో పరిశ్రమలలో ఆధునిక సాంకేతికకు పెదపీట వేస్తుంటే, మా దేశ విద్యా సంస్థల్లో బూజుపట్టిన పాత పాఠాలనే వల్లెవేస్తున్నారు. మౌలిక వసతులు, అనుభవం గల సిబ్బందిని నియామకం చేయడం లేదు. పాఠశాలలు మొదులకొని విశ్వవిద్యాలయాల వరకు బోధన సిబ్బంది, మౌలిక వసతుల కల్పనలో ఈ ప్రభుత్వాలు వెనుకబడినాయి. కనీసం నేటికైనా గుర్తించడం లేదు. నూతన జాతీయ విద్యా విధానాన్ని అమలు చేస్తామని ప్రకటించారు తప్ప, ఈ జాతీయ విద్యా విధానంపై విద్యా వ్యవస్థలో భాగసాములైన, పౌర సమాజం, ఉన్నత విద్యావంతులు, ఉపాధ్యాయ, అధ్యాపక సంఘాల ప్రతినిధులు, ప్రభుత్వ అధికారులతో చర్చించి విద్యలో ఎటువంటి మార్పులు తీసుకురావాలో చర్చించాలి. దేశ ఆర్థిక వ్యవస్థకు విద్యే వెన్నెముక. దాన్ని విమర్శిస్తే ఐదు ట్రలియన్ల ఆర్థిక వ్యవస్థ అందుకోవడం అసాధ్యమేనని ప్రభుత్వాలు గ్రహించాలి.

### వైద్య రంగం

దేశాన్ని ఆరోగ్య భారత్‌గా మార్చడమే లక్ష్యంగా కేంద్ర ప్రభుత్వం ఆరోగ్య రంగానికి పెద్దపీట వేసిందని ప్రకటించారు. జిడిపిలో ప్రజారోగ్యానికి కేటాయింపులు కేవలం 1.28 శాతానికి పరిమితమైంది. ఈ కేటాయింపులతో అందరికి ఆరోగ్యం ఎట్లా సాధిస్తుందో స్పష్టం చేయలేదు. ఈ కేటాయింపులతో ఫిట్ ఇండియా ఉద్యమం పేరుతో కార్యక్రమం చేయనున్నట్లు ప్రకటించారు. ఆయుష్మాన్ భారత్ పథకం కింద ఆస్పత్రులు లేని జిల్లాల్లో హాస్పిటల్స్ నెలకొల్పనున్నట్లు ప్రకటించారు. ఆచరణలో మాత్రం ఈ దేశంలో వైద్య రంగం సింహ భాగం ప్రైవేట్ రంగంలోనే ఉంది. ఉచిత, నాణ్యమైన వైద్య సేవలందిస్తేనే భారతదేశ ఆరోగ్య పరిస్థితి పెరుగుపడుతుంది. దీనికోసం కేటాయింపు లను బాగా పెంచాల్సిన అవసరం ఉన్నది.

### వేతన జీవులను నిరాశపరిచిన బడ్జెట్

ప్రతి బడ్జెట్‌కు ముందు మధ్యతరగతి ప్రజలు ఆశగా ఎదురుచూసేది ఆదాయ పన్ను మినహాయింపు పైన్నే. గడిచిన సంవత్సరం కన్నా ఈసారి భారం తగ్గిస్తే బాగుంటుందని సహజంగా ఆశిస్తారు. ఈ బడ్జెట్ మధ్య తరగతి వేతన జీవులకు నిరుత్సాహాన్ని మిగిల్చింది. మూడు స్లాబులకు బదులుగా ఏడు స్లాబులతో కొత్త విధానం ప్రకటించినారు. పాత, కొత్త రెండూ కొనసాగుతాయన్నారు. రెండింటిలో ఏదో ఒకటి ఎవరికి వారే తేల్చుకోవాలి. కొత్త విధానంలోకి వస్తే మినహాయింపుల సెక్షన్ 80 జీ, తదితర సెక్షన్‌ల కింద లభించే 1.5 లక్షల మినహాయింపులో, రెండు లక్షల వరకు గృహ రుణాలపై వచ్చే మినహాయింపులుండవు. దీనివల్ల

భవిష్యత్తులో రుణాలు తీసుకునే వారి సంఖ్య తగ్గుతుంది. సామాన్యుల పొదుపు వల్ల ప్రభుత్వానికి అధిక లాభం ఉంటుందని విశ్లేషకులు చెబుతుంటే, సామాన్యుల నుండి ప్రభుత్వానికి వచ్చే అసలు ఆదాయాలకు గండిపడే అవకాశాలు లేకపోలేదు. దీంతోపాటు విద్యా, ఆరోగ్యంపై ఇచ్చే మినహాయింపులను తొలగించడం వల్ల మధ్యతరగతి కుటుంబాలపై ఎక్కువ భారం పడుతుంది. పిల్లలు నాణ్యమైన విద్యను పొందాలంటే ప్రైవేట్ విద్యా సంస్థల్లోనే కాదు, ప్రభుత్వ విద్యా సంస్థలు కూడా అధిక మొత్తంలో ఫీజులు వసూలు చేస్తున్నాయి. అదే విధంగా 80డి కింద ఆరోగ్య బీమా చేస్తున్నారు. మినహాయింపులను తొలగించడం వలన స్థూలంగా పొదుపు తగ్గే అవకాశాలున్నాయి. పొదుపు తగ్గడమనేది మూలధన కల్పనకు నష్టం జరిగే అవకాశాలున్నాయి. ఆదాయపన్ను విషయంలో ఏదో కొత్త కనికట్టు చేసినా అది అధికాదాయ వర్గాలకే లభిస్తుంది. కావున అన్ని వర్గాలకు మినహాయింపులతో వెసులుబాటు కలిగే స్లాబులను కొనసాగిస్తేనే బాగుంటుంది.

**తెలుగు రాష్ట్రాలకు నిలువెత్తు మోసం**

దక్షిణాది రాష్ట్రాలు ఎంతో కాలంగా భయపడుతున్నదే ఈ బడ్జెట్‌లో జరిగింది. 1971 జనాభా లెక్కల ప్రకారం కాక 2011 జనాభా లెక్కల ఆధారంగా రాష్ట్రాలు నిధుల్లో వాటాలివ్వాలన్న 15వ ఆర్థిక సంగం కొత్త లెక్కల కారణంగా ఈ రాష్ట్రాలు భారీగా నష్టపోతున్నాయి. జనాభా నియంత్రణపై ఇవి పెట్టిన శ్రద్ధకు శిక్ష ఇది. వచ్చే ఆర్థిక సంవత్సరం 11 శాతం వృద్ధిరేటు అంచనాతో కట్టిన లెక్కలను బట్టి ఈ ఏడాదిలోనే ఈ నాలుగు రాష్ట్రాలు 16 వేల కోట్లు కోల్పోతాయి. ఆంధ్రప్రదేశ్‌కు 1521 కోట్లు, తెలంగాణకు దాదాపు 2400 కోట్లు తగ్గిపోతాయి. ఇక ఈ ఐదేళ్ల కాలంలో మరింత భారీగా నష్టపోతాయి.

ఈ బడ్జెట్‌లో కేంద్రం తెలుగు రాష్ట్రాలకు రిక్తహస్తమే చూపించింది. కొత్త ప్రాజెక్టులను ప్రకటించకపోగా, కనీసం విభజన హామీలను సైతం నెరవేర్చలేదు. తెలంగాణకు కోటి ఎకరాల సాగునీరు అందించేందుకు లక్ష కోట్ల భారీ వ్యయంతో ప్రతిష్టాత్మకంగా నిర్మించిన కాళేశ్వరం ఎత్తిపోతల పథకాన్ని జాతీయ ప్రాజెక్టుగా గుర్తించాలన్న డిమాండ్‌ను విస్మరించినారు. కేంద్ర పన్నుల్లో రాష్ట్రాల వాటా రాజ్యాంగ పరమైన హక్కు. ఈ మేరకు తెలంగాణ రాష్ట్రానికి 2019-20 ఆర్థిక సంవత్సరంలో రు. 19,718 కోట్లు రావాల్సింది. కాని సవరించిన అంచనాలలో కేవలం రు. 15,987 కోట్లకు కుదించారు. దీనివల్ల ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో తెలంగాణ రాష్ట్రానికి రావాల్సిన నిధుల్లో రు. 3,731 కోట్లు తగ్గాయి. దీంతో తెలంగాణ ఆర్థిక ప్రణాళిక తారుమారైంది.

కేంద్రం నుంచి వచ్చే పన్నుల్లో రాష్ట్రాలకు చెల్లించే వాటాలను 42 శాతం నుంచి 41 శాతం తగ్గిస్తూ 15వ ఆర్థిక సంఘం చేసిన సిఫారసులను కేంద్రం ఆమోదించింది. దీంతో తెలంగాణకు గతంలో రావాల్సిన 2.437 శాతం వాటాను ఈ ఆర్థిక సంవత్సరంలో 2.133 శాతానికి తగ్గింది. దీంతో కేంద్రం పన్నుల్లో వాటాగా రావాల్సిన నిధుల్లో రు. 2.381 కోట్లు తగ్గినాయి. జిఎస్‌టి విషయంలో కేంద్రం రాష్ట్రాలను మోసం చేస్తుంది. 14 శాతంలోపు ఆదాయ వృద్ధిరేటు కలిగిన రాష్ట్రాలకు ఏర్పడే లోటును ఏడేళ్ల పాటు భర్తీ చేస్తామని 2017లో జిఎస్‌టి చట్టంలో చెప్పారు. ఈ ప్రకారం తెలంగాణ రాష్ట్రానికి జిఎస్‌టి పరిహారంగా రావాల్సిన రు. 1135 కోట్లు విడుదల చేయాలి. కాని దీనిమీద స్పష్టత లేదు. తెలంగాణ ప్రభుత్వం చేపట్టిన మిషన్ భగిరథ, మిషన్ కాకతీయ పథకాలకు రు. 24 వేల కోట్లు సహాయం తెలంగాణకు అందివ్వాలని నీతి ఆయోగ్ చేసిన సిఫారసులను నేటికీ పట్టించుకోలేదు. ఆంధ్రప్రదేశ్‌కు ఇచ్చిన హామీలను నేటికీ నెరవేర్చలేదు.

**ముగింపు**

కేంద్ర ప్రభుత్వం ఒప్పుకున్నా ఒప్పుకోకపోయిన దేశ ఆర్థిక పరిస్థితి అధ్వానంగా ఉన్నదనేది దేశ ప్రజలకు అనుభారంలోకి వచ్చిన వాస్తవం. ఇంతకాలం కేంద్ర పాలకులు కార్పొరేట్ పన్నులను ఎంతగా తగ్గించుకుంటూ పోవాలే, మధ్యతరగతిలో పన్ను పరిధిని ఎట్లా విస్తరించాలనే, బహుళజాతి పరిశ్రమలకు ఎట్లా ఎర్రతివాచి పరచాలనే ఆలోచించారు. సమాజం సంపన్నం చేయడం ద్వారానే వ్యాపారం పెరిగిపోతుందని, తద్వారానే ఆదాయాలు వృద్ధి చెందుతాయని గ్రహించలేకపోవడం విచారకరం. దేశంలో ఆర్థిక మందగమనానికి మూలాలు ఎక్కడున్నా కేంద్ర ప్రభుత్వం తన విధానాల ద్వారా ఎదుర్కొన వలసిందే. దేశం ఆర్థికంగా పుంజుకోవాలంటే సమాజంలో ఆర్థిక కార్యకలాపాలు పెరగాలి. పరిశ్రమలకిచ్చే ప్రోత్సాహకాలకే పరిమితం కాకుండా విద్యా, ఆరోగ్యం, ఉపాధి, సామాజిక భద్రత, పోషకాహారం వంటి అనేక రంగాలల్లో ప్రభుత్వం ఆలంభవగా నిలిచినప్పుడే సగటు కుటుంబ కొనుగోలు శక్తి పెరుగుతుంది. వినియోగదారుడి కొనుగోలు శక్తి దెబ్బతింటే మొత్తం ఆర్థిక వ్యవస్థ కుప్పకూలిపోతుంది.

రాయితీలు, ఉద్దీపనలు దేశ ఖజానాకు ఊపిరి పోవడం లేదు. ఆర్‌బిఐతో పోరాడి గత ఏడాది తెచ్చిన రెండు లక్షల కోట్లు ఇప్పటి మరో లక్ష కోట్లు ఏ మూలకు చాలడం లేదు. సంఘటిత రంగాన్ని నిర్వీర్యం చేస్తూ, పెట్టుబడుల ఉపసంహారణ అనే గౌరవ నామదేయంతో అన్ని అమ్మవలసి వస్తుంది. బంగారు బాతుగుడ్లనందించే ఎయిర్ ఇండియా, ఇండియాన్ ఆయిల్ కార్పొరేషన్ లిమిటెడ్, భారత్ పెట్రోలియం కార్పొరేషన్, రైల్వే, బిఎస్‌ఎన్‌ఎల్ వంటి మహారత్న, నవరత్న కంపెనీలన్నింటిని కార్పొరేట్లకందించాలని చూస్తున్నారు. ఆ ఉద్దేశంతో తలాకొన్ని వాటాలను విక్రయించి తర్వాత పెట్టుబడుల ఉపసంహారణ పేరుతో మిగిలిన వాటాలను బూర్జువా వర్గానికి కట్టబెడుతుంది. నిజానికి సంస్థలు అప్పుల్లో కూరుకుపోయి ఉంటే కేంద్ర ప్రభుత్వం పూడ్చలేని నష్టాలను ప్రైవేట్ వ్యక్తులు ఎలా పూడ్చగలరు!

కార్పొరేట్లకు రాయితీలు ఇచ్చేబదులు ఆ మొత్తాన్ని మౌలిక వసతుల కల్పనకు, సంక్షేమ కార్యక్రమాలకు ఖర్చు పెట్టినచో సంపద వికేంద్రీకరణ జరిగి పేద, మధ్యతరగతి చేతుల్లో డబ్బులొచ్చి వినియోగం పెరిగి ఆర్థిక వ్యవస్థలో డిమాండ్ పెరుగుతుంది. కాని ఈ బడ్జెట్ దానికి విరుద్ధంగా కేటాయించింది.

స్థూలంగా ఈ బడ్జెట్ దేశ ఆర్థిక వ్యవస్థను పీడిస్తున్న మాంద్యాన్ని నిర్మూలించేందుకు దోహదపడేలా లేదు. వాస్తవాలను కప్పిపుచ్చి, అంకెల గారడికి గతం మాదిరిగానే పాల్పడినారు. యథా ప్రకారం ఈ బడ్జెట్‌లోనూ కార్పొరేట్ శక్తులకు పెద్ద ఎత్తున రాయితీలను కొనసాగించింది. దీనితో సమిష్టి డిమాండ్, ఉపాధి అవకాశాలు, ప్రజల ఆదాయాలు, వృద్ధిరేటును ఈ బడ్జెట్ మరింతగా ఛిద్రం చేసి ఆర్థిక మాంద్యాన్ని మాత్రమే విస్తరింప జేస్తుంది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

# వాస్తవికతను విస్మరించిన కేంద్ర బడ్జెట్

***ప్రస్తుతం నెలకొన్న ఆర్థిక మాంద్యం పరిస్థితుల్లో బడ్జెట్‌లో ప్రభుత్వం ప్రజల కొనుగోలు శక్తి పెంచే నిర్ణయాలు తీసుకోకపోగా, కార్పొరేట్ సంస్థలకు పన్నుల్లో రాయితీలిచ్చి, వాస్తవాలను మరుగుపరిచిందని అంటున్నారు* **ఎ. నర్సింహా రెడ్డి**

ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్ ఫిబ్రవరి 1న పార్లమెంట్‌లో ప్రవేశపెట్టిన 2020-21 బడ్జెట్ జన బాహుళ్యం ఎదుర్కొంటున్న అసలైన సమస్యలను విస్మరించింది. కార్పొరేట్లు, ఆశ్రిత పెట్టుబడిదారులను మెప్పించేందుకే యత్నించింది. ఆర్థిక వ్యవస్థను రెండేళ్లుగా వేధిస్తున్న మాంద్యాన్ని దీటుగా ఎదుర్కొనేందుకు అవసరమైన అస్త్ర శస్త్రాలన్నీ సంధిస్తారని ఎదురుచూస్తున్న ప్రజల ఆశలు కల్లలుగానే మిగిలాయి. దేశం ఎదుర్కొంటున్న తీవ్ర ఆర్థిక సంక్షోభాన్ని గాలికొదిలేసి, కార్పొరేట్ వర్గాలకు దేశ సంపదను దోచిపెట్టే విధంగా ఉన్నా, ఈ బడ్జెట్‌ను 'సామాన్యుల బడ్జెట్' అని ఆర్థికమంత్రి అభివర్ణించడం ఆత్మవంచనకు పరాకాష్ట. ఇది సామాన్యుల బడ్జెట్ అంటూ అబద్ధాల తేనె పూశారు. 5 శాతానికి పడిపోయిన వృద్ధిరేటు, 7 శాతానికి పెరిగిన ద్రవ్యోల్బణం, అంచనాకు మించిన విత్తలోటు, కునారిల్లిన ఎగుమతులు, మూతపడుతున్న పరిశ్రమలు, 45 సంవత్సరాలలో ఎన్నడు లేనంతగా దిగజారిన ఉపాధి అవకాశాలు వంటి సమస్యలకు పరిష్కారం చూపకపోగా ఈ సంవత్సరానికి వృద్ధి రేటు10 శాతం చేరనుందని బడాయికి పోయారు.

మాంద్యం ప్రభావం నుంచి కార్పొరేట్లను కాచుకునేందుకు పన్ను రాయితీలివ్వడం ద్వారా నడుస్తున్న ఆర్థిక సంవత్సరంలో రు. 1.55 లక్షల కోట్ల పన్ను ఆదాయాన్ని ప్రభుత్వం కోల్పోయింది. మాంద్యాన్ని అధిగమించేందుకు అత్యావశ్యకంగా పరిగణించబడుతున్న ఉపాధి కల్పన, వినియోగం పెంపుదల, వ్యవసాయాదాయల్లో వృద్ధితో కూడిన గ్రామీణాభివృద్ధికి, మౌలిక వసతుల కల్పనకు ఇతోధికంగా బడ్జెట్ కెటాయింపులు చేయకుండా విస్మరించింది. ప్రజల అవసరాలకు ఆమడ దూరంలో బడ్జెట్ ఉంది. డిమాండ్‌ను పెంచి ప్రజల కొనుగోలు శక్తిని మెరుగుపర్చే ఒక్కటంటే ఒక్క ప్రతిపాదన కూడా బడ్జెట్‌లో చేర్చకపోవడం గమనార్హం. బడ్జెట్ ప్రతిపాదనల్లో ఏమాత్రం హేతుబద్ధత లేదు. కేవలం అంకెల గారడీనే కనిపించింది.

ఈ బడ్జెట్‌లో ఐఎంఎఫ్ ఆదేశిత సంస్కరణలకే పెద్ద పీట వేశారు. దేశ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వాస్తవిక చిత్రాన్ని మరుగుపరచి... అంతా బాగుందని చూపేందుకు అంకెల గారడీ చేశారు. రెండున్నర గంటల పాటు సాగిన బడ్జెట్ ప్రసంగంలో దేశాన్ని పట్టి పీడిస్తున్న ఆర్థిక మాంద్యం, దిగజారుతున్న సామాన్యుల జీవన ప్రమాణాల గురించి కనీసం ప్రస్తావించలేదు. ఆహార సబ్సిడీ, ఎరువుల సబ్సిడీ, ఉపాధి హామీ,

**2020-21 బడ్జెట్ స్వరూపం (రూ.కోట్లలో)**

| | వివరాలు | 2018-19 (స.అం) | 2019-20 (బ.అం) | 2019-20 (స.అం) | 2020-21 (బ.అం) |
|---|---|---|---|---|---|
| 1. | రెవెన్యూ వసూళ్లు(2+3) | 15,52,946 | 19,62,761 | 18,50,101 | 20,20,926 |
| 2. | పన్ను ఆదాయం | 13,17,211 | 16,49,582 | 15,04,587 | 16,35,909 |
| 3. | పన్నేతర ఆదాయం | 2,35,705 | 3,13,179 | 3,45,514 | 3,85,017 |
| 4. | మూలధన వసూళ్లు (5+6+7) | 7,62,197 | 8,23,588 | 8,48,451 | 10,21,304 |
| 5. | రుణ వసూళ్లు | 18,052 | 14,828 | 16,605 | 14,967 |
| 6. | ఇతర వసూళ్లు | 94,727 | 1,05,000 | 65,000 | 2,10,000 |
| 7. | రుణాలు | 6,49,418 | 7,03,760 | 7,66,846 | 7,96,337 |
| 8. | మొత్తం వసూళ్లు (1+4) | 23,15,113 | 27,86,349 | 26,98,552 | 30,42,230 |
| 9. | రెవెన్యూ వ్యయం | 20,07,399 | 24,47,780 | 23,49,645 | 26,30,145 |
| 10. | రెవెన్యేతర వ్యయం | 3,07,714 | 3,38,569 | 3,48,907 | 4,12,085 |
| 11. | మొత్తం వ్యయం (9+10) | 23,15,113 | 27,86,349 | 26,98,552 | 30,42,230 |
| 12. | వడ్డీ చెల్లింపులు | 5,82,648 | 6,60,471 | 6,25,105 | 7,08,203 |
| 13. | రెవెన్యూ లోటు (9-1) | 4,54,483 | 4,85,019 | 4,99,544 | 6,09,219 |
| 14. | ద్రవ్య లోటు 8-(1+5+6) | 6,49,418 | 7,03,760 | 7,66,846 | 7,96,337 |
| 15. | ప్రాథమిక లోటు (14-12) | 66,770 | 43,289 | 1,41,741 | 88,134 |

**నోట్ :** స.అ - సవరించిన అంచనాలు, బ.అ- బడ్జెట్ అంచనాలు..

వివిధ వర్గాల సంక్షేమం నిధుల్లో కోతలు పెట్టి ప్రజల కొనుగోలు శక్తిని మరింతగా హరించే చర్యలకు సర్కారు పాల్పడింది. మరోవైపు సంపన్నులకు డివిడెండ్ పన్ను, ఆదాయపు పన్ను, కార్పొరేట్ పన్నుల్లో భారీగా రాయితీలు ఇచ్చారు. ముఖ్యంగా దేశీ, విదేశీ కార్పొరేట్లకు గరిష్ట స్థాయిలో లాభాలు చేకూర్చేలా పలు ప్రతిపాదనలు చేశారు. ఇందుకు అవరోధంగా ఉన్న చట్టాలను సవరిస్తామన్నారు. ఇప్పటికే పన్ను ఎగవేతదారులకు క్షమాభిక్ష పెడుతూ బిల్లు తెచ్చిన ప్రభుత్వం కార్పొరేట్లకు ఇకపై ఎలాంటి పన్నుల వేధింపులు ఉండబోవని బడ్జెట్‌లో పునరుద్ఘాటించారు. ఇంకోవైపు పేదలకు నేరుగా లబ్ది చేకూర్చే పలు కేంద్ర ప్రాయోజిత సంక్షేమ పథకాలకు నిధుల్లో కోత పెట్టారు.

2020-21 వార్షిక బడ్జెట్ రు. 30.42 లక్షల కోట్లు అని గొప్పలకు పోవడమే తప్ప ఖర్చు విషయంలో ఆ లక్ష్యాలు ఎంత మాత్రం చేరే పరిస్థితి లేదని గడచిన రెండు సంవత్సరాల గణాంకాలు గమనిస్తే స్పష్టమవుతోంది. 2018-19లో రు.23.15 లక్షల కోట్లు వ్యయం చేయగా, 2019-20లో రు.27.86 లక్షల కోట్లు ప్రతిపాదించి రు.26.98 లక్షల కోట్లకు సవరించారు. అలాంటిది మాంద్యం సమయాన రు.30.42 లక్షల కోట్లు ఖర్చు చేస్తామంటున్న ప్రభుత్వ మాటలను ఎవరైనా ఎలా నమ్ముతారు? రెవెన్యూ ఆదాయం 2018-19లో రు.15.52 లక్షల కోట్లు లభించింది. 2019-20లో రు.19.62 లక్షల కోట్లు అంచనా వేయగా సవరించిన బడ్జెట్‌లో 18.50 లక్షల కోట్లుగా పేర్కొన్నారు. ఆశించినదానికంటే రెవెన్యూ ఆదాయం రు.1.12 లక్షల కోట్లు తగ్గనుంది. నిజానికి డిసెంబర్ చివరినాటికి కేంద్ర ప్రభుత్వం వసూలు చేసింది 11.78 లక్షల కోట్లు. కానీ రానున్న మూడు నెలల కాలంలో 6.72 లక్షల కోట్లు వసూలు చేయడం అసాధ్యం. అలాంటప్పుడు వచ్చే సంవత్సరానికి ఆదాయం రు.20.20 లక్షల కోట్లు వస్తుందనడం మాయ చేయడమే అవుతుంది.

**బడ్జెట్ నిండా అసత్యాలు, అంకెలగారడీ**

భారతదేశ ఆర్థిక వ్యవస్థకు స్పష్టత చేకూర్చే ఏ విధమైన దార్శనికతను ఈ బడ్జెట్ సమకూర్చలేదన్నది యథార్థం. ఏవో కొన్ని రకాల రాయితీలు, పన్నుల విధానంలో మార్పులను చేసినా గానీ, కార్పొరేట్లకు, విదేశీ, స్వదేశీ పెట్టుబడిదారులకు లాభం కలిగే విధంగా బడ్జెట్ ఉంది. అన్నింటి కన్నా విచారకరమైన విషయం ఏమిటంటే బడ్జెట్‌లో పొందుపరిచిన అంకెలన్నీ నమ్మశక్యంగా లేవు. ఆ అంకెలు వాస్తవ అంకెలకు దగ్గరగా లేవు. బడ్జెట్ అంచనాలకు, సరిచేసిన అంచనాలకు, వాస్తవ సంఖ్యలకు తేడాలు కొన్ని సంవత్సరాలుగా ఉంటున్నాయి. కానీ ఆ అంకెల తేడా సాపేక్షంగా చూస్తే గతంలో చాలా తక్కువగా ఉండేవి. ఎన్‌డిఏ ప్రభుత్వంలో ముఖ్యంగా ఏడాది కాలంగా ఆ తేడాలు చాలా ఎక్కువగా ఉన్నాయి.

ప్రభుత్వానికి వచ్చే ఆదాయం ఎంత, ఖర్చు చేసేదెంత అనేది ఈ బడ్జెట్ అంచనాలు మనకు తెలపడం లేదు. ఏదేమైనా పార్లమెంట్‌లో ప్రవేశపెట్టిన బడ్జెట్ పత్రాలకు ఏ విలువ లేకుండా పోయింది. కారణం ఏమిటంటే, బడ్జెట్ ఆర్థిక సంవత్సరం ముగియడానికి రెండు మాసాల ముందే, అంటే ఫిబ్రవరి మొదటి రోజునే ప్రవేశ పెట్టారు. దీనికి కారణంగా రాబడి, వ్యయానికి సంబంధించిన అధికారిక గణాంకాలు డిసెంబర్ మాసాంతం వరకే అందుబాటులో ఉన్నాయి. కాబట్టి ఆర్థిక సంవత్సరానికి సంబంధించిన చివరి మూడు నెలల రాబడి, వ్యయాల గణాంకాలను ఊహించవలసి వచ్చింది. ఫలితంగా ప్రభుత్వం చివరి మూడు నెలల గణాంకాలను అతిగా అంచనా వేసి చూపింది. అందువల్ల ఆర్థికమంత్రి ప్రవేశపెట్టిన బడ్జెట్‌లోని సరిచేయబడిన అంచనాలు ప్రస్తుత ఆర్థిక సంవత్సరానికి సరిపోవచ్చు. సరిపోకపోవచ్చు. దానివలన రాబడి, వ్యయాల అంచనాలు వాస్తవం కాకపోవచ్చు.

ప్రభుత్వ రుణభారం గణనీయంగా తగ్గిందని ఆర్థికమంత్రి గొప్పగా చెప్పారు. 2014 మార్చి నాటికి జిడిపిలో 52.2 శాతం రుణభారం ఉంటే అది 2019 మార్చి నాటికి 48.7 శాతానికి తగ్గిందని అన్నారు. ఇది మోడీ ప్రభుత్వ ఘన కార్యమన్నారు. ఇది పెద్దమాయ. మోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత ప్రభుత్వ శాఖలు, సంస్థల చేత భారీగా అప్పులు చేయించి వాటిని ప్రభుత్వ రుణ లెక్కల్లో చూపడం లేదు. 2019 మార్చి నాటికి ఎఫ్‌సిఐ చేత రు.2.65 లక్షల కోట్లు అప్పు చేయించారు. జాతీయ రహదారుల ప్రాధికార సంస్థ (ఎన్‌హెచ్ఏఐ)ని కూడా ఎఫ్‌సిఐ మాదిరిగా రు.1.78 లక్షల కోట్లు అప్పుల్లోకి దించింది. అలాగే ఎరువుల సబ్సిడీ చెల్లించడానికి ప్రధాన ఎరువుల కంపెనీలకు బ్యాంకుల నుండి అప్పులు ఇప్పించారు. భారతీయ రైల్వే, ఫైనాన్సింగ్ కార్పొరేషన్, విద్యుత్ ఫైనాన్స్ కార్పొరేషన్‌లు కూడా కొత్త ప్రాజెక్టులకు అప్పులు తీసుకోవాలని ఆదేశించారు. ఈ అప్పులు ఆయా కంపెనీల బ్యాలెన్స్ షీట్లలో కనిపిస్తాయి తప్ప బడ్జెట్‌లో వాటి ప్రస్తావన ఉండదు. ఇలాంటి అనైతిక పద్ధతుల ద్వారా రుణాలను తగ్గించి చూపించడానికి మోడీ ప్రభుత్వం పాల్పడుతున్నది.

ఈ బడ్జెట్‌లో మరొక అతిపెద్ద అసత్యం ద్రవ్య లోటుకు చెందిన గణాంకాలు. 2019-20కి గాను ద్రవ్యలోటు మన జిడిపిలో 3.3 శాతం నుంచి సవరించిన అంచనాల ప్రకారం 3.8 శాతానికి పెరిగిందని చెబుతూనే 2020-21కి గానూ అది 3.5 శాతంగా అంచనా వేయడం వంచనా శిల్పానికి నిదర్శనం. ఆ అంచనా వాస్తవానికి దగ్గరగా సైతం లేదు. ఎందుకంటే స్థూల పన్ను వసూళ్లు పన్నెండు శాతం మేరకు పెరిగితే తప్ప అది సాధ్యం కాదు కాబట్టి! ఒకపక్క కార్పొరేట్ పన్ను రేట్లు తగ్గించి వ్యక్తిగత ఆదాయ పన్ను రేట్లు సైతం తగ్గించామని చెపుతున్నారు. దీనివల్ల 2.15 లక్షల కోట్ల రూపాయల ప్రత్యక్ష పన్నుల ఆదాయం కోల్పోతున్నామని చెపుతూనే రాబోయే సంవత్సరానికి 2.6 లక్షల కోట్ల స్థూల పన్ను ఆదాయం పెరగబోతోందని చెప్పడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? పన్ను వైచిత్రి అనాలేమో! ఇంతా చేసి ఆర్‌బిఐ వద్ద నుంచి అనాలోచితంగా బదిలీ చేయించుకున్న 1.8 లక్షల కోట్ల రూపాయలను గాని, ఎఫ్‌సిఐ, ఎన్‌హెచ్ఏఐ లాంటి ప్రభుత్వ సంస్థల ద్వారా చేసిన 3.73 లక్షల కోట్ల రూపాయల అప్పు గురించి గానీ బడ్జెట్ పత్రాలలో ప్రస్తావన సైతం లేకపోవడం విచిత్రం. తప్పుడు గణాంకాలను ప్రచారం చేసుకోవడానికి అలాంటి వాస్తవాలు మరుగున పరచడం మోడీ ప్రభుత్వానికి అలవాటే కదా!

బడ్జెట్ ముందు రోజు వెల్లడించిన 2019-20 ఆర్థిక సర్వేలో మాంద్యాన్ని పరోక్షంగా సర్కారు అంగీకరించింది. ఈ ఏడాది జాతీయ స్థూల ఉత్పత్తి(జిడిపి) వృద్ధిరేటు 5 శాతం ఉంటుందని ఆర్థిక సర్వే

పేర్కొంది. ఆ కోవలో వచ్చే ఏట వృద్ధి 6-6.5 శాతంగా సర్వే అంచనా వేసింది. గత బడ్జెట్‌లో వృద్ధిని 7 శాతం ఆశించి 5 శాతానికి తగ్గుతుందని ఒప్పుకుంటూనే, వచ్చే సంవత్సరం ఏకంగా 10 శాతం వృద్ధిని ఆశించడమేంటి? ప్రభుత్వం చెంత అల్లావుద్దీన్ అద్భుత దీపం ఏమైనా ఉందా? లేక మంత్రదండాలు ఏమైన ఉన్నాయా? ఆర్థిక సర్వే మార్గదర్శకత్వంలో ప్రభుత్వం ప్రతి ప్రభుత్వ రంగాన్ని అమ్మడం, ప్రైవేటీకరించడం, కార్పొరేట్లకు దోచిపెట్టడానికి బడ్జెట్‌ను వాడుకుంది. పెట్టుబడుల ఉపసంహరణ ద్వారా రు. 2.1 లక్షల కోట్లను బడ్జెట్‌లో ఆశించడం ప్రభుత్వ రంగాన్ని నాశనం చేసి కార్పొరేట్లకు అప్పగించడానికే నన్నది స్పష్టం.

ప్రజల ఆదాయం, కొనుగోలు శక్తి పెంచడమే లక్ష్యమని చెప్పుకున్న ఆర్థిక మంత్రి ఆ వైపుగా తీసుకున్న గట్టి నిర్ణయం ఒక్కటీ లేదు. చిన్న మధ్యతరహా పరిశ్రమలకు ఆర్థిక మంత్రి ప్రకటించిన రాయితీలు కూడా నామమాత్రమే. ఈ ఏడాది కేంద్రం ఆదాయం గత సంవత్సరం కంటే తక్కువగా ఉండవచ్చుననే అంచనాను ప్రకటించిన బడ్జెట్ ఆ మేరకు రాష్ట్రాలకు కేటాయింపులను తగ్గించి వాటిని నిరాశపరిచింది. కేంద్రం పన్ను రాబడిలో రాష్ట్రాలకిచ్చే వాటాను 42 నుంచి 41 శాతానికి తగ్గించారు. పబ్లిక్ రంగ బ్యాంకులకు మూలధన సాయం కింద రు.3.5 లక్షల కోట్లు కేటాయించిన బడ్జెట్ వాటిని మోసగాళ్ల నుంచి, నిరర్థక ఆస్తులు పేరుకుపోవడం నుంచి ఎలా కాపాడదలచిందో చెప్పలేదు. అయితే డిపాజిట్‌దార్ల సొమ్ముకు హామీగా డిపాజిట్‌లపై బీమాను లక్ష రూపాయల నుంచి ఐదు లక్షల రూపాయలకు పెంచడం కొంసమెరుపు.

### వ్యవసాయం, గ్రామీణాభివృద్ధికి నిధుల కోత

వ్యవసాయ రంగానికి ప్రథమ ప్రాధాన్యత అన్న ప్రభుత్వం బడ్జెట్‌లో ఆ రంగానికి ఒరగబెట్టిందేమీ లేదు. పంటలకు మద్దతు ధరల ఊసే లేదు. భూమి లీజు, ప్రైవేటు మార్కెట్లు, కాంట్రాక్టు సాగు మోడల్ యాక్టులను రాష్ట్రాలు చేయాలంది. ఎన్నికల ముందు ప్రతిష్ఠాత్మకం అని పేర్కొన్న పిఎంకిసాన్‌కు నిధులు తగ్గాయి. రైతులకు రు.15 లక్షల కోట్ల రుణాలున్నా ఆచరణలో అవి వాస్తవ రైతులకు అందే పరిస్థితి లేదు. సేద్యపు రంగంపై 60 శాతం మంది ప్రజలు ఆధారపడగా, ఆ రంగాన్ని ఆదుకోకుండా 2022 సంవత్సరానికి రెట్టింపు ఆదాయం ఎలా సాధ్యమవుతుందనేది చర్చనీయాంశమైంది. జిడిపిలో వ్యవసాయం వాటా 18 శాతానికి మించనప్పుడు, వ్యవసాయం, దాని అనుబంధ రంగాల వృద్ధిరేటు 2.8 శాతానికి మించనపుడు రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేయడం సాధ్యమేనా?

గ్రామీణాభివృద్ధికి 2019-20లో రు.1.43 లక్షల కోట్లు ఖర్చు చేశారు. 2020-21 సంవత్సరానికి స్వల్పంగా పెంచి రు.1.45 లక్షల కోట్లు కేటాయించారు. ఒక ఆర్థిక వ్యవస్థ పుంజుకోవాలంటే గ్రామీణ ప్రాంతాల్లో మౌలిక సదుపాయాల కల్పనపై ఖర్చు, గ్రామీణ, వ్యవసాయ రంగాలకు వ్యయాన్ని పెంచాల్సి ఉంటుంది. కానీ ప్రస్తుత బడ్జెట్‌లో ఇవేవీ జరుగలేదు. తద్వారా వృద్ధిరేటు కూడా పెరిగే అవకాశం లేనందున, తిరిగి 2019-20 ఆర్థిక సంవత్సర పరిస్థితులే పునరావృతం అయ్యే అవకాశం ఉంది.

### సామాజిక, సంక్షేమ రంగాలకు నిధుల కోత

కార్పొరేట్లకు లక్షల కోట్ల రాయితీలు గుమ్మరిస్తూ కష్టజీవుల కడుపుగొట్టే దుర్మార్గానికి మోడీ సర్కారు పాల్పడుతున్నది. మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని (ఎంజిఎన్ఆర్ఈజిఎస్) నిర్వీర్యం చేసేందుకు పూనుకున్నదనేది స్పష్టమవుతున్నది. ఇది భూమిలేని వ్యవసాయ కార్మికుల ఆత్మాభిమాన పరిరక్షకురాలిగా పేరొందింది. ఈ పథకానికి ఈ బడ్జెట్ కేటాయింపులో 13 శాతం నిధులు తగ్గించింది. ఈ పథకానికి నిధులు పెంచకపోగా తగ్గించడమంటే వ్యవసాయ కార్మికులకు ఈ పథకాన్ని దూరం చేసే దుష్ట తలంపే. గ్రామీణ ఉపాధి పథకానికి అధిక నిధులు కేటాయించడం ద్వారా డబ్బును వారి చేతుల్లోకి చేర్చే అవకాశం ఉంటుంది. తద్వారా డిమాండ్ పెరుగుతుంది. 2019-20లో ఈ పథకానికి రు.71 వేల కోట్లను కేటాయించి దాన్ని సవరించిన అంచనాల్లో రు.61,000 కోట్లకు తగ్గించారు. 2020-21 బడ్జెట్‌లో కేంద్రం ఈ పథకానికి కేవలం రు.61,500 కోట్లు మాత్రమే ఇచ్చింది.

**ఎస్‌సి, ఎస్‌టి సబ్‌ప్లాన్ నిధులు** (రు. కోట్లలో)

| సంవత్సరం | ఎస్‌సి | ఎస్టి |
|---|---|---|
| 2017-18 | 49,492 | 31,913 |
| 2018-19 | 51,343 | 36,889 |
| 2019-20 | 72,936 | 49,268 |
| 2020-21 | 83,256 | 53,652 |

**సంక్షేమ పథకాలకు రు. కోట్లలో**

| రంగం | 2018-19 వాసవ | 2019-20 సవరించిన | 2020-21 అంచనాలు |
|---|---|---|---|
| దళితులు | 7,574 | 5,568 | 6,242 |
| గిరిజనులు | 3,821 | 4,194 | 4,190 |
| మైనార్టీలు | 3,564 | 4,700 | 5,029 |
| మహిళలు | 52,953 | 62,559 | 65,011 |
| వికలాంగులు | 1,009 | 1,100 | 1,325 |
| వివక్షకు గురైన వర్గాలు | 1,563 | 1,845 | 2,210 |

దేశంలోని గ్రామీణ జనాభాలో సగానికంటే ఎక్కువగా భూమిలేని పేద వ్యవసాయ కార్మికులే ఉన్నారు. ఏ నైపుణ్యమూ ఎరుగని గ్రామీణ పేదలకు శారీరక శ్రమ ఒక్కటే ఉపాధి మార్గం. ఈ పరిస్థితుల్లో పెరుగుతున్న ధరలకు అనుగుణంగా గ్రామీణ ఉపాధిహామి పథకానికి నిధులు పెంచాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఆర్థిక మాంద్యంలో చిక్కుకున్న నేపథ్యంలో 19 కోట్ల కుటుంబాలకు ఉపాధినిస్తున్న పథకానికి నిధులను తగ్గించడమంటే ప్రజల కొనుగోలు శక్తిని మరింత దిగజార్చడమే అవుతుంది. మరో ప్రధానమైన ఆహార భద్రతకు గత ఆర్థిక సంవత్సరంలో రు.1లక్ష 90 వేల కోట్ల మేర కేటాయిస్తే ఈ సంవత్సరం ఈ కేటాయింపులు రు.1 లక్ష 20 వేల కోట్లకు పడిపోయాయి. అంటే 70 వేల కోట్ల మేర ఆహార భద్రత ఖర్చును ప్రభుత్వం వదిలించుకోవడానికి, ఆ మేరకు వినియోగదారులపై భారం మోపడానికి సిద్ధమైంది.

వ్యవసాయ రంగం చితికిపోతున్నదనీ, గ్రామీణ ఆర్థిక వ్యవస్థ కుంగిపోతున్నదనీ, పౌష్టికాహార లేమితో పేదల పిల్లల ప్రాణాలు పోతున్నాయనీ చెబుతూనే... వారికి లబ్ధి చేకూర్చే పథకాలకు నిధులు తగ్గించడం బిజెపి సర్కారు దుర్బుద్ధిని ఎత్తిచూపుతోంది. జనాభాలో 40 శాతం 5 సంవత్సరాలలోపు బాలబాలికలు పౌష్టికాహార లోపంతో కునారిల్లుతుంటే పౌష్టికాహారానికి కేవలం రు. 35 వేల కోట్లు మాత్రమే కెటాయించింది. ఎస్సి, ఎస్టి, మహిళలు, వికలాంగులు ఇలా అన్ని వర్గాల సంక్షేమానికి తూట్లు పొడిచింది. రవాణా, విద్య, వైద్యం ఇత్యాది మౌలిక రంగాల్లో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు తెరతీసింది. వేతన జీవులకు ఆదాయ పన్ను శ్లాబులు పెంచినా ఊరట నామమాత్రం.

### కార్పొరేట్లపై అమితాసక్తి – పన్ను రాయితీ

కేంద్ర బడ్జెట్ కార్పొరేట్ల కొమ్ము కాసింది. ఆర్థిక సంక్షోభం ముంచుకొస్తున్నా కార్పొరేట్లకు, సంపన్నులకు వరాల జల్లు కురిపించింది. సామాన్యులకు ఊరించే మాటలు మిగిల్చింది. మోడీ సర్కార్ ప్రభుత్వ సంస్థల ప్రైవేటీకరణపై అమితాసక్తి చూపుతోంది. దేశంలో ఆర్థిక మాంద్యం నెలకొన్న పరిస్థితుల్లో దాని నుంచి గట్టెక్కేందుకు రైతులు, కార్మికులు, యువతకు ఉపాధి కల్పించి తద్వారా డిమాండ్‌ను పెంచడం వంటి చర్యలు తీసుకోవాల్సిన కేంద్రం కార్పొరేట్లు, ధనవంతుల ప్రయోజనం కోసం పలు ప్రభుత్వ సంస్థలను ప్రైవేటుపరం చేసే పనిలో ఉంది. నష్టాల పేరుతో ఇప్పటికే ఎయిరిండియా వంటి సంస్థలను కార్పొరేట్ పరం చేసేందుకు సిద్ధమైంది. నిధుల సమీకరణ పేరుతో ప్రభుత్వ రంగ సంస్థల పెట్టుబడుల ఉపసంహరణకు తెరతీసి ప్రభుత్వ సంస్థలను ప్రైవేటు వ్యక్తులకు కట్టబెట్టేందుకు తలుపులు బార్లా తీసింది. ఇందులో భాగంగా 2019–20 ఆర్థిక సంవత్సరంలో దాదాపు రు. 1.1 లక్షల కోట్ల మేర పిఎస్‌యులలో పెట్టుబడుల ఉపసంహరణ చేయాలని నిర్ణయం తీసుకుంది. సవరించిన అంచనాల్లో దీన్ని రు. 65 వేల కోట్లకు చేర్చింది. 2020–21లో రు. 2.1 లక్షల కోట్ల మేర పెట్టుబడులను ఉపసంహరించాలనే లక్ష్యాన్ని ప్రభుత్వం తాజా బడ్జెట్‌లో ప్రతిపాదించింది.

ప్రజల విశ్వాసానికి మారు పేరుగా నిలుస్తూ, ప్రభుత్వానికి పెద్ద ఎత్తున డివిడెండ్లు ఇస్తున్న ప్రతిష్టాకరమైన దేశీయ బీమా రంగంలో అతిపెద్ద షేర్ కలిగిన లైఫ్ ఇన్సూరెన్స్ ఆఫ్ ఇండియా(ఎల్ఐసి)లో ప్రభుత్వం వాటాలను ఐపిఓ ద్వారా అమ్మకానికి పెట్టింది. ఉత్పత్తి, విద్యుత్ రంగాల్లో నూతన దేశీయ కంపెనీలకు 15 శాతం కార్పొరేట్ పన్ను తగ్గిస్తూ కేంద్రం నిర్ణయం తీసుకుంది. ఈ విధంగా దేశంలోని 70 శాతం ప్రజల కన్నా అధిక మొత్తంలో సంపద పోగేసుకున్న ధనవంతుల పక్షానే కేంద్రం నిలుస్తోంది. ఇటువంటి కార్పొరేట్ పన్ను తగ్గింపు వలన దేశ ఆదాయం పడిపోయే ప్రమాదం ఉంది. అయిదు లక్షల కోట్ల డాలర్ల ఆర్థిక వ్యవస్థ గురించి ఊదరగొడుతూ ప్రభుత్వ ఆస్తులను కార్పొరేట్లకు కారు చౌకగా కట్టబెట్టేందుకు మోడీ ప్రభుత్వం తెగబడింది.

దేశవ్యాప్తంగా మౌలిక సదుపాయాలకు పెట్టుబడులు పెడుతున్నామన్న నిర్మలా సీతారామన్ ప్రైవేట్ రంగానికే అధికంగా కట్టబెట్టినట్లు తెలుస్తోంది. ప్రైవేట్ వ్యవస్థకే అధిక నిధులు కట్టబెడితే మాంద్యంతో సాగుతున్న ఆర్థిక రంగం మరింత కుదేలయ్యే అవకాశం లేకపోలేదు. ఉదాహరణకు గ్యాస్, చమురు నిక్షేపాలను వెలికితీసేందుకు 1లక్ష 37 వేల ఎకరాలను కట్టబెడితే ఇంతవరకు ఉత్పత్తి జరగకపోవడం గమనార్హం. రక్షణ రంగంలో ప్రైవేట్ పెట్టుబడుల చొరబాటు మరింత వేగం పుంజుకోనుంది. ప్రభుత్వ రేవులను ప్రైవేటీకరించే ఆలోచనలో పడింది. కనీసం ఒక్క ప్రధాన రేవును కార్పొరేషన్‌గా మార్చి, దాన్ని స్టాక్ మార్కెట్లో పెట్టే విషయం ప్రభుత్వం పరిశీలిస్తున్నట్లు తెలిపింది.

ఏడు దశాబ్దాలుగా ప్రజాధనంతో నిర్మించుకున్న ప్రభుత్వ రంగ సంస్థల ఆస్తులను అమ్మి డబ్బు రాబట్టుకునే ప్రైవేటీకరణ బాటను బడ్జెట్ పునరుద్ఘాటించింది. ఈ రూపేణా ఆదాయం ఈ సంవత్సరం రు. 65 వేల కోట్లు కాగా, వచ్చే సంవత్సరానికి లక్ష్యం రు. 1.21 లక్ష కోట్లు. దివాలాతీసిన ఐడిబిఐలో 60 శాతం వాటాలను ఎల్ఐసి చేత కొనిపించిన ప్రభుత్వం, మిగతా భాగాన్ని అమ్మకానికి పెడుతున్నది. ఎల్ఐసిలో తొలిసారి పెట్టుబడుల ఉపసంహరణకు ఒడిగట్టింది. ఎయిరిండియా అమ్మకానికి సిద్ధమవుతోంది. జిల్లా కేంద్రంలో ప్రభుత్వ ఆసుపత్రుల ఆధారంగా ప్రైవేటు మెడికల్ కాలేజీలు అనుమతిస్తామన్నారు. విదేశాల్లో టీచర్లు, నర్సులు, పారా–మెడికల్ సిబ్బంది, సంరక్షకులకు ఉన్న డిమాండ్ నెరవేర్చేందుకై ఆరోగ్య, నైపుణ్యాభివృద్ధి మంత్రిత్వశాఖ ప్రత్యేకమైన బ్రిడ్జికోర్సులు రూపొందిస్తుందన్నారు. సంబంధిత డిగ్రీ, డిప్లమో కోర్సుల వారికి అప్రెంటిస్‌షిప్ నిమిత్తం 2021 మార్చి నాటికి 150 ఉన్నత విద్యాసంస్థలు నెలకొల్పుతామన్నారు.

కేంద్ర ప్రభుత్వం బడ్జెట్ సందర్భంగా పలు రంగాలకు సంబంధించి పబ్లిక్ ప్రయివేట్ పార్టనర్‌షిప్ (పిపిపి) పలుకు పలికింది. రైల్వే రంగానికి సంబంధించి నాలుగు స్టేషన్లను పిపిపి పద్ధతిలో ఆధునీకరణ చేపడతామని, 150 ప్యాసింజర్ రైళ్లను కూడా పిపిపి పద్ధతిలో నిర్వహణ లోకి తీసుకువస్తామని సీతారామన్ తన బడ్జెట్ ప్రసంగంలో పేర్కొన్నారు. దీనికి సంబంధించిన ప్రక్రియ వెంటనే ప్రారంభమవుతోందని చెప్పారు. ఇదే సమయంలో పర్యాటక రంగాన్ని అభివృద్ధి చేసేందుకు పలు పర్యాటక ప్రాంతాలను కలుపుతూ ఉండేలా తేజస్ వంటి ప్రైవేట్ రైళ్లను తీసుకువస్తామని పేర్కొన్నారు. అదేవిధంగా రైతులు తమ ఉత్పత్తులను ఇతర ప్రాంతాలకు తీసుకెళ్లి అమ్ముకునే విధంగా 'కిసాన్' రైలును కూడా పిపిపి పద్ధతిలో తీసుకువస్తామని ప్రకటించారు. వైద్య రంగానికి కేటాయింపులు రు. 69 వేల కోట్లకు పెంచామని చెప్పుకున్న సర్కార్ పిపిపి పద్ధతిలో ఆయుష్మాన్ భారత్ పథకాన్ని విస్తరిస్తామని పేర్కొంది. దీని ప్రకారం టైర్–2, టైర్–3 పట్టణాల్లో పిపిపి మోడల్‌లో ఆసుపత్రులను ఏర్పాటు చేస్తామని ప్రకటించింది. ఈ పద్ధతిలో గత అనుభవాలు ప్రతికూల ఫలితాలను ఇచ్చాయన్న దానిపై ప్రభుత్వం ఆలోచించలేదు. గుజరాత్, కర్ణాటక వంటి పలు రాష్ట్రాల్లో పిపిపి ప్రకారం గతంలో ఏర్పాటు చేసిన ఆసుపత్రులు సరైన పనితీరును ప్రదర్శించలేక పోయాయనే విమర్శ ఉంది.

### ముగింపు

బడ్జెట్ అంటే ఆదాయ వ్యయాల పద్దులు మాత్రమే కాదు. నిజానికి బడ్జెట్ ఒక తాత్విక ధోరణిలో రాజ్యాంగానికి దాని ఆదేశిక సూత్రాలకు అనుగుణంగా రూపొందించాల్సి ఉంటుంది. అధికారంలో ఉన్న ప్రభుత్వాలు వాటి వర్గ స్వభావం, రాజకీయ ధోరణి వల్ల తరచూ దీనిని

# రాజకీయార్థిక వ్యవస్థ వైఫల్యం - ఆక్స్‌ఫామ్ నివేదిక

***పాలకుల విధానాల ఫలితంగా 70 శాతం ప్రజల వద్ద ఉన్న సంపద కంటే 1 శాతం ధనికుల వద్ద నాలుగు రెట్లు పోగు పడిందనీ, ఈ అంతరాల మార్పు కోసం ప్రజలే సాహసం చేయాలనీ అంటున్నారు* బి. రామకృష్ణ**

**2020** జనవరిలో స్విట్జర్‌లాండ్‌లోని దవోస్‌లో జరిగే ప్రపంచ ఆర్థిక సమావేశానికి కొన్ని రోజుల ముందుగా ఆర్థిక అసమానతలపై ఆక్స్‌ఫామ్ నివేదికను విడుదల చేసింది. సంపద కొద్దిమంది చేతుల్లో పెద్ద ఎత్తున పోగుపడడాన్ని బయట పెట్టింది ఈ నివేదిక. ఇంటిపని, వంటపని, పిల్లల, పెద్దల సంరక్షణ వంటి పనులు విలువలేనివిగా చూపబడుతున్నాయి. ఈ పనులను మహిళలు, బాలికలు చేస్తుండడం వలన వారు సామాజిక, ఆర్థిక, రాజకీయ వివక్షతలకు గురవుతున్నారని తెలిపింది. భారతదేశంలోని పెద్ద టెక్ కంపెనీ ఉన్నతాధికారి ఒక సంవత్సర కాలంలో సంపాదించిన దానిని ఇళ్లల్లో పనిచేసే మహిళా శ్రామికులు సంపాదించడానికి 22,227 సంవత్సరాలు పడుతుందని ఈ నివేదిక తెలిపింది.

భారత ఆర్థిక వ్యవస్థలో పైన ఉన్న 10 శాతం మంది వద్ద జాతీయ సంపదలో 74.3 శాతం ఉన్నది. 70 శాతం భారత జనాభా (95.3 కోట్లు) వద్దనున్న సంపద మొత్తానికి నాలుగింతలకు పైగా కేవలం సంపన్నవంతులైన 1 శాతం వద్ద గుట్టలు గుట్టలుగా కేంద్రీకరించబడింది. పై పొరల్లో ఉన్న 1 శాతం మంది వద్ద జాతీయ సంపదలో 42.5 శాతం ఉంది. 9 మంది బిలియనీర్ల (శత కోటీశ్వరులు) సంపద అట్టడుగున ఉన్న 50 శాతం జనాభా మొత్తం సంపదకు సమానం. అట్టడుగున ఉన్న 90 శాతం వద్ద జాతీయ సంపదలో 25.7 శాతం, 50 శాతం జనాభా వద్ద 2.8 శాతం మాత్రమే ఉన్నదని, భారతదేశంలోని శత కోటీశ్వరుల మొత్తం సంపద (28,96,800 కోట్లు) దేశ 2018-19 బడ్జెట్ (24,42,200 కోట్లు) కంటే ఎక్కువగా ఉన్నది. పైన ఉన్న 1

విస్మరిస్తున్నాయి. అందువల్లనే జనాభాలో అగ్ర స్థానంలో ఉన్న ఒక శాతం, జనాభాలో 70 శాతంగా ఉన్న 95.3 కోట్ల ప్రజల వద్ద ఉన్న సంపద కంటే నాలుగు రెట్లు ఎక్కువ సంపద కలిగి ఉన్నారు. సబ్ కా సాత్, సబ్‌కా వికాస్, సబ్‌కా విశ్వాస్ గురించి మాట్లాడే బిజెపి ప్రభుత్వం ఈ అన్యాయమైన ఆదాయ విభజనకు మరింతగా దోహదపడుతోంది. ఈ బడ్జెట్ వల్ల కార్పొరేట్లకు, ఆశ్రిత పెట్టుబడిదారులకు మాత్రమే మేలు కలుగుతుంది. ఆర్థిక మంత్రి పేదల గురించి, అవకాశాలకు దూరంగా ఉన్న వారి గురించి అనర్గళంగా మాట్లాడినప్పటికీ, ఈ నూతన బడ్జెట్‌లో అందుకు సంబంధించిన కేటాయింపులు చేయలేదు. ఒక్క ముక్కలో చెప్పాలంటే, సంపన్నులు పేదల మధ్య ఆగాథం, సామాజిక అశాంతికి, ఆర్థిక సంక్షోభానికి దారి తీస్తుందనడంలో సందేహం లేదు.

పెరిగిన నిరుద్యోగం, పెరుగుతున్న నిత్యావసర వస్తువుల ధరలకు పరిష్కారాల ఊసే లేదు. విద్యావ్యవస్థలోకి విదేశీ నిధులను ఆహ్వానించడం, ఎయిర్ ఇండియాను, ఎల్ఐసిని అమ్మకానికి పెట్టడం, దేశ ఆర్థిక స్వావలంబనను నాశనం చేసే ప్రతిపాదనలు చేయడం ప్రమాదకరంగా పరిణమించాయి. అన్ని రంగాల్లో ప్రైవేట్ భాగస్వామ్యాన్ని పెంచేదిగా, ప్రభుత్వ రంగాన్ని ముంచేదిగా, శ్రామికవర్గ వ్యతిరేక బడ్జెట్ అని స్పష్టంగా విదితమవుతోంది. కేంద్రం చెబుతున్నట్లు సంపద సృష్టికర్తలు కొన్ని కార్పొరేట్ సంస్థలు, ధనిక కుటుంబాలు కాదు. అసలైన సంపద సృష్టికర్తలు అశేష ప్రజానీకం, శ్రామిక వర్గం. వారి లక్ష్యంగా ప్రభుత్వాలు కార్యాచరణ, విధానాలు ఉండాలి.

సంపద సృష్టికర్తల పేరుమీద సంపన్నుల చుట్టూ బడ్జెట్ తిరిగింది. సంపదను సృష్టిస్తే పంపకం సాధ్యమవుతుందని, పంపకం కోసం సంపద సృష్టించాలని, అందుకు మార్కెట్ మీద ఆధారపడే విధంగా బడ్జెట్ రూపొందించారు. కాబట్టే తాము మార్కెట్ అనుకూల బడ్జెట్ తీసుకొచ్చామని అంటున్నారు. పాలకులు, వ్యాపారాన్ని సులభతరం చేయాలనే పేరుమీద, వ్యాపారులకు అనుకూలమైన నిర్ణయాలు తీసుకుంటున్నారు. ఇదే 2020 బడ్జెట్‌లో కీలకాంశం. పెట్టుబడుల కోసం ప్రైవేట్ సంస్థలను ఆశ్రయిస్తున్న పాలకులు బ్యాంకులను ప్రైవేటీకరించడం లాంటి చర్యలకు పాల్పడుతున్నారు. మరోవైపు పెట్టుబడిదారులకు పన్నులను గణనీయంగా తగ్గిస్తూ ప్రతిపాదించారు. తయారీ రంగంలో కొత్తగా పెట్టుబడి పెడుతున్న వారికి 15 శాతం, ఇప్పటికే పెట్టుబడులు పెట్టిన వారికి 22 శాతానికి పన్నులు తగ్గించారంటే పాలకులకు పెట్టుబడిదారులపై ఎంత మమకారం ఉందో అర్థం చేసుకోవచ్చు.

ప్రజల సమస్యలకు ప్రాధాన్యత ఇవ్వనంతకాలం ఆర్థిక వ్యవస్థ అపసవ్య దిశలోనే పయనిస్తుంది. మొత్తంగా ఈ బడ్జెట్ కార్పొరేట్లకు, అంతర్జాతీయ ఫైనాన్స్ సంస్థలకు మోదాన్ని, సామాన్యులకు ఖేదాన్ని మిగిల్చేదిగా ఉంది. ఆర్థిక మాంద్యం చుట్టుముడుతున్న వేళ ప్రజల దగ్గర డబ్బు ఉంటేనే కొనుగోలు శక్తి పెరుగుతుంది. వృద్ధిరేటు స్థిరంగా ఉంటుంది. పారిశ్రామికోత్పత్తి ఊపందుకుంటుంది. ఉపాధి అవకాశాలు లభిస్తాయి. ఆర్థికవ్యవస్థ జవసత్వాలు పొందుతుంది. అయితే ప్రభుత్వం ఆ దిశలో ఆలోచించడం లేదు. ఫలితంగా రాబోయే రోజుల్లో నిరుద్యోగం, నిత్యావసర వస్తువుల ధరలు మరింతగా పెరిగి ప్రజల జీవితాలు మరింత సంక్షోభంలోకి వెళతాయి. ఈ నేపథ్యంలో ప్రజల ప్రతిఘటన శక్తి మాత్రమే వారిని రక్షించగలదు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

శాతం ధనవంతుల సంపద 46 శాతం పెరుగగా అట్టడుగున ఉన్న 50 శాతం జనాభా సంపద కేవలం 3 శాతం మాత్రమే పెరిగిందని ఇటువంటి మరెన్నో గణాంకాలు ఆక్స్‌ఫామ్ నివేదికలలో వెలుగుచూశాయి.

దేశ ఆర్థిక వ్యవస్థ నిచ్చెనమెట్లలో పైభాగాన ఉన్న కొదిమంది చేతుల్లో యావత్ దేశ సంపదలో అత్యధిక భాగం ఎందుకు బందీ అవుతున్నది? ఈ విపరీతమైన వ్యత్యాసాలు దేనికి సంకేతం? దేశ ప్రజలందరికి చెందాల్సిన సంపద, వనరులను ఈ కొద్దిమంది ఎలా చెరబట్టగలుగుతున్నారు. ఈ సందర్భంలో చెరబండరాజు రాసిన వందేమాతరం కవితలోని కొన్ని పంక్తులు గుర్తుకు వస్తాయి.

సంపన్నుల చేతుల్లో మైమరిచి నిద్రిస్తున్న యవ్వనం నీది/ఊసినా దుమ్మెత్తి పోసినా చలనం లేని మైకం నీది/ఎండిన స్తనాల మీదికి ఎగబడ్డ బిడ్డల్ని ఓదార్చలేని శోకం నీది/అమ్మా భారతి నీ గమ్యం ఏమిటి తల్లీ/ వందేమాతరం వందేమాతరం అని 1970ల్లో చెరబండరాజు నిష్కర్షగా ప్రశ్నించాడు. అది నేటికీ ఎంత వాస్తవంగా నిలిచి ఉందో ఆక్స్‌ఫామ్ నివేదిక 2020 రుజువు చేసింది.

ముఖేష్ అంబానీ కుటుంబం ఆస్తి ఒక సంవత్సరం (2019) లోనే రు. 1,20,000 కోట్లు పెరిగింది. వారి మొత్తం ఆస్తి రు.4,30,000 కోట్లకు పెరిగిందని బ్లూంబర్గ్ మిలియనీర్స్ నివేదిక చెబుతున్నది. ఇది తెలంగాణ రాష్ట్ర 2019-20 బడ్జెట్ (1,46,492 కోట్లు) కంటే దాదాపు 3 రెట్లు ఎక్కువ. ఇలా శత కోటీశ్వరుల జాబితాను పరిశీలిస్తే కఠోర వాస్తవాలు తెలుస్తాయి. వీరికి అంతగా ఆస్తి పాస్తులు ఎలా సమకూరుతాయి? అదంతా ఏమైనా వారి కష్టార్జితమా? ఒకరో, ఇద్దరో, ముగ్గురో మరికొంత మందో కఠోర శ్రమ చేసినా కూడా ఇంతలా సంపదను సంపాదించగలరా? దీంట్లో ఎందరెందరి శ్రమ దాగున్నదో. ఆ శ్రమకు తగిన ప్రతిఫలం ఇవ్వకుండా మిగుల్చుకున్నదే కదా ఈ సంపద.

ఈ సత్యాన్ని మార్క్స్, ఎంగెల్స్‌లు ఎప్పుడో కనుగొన్నారు. నేటి సందర్భంలో అలాగే భూస్వామ్య, పెట్టుబడిదారీ, దోపిడీ పూరిత వ్యవస్థలు ఉన్నంతకాలం వీరి ఆలోచనలు నిత్య నూతనంగానే ఉంటాయి. అసమానతలు, వివక్షతలు, సంపద కేంద్రీకరణల మూలాల గుట్టు చెప్పిన మహోపాధ్యాయులను ఈ సందర్భంగా గుర్తుకు తెచ్చుకోకుండా ఉండడం సాధ్యం కాదు. అలాగే వీరి ఆలోచనలను, సిద్ధాంతాలను మరింతగా మెరుగు పెడుతూ, ఆచరిస్తూ ప్రపంచ వ్యాప్తంగా కృషి చేస్తున్న, చేసిన ఎంతో మందిని స్మరించుకోవడం సముచితంగా ఉంటుంది.

ఓ వైపు ప్రధాన మంత్రి ఆర్థిక సలహాదారులు సహితం ప్రజల కొనుగోలు శక్తి పడిపోతున్నదని, అవసరమైన వస్తువులను సాధారణ ప్రజలు కొనుగోలు చేయలేకపోతున్నారని చెబుతున్నారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఆదాయాలు పడిపోతున్నాయి. ఇదంతా కొద్దిమంది సంపన్నుల చేతుల్లోకి చేరుతున్నది. ఈ సందర్భంలో ప్రజల ఆదాయం పెంచే పనులు చేయకుండా బడా పెట్టుబడిదారులకు, పారిశ్రామిక వేత్తలకు పన్నుల్లో రాయితీలు ఇస్తున్నారు. ప్రభుత్వాలు చేయాల్సినదేమిటి చేస్తున్నదేమిటి? సమాజ సంపదకు ట్రస్టీగా ఉంటూ ఆ సంపదపై ప్రజలందరికీ హక్కు ఉండేలా చర్యలు తీసుకోవాలి. దానికి విరుద్ధంగా కొద్దిమందికే భోక్తం చేస్తుండడం జరుగుతున్నది.

'ప్రజా సంక్షేమం కొరకు రాజ్యం పాటుపడాలి. ఈ ప్రక్రియలో రాజ్యం స్థాపించే వ్యవస్థా, సంస్థలూ ప్రజలకు సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని సమకూర్చే సాధనాలుగా ఉండాలి. వ్యక్తుల మధ్య ఆదాయ అసమానతలు తగ్గించడం కొరకు హోదాలలోని అసమానతలు నిర్మూలించుటకు రాజ్యం ప్రత్యేక కృషి చేయాలి. అదే విధంగా వేర్వేరు వృత్తులలో ఉన్నవారి మధ్య, వేర్వేరు ప్రాంతాలలో నివసిస్తున్న ప్రజల మధ్య ఆర్థిక పరిస్థితులలోనూ, పని ఉద్యోగావకాశాలలోనూ ఉన్న అసమానతలను నివారించే కృషి చేయాలి' అని రాజ్యాంగంలోని 38వ ఆర్టికల్ స్పష్టంగా చెబుతున్నది. ఈ ఆదేశాన్ని ఆచరణలో పెడితే విపరీత సంపద కేంద్రీకరణ ఒకవైపు, కడు పేదరికం మరోవైపు ఎందుకు జరుగుతుంది? రాజ్యాంగ విలువలకు, ఆదేశాలకు, సూత్రాలకు కట్టుబడి పనిచేస్తామని చేసిన పాలకుల ప్రమాణాలు నీటిమీద రాతలుగా మిగులుతున్నాయి.

కనీస వేతనం నెలకు 21 వేలకు పైగా ఉంటే గాని ఓ మోస్తారుగా బతకగలిగే పరిస్థితుల్లో కేంద్ర ప్రభుత్వం కనీస దినసరి వేతనం 178 రూపాయలుగా (నెలకు రు. 5,340) నిర్ణయించింది. ఈ వేతనంతో కనీస జీవితావసరాలు తీరతాయా? గౌరవ ప్రదమైన జీవనాన్ని గడపగలుగుతరా? అంటే అవుననే కేంద్ర ప్రభుత్వం చెబుతున్నది. మరోవైపు ఆక్స్‌ఫామ్ నివేదిక తెలిపిన విపరీత సంపద కేంద్రీకరణ అనేది ప్రభుత్వాలకు సరైనదిగానే తోస్తున్నట్లున్నది. ఎందుకంటే ఇప్పటివరకు ఏ ప్రభుత్వం కూడా ఆక్స్‌ఫామ్ నివేదికపై ఒక విధాన ప్రకటన, విధాన పత్రం విడుదల చేయలేదు. ఇంత సంపద వారికెలా వచ్చిందని శోధించే ప్రయత్నాలు లేవు. ఈ సంపదను ప్రజల పరం చేయవల్సిన రాజ్యాంగ బాధ్యతను ఎలా నెరవేరుస్తారో చెప్పలేదు.

ఓవైపు దారిద్ర్య రేఖకు దిగువన (బిపిఎల్) అంటే రోజుకు కనీసం రు. 178 కూడా అందని వారు దేశ జనాభాలో 20 శాతం (40 కోట్లు) ఉన్నారని ప్రభుత్వ అధ్యయనాలే చెబుతున్నాయి. ఇంతమంది అర్థాకలితో అలమటిస్తుంటే వీరికి అందవల్సిన సంపద కొద్దిమంది చేతుల్లోకి చేరుతుండడం అనేది ఈ రాజకీయ ఆర్థిక వ్యవస్థ దుర్మార్గాన్ని చెప్పకనే చెబుతున్నది.

సంపన్న వర్గాలపై పదేళ్ల వరకు 0.5 శాతం పన్ను అధికంగా వేస్తే గనుక పిల్లల, పెద్దల సంరక్షణ విద్యా, వైద్య రంగాలలో 11.7 కోట్ల ఉద్యోగాలను ఇవ్వవచ్చని ఆక్స్‌ఫామ్ నివేదిక చెప్పింది. ప్రజా సంక్షేమ, మౌలిక రంగాలలో తక్కువ ఖర్చు చేయడం ద్వారా మహిళలు, బాలికలపై అధిక పనిభారం పడుతున్నదని ఈ నివేదిక వివరించింది. సంపద పెరుగుతూ అసమంగా పంచబడి కొందరి చేతుల్లో పోగుపడుతుండడం అనేది ఆర్థిక వ్యవస్థ వైఫల్యంగా అభిప్రాయపడాలి. ఇందుకు ప్రభుత్వ విధానాలు, ప్రైవేటీకరణలు తోడ్పడుతున్నాయని తెలిపింది ఆక్స్‌ఫామ్ నివేదిక.

సంపన్నుల వద్ద పోగుపడుతున్న సంపద అశేష ప్రజల ప్రత్యేకించి పేద మహిళల, బాలికల చెమట, రక్తంతో సృష్టించబడిందనేది మరిచి పోకూడనట్టిది. ప్రస్తుత ఆర్థిక వ్యవస్థ నుండి అతి తక్కువ లబ్ది పొందేది కూడా వీరే. వీరు ప్రతిరోజు ఇంటిపని, వంటపని, పిల్లల, పెద్దల సంరక్షణ మొదలైన గృహ సంబంధిత అనేక రకాల వేతనం లేని పనుల్లో 326

కోట్ల గంటలు వెచ్చిస్తున్నారు. ఈ పని అనేది సంవత్సరానికి 19 లక్షల కోట్లను భారత ఆర్థిక వ్యవస్థకు అందిస్తున్నది. పైకి అగుపించని వేతనం లేని ఈ శ్రమ ద్వారా మన ఆర్థిక వ్యవస్థలు, వ్యాపారాలు, సమాజాలు నడుస్తున్నాయని ఆక్స్‌ఫామ్ నివేదిక 2020 చెప్పింది. ఈ సంరక్షణ పనులకు వెచ్చిస్తున్న శ్రమవల్ల మహిళలు, బాలికలు చదువుకోలేక పోతున్నారని, గౌరవప్రదమైన బతుకులకు సరిపోయే సంపాదన లేకుండా పోతున్నదని నివేదిక వివరించింది. వీరు చదువులను, గౌరవప్రదమైన జీవితాలను కోల్పోవడం వలన సంపన్నులకు ఆస్తులు సమకూర్చబడుతూ ఆర్థిక వ్యవస్థ నిచ్చెనమెట్లలో అట్టడుగున దయనీయ బతుకులతో మిగిలిపోతున్నారు.

సంపన్న వర్గాల చేతుల్లోకి అక్రమంగా వచ్చిపడుతున్న సంపదకు అడ్డుకట్ట వేయవల్సిన బాధ్యత రాజ్యానిదే. సంపదంతా కేంద్రీకృతం కావడానికి ప్రభుత్వ విధానాలే కారణమని తెల్సుకోవడం కష్టమేమీ కాదు. కార్మికులకు, ఉద్యోగులకు సరైన వేతనాలు ఇవ్వకపోవడం, పెట్టుబడిదారులు, కార్పొరేట్ శక్తులు పన్నులు ఎగ్గొట్టడం, అక్రమంగా పోగుచేసిన సంపద – వారి కుటుంబ వారసులకు సంక్రమించడం, ఈ సంపదలపై ప్రభుత్వ నియంత్రణ, అజమాయిషీ లేకపోవడం, ప్రభుత్వ పరంగా అనేక రకాల రాయితీలు, వెసులుబాట్లు, చౌకగా భూములు, తదితర మౌలిక వసతుల వంటి సమాజ సంపదను సంపన్న వర్గాలకు అప్పనంగా అందించడం వల్ల సంపద విపరీతంగా కొద్దిమంది చేతుల్లోకి వెళుతోంది. ఇలాంటి వారికి ఆర్థిక మాంద్యం పేరుతో పన్నుల్లో రాయితీలు లేదా రద్దు చేయడం ద్వారా ప్రభుత్వాలు ఏ వర్గానికి అనుకూలంగా ఉన్నాయో తెలిసిపోతున్నది. అసలు ప్రభుత్వాలనే ఈ సంపన్న వర్గాలు నడుపుతున్నాయంటే సరిపోతుంది.

మరోవైపు అంతర్జాతీయ బహుళజాతి కార్పొరేషన్‌లకు, కార్పొరేట్ శక్తులకు దేశ సంపదను, వనరులను, భారత మార్కెట్‌ను అప్పగిస్తున్నారు. 1970ల లోనే తరిమెల నాగిరెడ్డి తన కోర్టు ప్రకటనలో వివరమైన సమాచారంతో భారత సంపద ఎలా కొల్లగొట్టబడుతున్నదో వివరించాడు. జాతీయ, అంతర్జాతీయ పెట్టుబడిదారీ శక్తులకు అనుకూలంగా పాలకులు ఎలా నడుచుకుంటున్నారో ప్రకటించాడు. ఇది 'తాకట్టులో భారతదేశం' అనే పుస్తకంగా కూడా వచ్చింది. అటువంటి విధానాలు నేడు మరింత దూకుడుగా అమలు చేయబడుతున్నాయి. ఆ విధానాల ఫలితమే ఈ అసమానతలు.

సంపద కొద్దిమంది చేతుల్లో పోగుబడుతుండడం అనేది పేదరికానికి అసలు కారణమని ఆక్స్‌ఫామ్ నివేదిక ద్వారా మరోసారి బట్టబయలు అయ్యింది. వ్యక్తిగత లోపాలనీ, అలవాట్లనీ, ఎంత దక్కవల్సి ఉంటే అంతే దక్కుతుందని, అంతా తలరాతేననీ, దైవ సంకల్పమనీ చెప్పే బాబాలు, స్వాములు, వివిధ రకాల మతాధీశులు ఉండనే ఉన్నారు. ప్రజల్ని భ్రమల్లో, మత్తులో ఉంచడానికి, అన్యాయాలను ప్రశ్నించకుండా ఇదంతా కర్మ ఫలితమనీ అనుకుంటూ బతుకులు నెట్టుకొచ్చే భావజాలాన్ని వ్యాప్తి చేస్తుంటారు. ఇవ్వాళ మతం, పెట్టుబడి, సామ్రాజ్యవాదం ఒకదానికొకటి పెనవేసుకుని ప్రజలను పీడనలకు గురిచేస్తున్నాయి. విపరీతమైన సామాజిక, రాజకీయార్థిక వివక్షతలకు, అసమానతలను సృష్టిస్తున్నాయి.

ఇంతటి దారుణ ఆర్థిక అసమానతలను దాచేస్తూ అభివృద్ధి సాధించామని వక్ర భాష్యాలు, అబద్దాలు చెబుతున్నారు. ప్రభుత్వ రంగ సంస్థలను అమ్మేస్తున్నారు. విద్య, వైద్య, తదితర మౌలిక రంగాలైన వ్యవసాయం, పరిశ్రమల్లో ప్రభుత్వ ఖర్చును తగ్గించేస్తున్నారు. అన్ని రంగాలలో కార్పొరేట్ శక్తులకు విచ్చలవిడిగా అనుమతులు ఇస్తున్నారు. జాతీయ, అంతర్జాతీయ బడా పెట్టుబడిదారీ శక్తులకు గేట్లు బార్లా తెరుస్తూ ప్రజల హక్కులను బలిపెడుతున్నారు.

అంబేద్కర్, ఫూలే, పెరియార్ వంటి ఎందరో సామాజిక ఉద్యమకారులు దార్శనికులు నిరసించిన మత వ్యవస్థను పట్టిష్టం చేయ దలుచుకుంటున్నారు. హిందూమతం పేరుమీద మతోన్మాదాన్ని, మత విద్వేషాలను రెచ్చగొడుతూ ఫాసిజాన్ని ముందుకు తెస్తున్నారు. భారత రాజ్యాంగ లౌకిక విలువలకు విఘాతం కలిగించే పౌరసత్వ సవరణ చట్టం చేశారు. కశ్మీర్ ప్రజల స్వయం నిర్ణయాధికారాన్ని చారిత్రకంగా వారికున్న హక్కులను కాలరాస్తూ ఆర్టికల్ 370ను రద్దు చేశారు. భిన్న సంస్కృతులను కాదని ఏక సంస్కృతిని హిందూ ధర్మం పేరుమీద రుద్దే ప్రయత్నం చేస్తున్నారు. ప్రమాదకరమైన జాతీయ పౌర పట్టిక (ఎన్ఆర్‌సి)ను తమ పాపాల పాముల పుట్ట నుండి బయటకు తీస్తున్నారు.

ప్రజాస్వామ్యానికి గుండెకాయ వంటి భావ ప్రకటనా స్వేచ్ఛ గొంతును నులిమి వేస్తున్నారు. రాజ్యాంగ విలువలను ఉల్లంఘించవద్దని, వాటిని పాటించమని, అమలు చేయమని అంటే దేశ ద్రోహులుగా చిత్రీకరించబడి అక్రమ కేసులు పెట్టి జైళ్లపాలు చేస్తున్నారు. తార్కికంగా, హేతుబద్ధంగా ఆలోచించి స్పందించాలంటే అది మత విశ్వాసాలకు వ్యతిరేకం అని విరుచుకుపడుతూ దాడులకు, హత్యలకు పాల్పడు తున్నారు.

ఇలాగే ఇటలీలో గియర్డవా బ్రూనోను 1600 సంవత్సరంలో చంపేశారు. విశ్వానికి సంబంధించి మత విశ్వాసాలకు భిన్నంగా, చర్చికి వ్యతిరేకంగా సత్యాలను చెప్పినందుకు అతన్ని ఏడు సంవత్సరాల పాటు జైలులో చీకటి గదిలో బంధించి చివరకు సజీవంగా దహనం చేశారు. అయినా అతడు సత్యాన్నే చెబుతానని ధైర్యంగా ప్రాణాలు వదిలాడు. ఆ తర్వాత బ్రూనో చెప్పినవి సత్యాలని తేలింది. సైన్స్ నిరూపించిన సత్యాలను కాదని దేశవ్యాప్తంగా మత విశ్వాసాల పేరుతో దౌర్జన్యాలకు పాల్పడుతూ అంధ యుగంలోకి తీసుకెళ్లే ప్రయత్నాలు చేస్తున్నారు. వీటికి రాజ్యం అండదండలు తోడయ్యాయి.

ఇవేవి కూడా ఆర్థిక అసమానతలను తొలగించేవి కావు. మత విద్వేషాలను రెచ్చగొడుతూ ఫాసిజాన్ని ముందుకు తెస్తున్నారు. మౌలిక సమస్యల నుండి పక్కదారి పట్టించేవి మాత్రమే కాకుండా ప్రమాదకరమైన విషయాలు కూడా.

ఈ పరిస్థితుల్లో సోషలిజం ఆవశ్యకతను గుర్తించవచ్చు. శక్తిమేరకు శ్రమ, శ్రమకొద్ది ఫలితం. ఎవరూ కూడా తమ శక్తిమేరకు శ్రమ చేయకుండా తీరుబడిగా కూర్చుని సంపదను అనుభవించడానికి అర్హులు కారు. విద్య, వైద్య, వృద్ధుల, పిల్లల, రోగుల ఆలనా పాలనా మొత్తం సమాజమే పట్టించుకునే ఉన్నత సమాజం ఏర్పడడానికి కావల్సిన దారుల్లో నడవడానికి సాహసం కావాలిప్పుడు.

*(రచయిత ఉపాధ్యాయుడు)* వీ

# భారత రాజ్యాంగం - ఆర్థిక సంస్కరణలు, అసమానతలు

*అణగారిన వర్గాల అభివృద్ధికి ఎన్నో ఆర్థిక విధానాలను రూపొందించినప్పటికీ వాటిని అమలు చేయకపోవడం వల్ల సమాజంలో అసమానతలు తీవ్రంగా పెరుగుతున్నాయనీ, ఈ అసమానతలు ప్రజాస్వామ్యానికి ప్రమాదకరమనీ అంటున్నారు* **డా. పట్టా వెంకటేశ్వర్లు**

**డా.** అంబేద్కర్, 1949లో రాజ్యాంగ ముసాయిదాను పార్లమెంట్‌లో ప్రవేశపెడుతూ "భారతదేశంలో అంతరాలుగా విభజితమైన సమాజం ఉంది. అంటే కొందరు ఉన్నతులు, మరి కొందరు హీనులుగా పరిగణించే సమాజమన్నమాట. ఆర్థిక రంగంలో అపారమైన సంపదలు కలిగి ఉన్నది కొందరైతే, నికృష్ట దారిద్ర్యంలో మనుగడసాగించే కోట్లాది మంది ఉన్నారు. మనం ఈ స్థితిని ఇలాగే కొనసాగిస్తే, మన ప్రజాస్వామ్యానికే వినాశనం కొనితెచ్చుకున్నట్లు అవుతుంది. కాబట్టి ఈ వైరుధ్యాన్ని ఎంత తొందరగా వీలైతే అంతే తొందరగా తొలగించాలనే" హెచ్చరికను మన పాలకులు పట్టించుకోలేదు. పైగా, అందుకు భిన్నంగా అసమానతలను పెంచే ఆర్థిక విధానాలనే కొనసాగించారు. మరీ ముఖ్యంగా 1991 నుండి సరళీకరణ ఆర్థిక విధానాల అమలు తర్వాత సంపద కేంద్రీకరణ, ఆదాయ అసమానతలు తీవ్రంగా పెరగటంతో పాటు, పేదల సంక్షేమంపై దాడి జరుగుతున్నది. ఈ స్థితి రాజ్యాంగ స్వభావానికి వ్యతిరేకంగా ఉండడమే కాక, ప్రజల రాజకీయ సార్వభౌమత్వాన్ని ప్రమాదంలో పడేసింది. ఈ పరిణామాలు భారతదేశంలో మరో ప్రతిఘాత విప్లవ స్వభావాన్ని సూచిస్తున్నవి. మన దేశంలో మొదటి ప్రతిఘాత విప్లవం బౌద్ధానికి వ్యతిరేకంగా మనువాద బ్రాహ్మణికల్ ఫ్యూడల్ శక్తులు పుష్యమిత్ర శుంగుని నాయకత్వంలో తీసుకవస్తే, ప్రస్తుత ప్రతిఘాత విప్లవాన్ని పి.వి. నర్సింహరావు నాయకత్వంలోని బ్రాహ్మణికల్ పెట్టుబడిదారీ శక్తులు డా. అంబేద్కర్‌చే రూపొందించబడిన భారత రాజ్యాంగానికి వ్యతిరేకంగా తీసుకొచ్చాయి. అటు బుద్ధుడు, ఇటు అంబేద్కర్ ఈ ప్రతిఘాత విప్లవాల్ని ఎదుర్కోవడం యాదృచ్ఛికమే అయినప్పటికి, ఈ ప్రతిఘాత విప్లవశక్తులు మాత్రం ఒకే గూటికి చెందిన వారై ఉండడం గమనార్హం. కాబట్టి ఇప్పుడు నడుస్తున్న ప్రతిఘాత విప్లవాన్ని అర్థం చేసుకోవాలంటే అది రాజ్యాంగానికి ఎలా వ్యతిరేకంగా ఉన్నదనే విషయాన్ని పరిశీలించాల్సి ఉంది.

**రాజ్యాంగం ఏం చెబుతుంది?**

రాజ్యాంగంలోని పీఠిక "ప్రతి పౌరుడికి సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని హామీ ఇస్తూ, హోదాలోనూ, అవకాశాలలోనూ సమానత్వాన్ని లక్ష్యంగా ప్రకటించింది. అంటే 'సామాజిక న్యాయాన్ని' రాజ్యాంగపు లక్ష్యంగా ప్రకటించుకున్నది. కాబట్టి ఈ సామాజిక న్యాయం మొత్తం రాజ్యాంగం స్వరూప, స్వభావానికి గుండెకాయలాగా ఉన్నదని చెప్పవచ్చు. అందుకనే సుప్రీంకోర్టు, కేశవానంద భారతి వర్సెస్ యూనియన్ ఆఫ్ ఇండియా (ఎఐర్ 1973 ఎస్‌సి 1461) కేసులో పీఠిక రాజ్యాంగంలో భాగమేనని తీర్పుచెబుతూ, మన రాజ్యాంగంలోని పీఠికకు అత్యధిక ప్రాధాన్యత ఉందని చెప్పింది. అందులో వ్యక్తపరిచిన ఉన్నతమైన, ఉత్పన్నమైన అభిప్రాయాలు చదివి రాజ్యాంగాన్ని అన్వయించాలని కూడా పేర్కొంది. ఈ విధంగా పీఠికలోని లక్ష్యం కనుగుణంగానే ఆదేశ సూత్రాలు రాయబడ్డాయి. ఈ సూత్రాలు దేశ రాజకీయ పరిపాలనకు అవి మూలధారంగా నిలుస్తున్నాయి. అవి ఏం నిర్దేశిస్తున్నాయంటే, ఆర్టికల్ 38 (1) ప్రజల శ్రేయస్సును పెంపొందించేందుకు, సాంఘిక వ్యవస్థను మార్చడం (2) వ్యక్తుల మధ్య, వర్గముల మధ్య ఆదాయ, అసమానతలు తగ్గించడానికి ప్రయత్నించాలని చెబుతాయి. ఇంకా ఆర్టికల్ 39(ఎ)లో స్త్రీ పురుష భేదం లేకుండా పౌరులకు జీవనోపాధి హక్కు కలిగి ఉండడం. (బి) భౌతిక వనరులపై యజమాన్యం, నియంత్రణ ప్రజలకు కలిగించడం. (సి) సంపద, ఉత్పత్తి సాధనములను వికేంద్రీకరించేలా ఆర్థిక వ్యవస్థను నిర్వహించడం. అంటే ఆర్థిక ప్రజాస్వామ్యం ద్వారా రాజకీయ ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడం రాజ్యాంగ లక్ష్యంగా ఉంటుందని డా. అంబేద్కర్ చెప్పారు. ఈ విధంగా రాజ్యాంగం కుల ఆధారిత సామాజిక వివక్షతలు, అంతరాలకు వ్యతిరేకంగా భారతదేశంలో మొదటి సారిగా సాంఘిక సమానత్వానికి పునాదిని వేసింది. కాబట్టి రాజ్యాంగ అవతరణని ఒక సామాజిక విప్లవంగా చెప్పవచ్చు. కానీ ఆచరణలో మాత్రం అందుకు వ్యతిరేక విధానాలు అమలు జరుగుతున్న దాన్ని చూడవచ్చు.

**మరీ రాజ్యాంగం అమలౌతుందా?**

ఆదేశిక సూత్రాలు, సంపద కేంద్రీకరణ, ఆర్థిక అసమానతలు పెరగకుండ చూడాలని ఆదేశించినప్పటికీ అందుకు భిన్నంగా ఏకస్వామ్యాల పెట్టుబడి వృద్ధి జరుగుతూనే ఉంది. 1965లోనే ఏకస్వామ్యాల విచారణ కమిషన్ చెప్పిందేమంటే, 75 పారిశ్రామిక కుటుంబాలు 1,536 కంపెనీలను తమ చేతుల్లో పెట్టుకొన్నట్లు తెలిపింది. దత్తు కమిటీ కూడా 20 అతిపెద్ద పారిశ్రామిక కుటుంబాలు 1963-66లో సగటున ప్రతి కుటుంబానికి 35 కోట్ల రూపాయల ఆస్తులు కలిగి ఉన్నట్లు చెప్పింది. ఇక టాటా ఆస్తి 1969లో 642 కోట్లు ఉంటే. ఇదే టాటాది 1939లో కేవలం 62.42 కోట్లు మాత్రమే. టాటాల తర్వాత బిర్లా 456 కోట్లతో రెండవ స్థానంలో ఉన్నాడు. 1989-90ల నాటికి వీరి ఆస్తులు 8, 531 కోట్లకు టాటాది, 8,473 కోట్లకు బిర్లా ఆస్తి పెరిగింది. ఆనాటికి మొత్తం 20 కుటుంబాల ఆస్తులు 41,522 కోట్లకు పెరిగింది. ఈ పరిణామం ఏం తెలియజేస్తున్నదంటే 1970 నాటికే ఏకస్వామ్యాల నియంత్రణ వాణిజ్య చట్టం ఎంఆర్‌టిపి వచ్చినప్పటికి కూడా సంపద కేంద్రీకరణ మరింత పెరిగిందే తప్పా తగ్గించబడలేదు. ఇదంతా నయా ఉదారవాద విధానాల అమలుకు పూర్వ చరిత్ర. కానీ ఈ విధానాలు అమలైన తర్వాత తీవ్రమైన మార్పులు ఆర్థిక వ్యవస్థలో ప్రవేశపెట్టబడ్డాయి.

ముఖ్యంగా 1991 పారిశ్రామిక విధానం ఎంఆర్‌టిపి చట్టాన్ని రద్దు చేసింది. ఈ 1991 పారిశ్రామిక తీర్మాన విధానం పూర్తిగా 1948, 1956 తీర్మాన విధానానికి వ్యతిరేకమైనది. ఎందుకంటే 1948, 1956 తీర్మాన విధానాలు ప్రభుత్వ రంగాన్ని బలోపేతం చేయటమేకాక రాజ్యాంగంలో పేర్కొన్న సోషలిస్టు తరహా సమాజం వైపుకు తీసుకెళ్తాయి.

ఈ కథ అక్కడితో ముగుస్తుంది. కానీ ఆ తర్వాత వచ్చిన పారిశ్రామిక తీర్మాన విధానాలు ఆర్థిక వ్యవస్థలో ప్రైవేట్ రంగం మరింత పెరగడానికి దోహదపడ్డాయి. ఈ విధంగా 1991 పారిశ్రామిక తీర్మానం మాత్రం పూర్తి స్థాయి ప్రైవేటు ద్రవ్య పెట్టుబడిదారీ వ్యవస్థను అమలులోకి తెచ్చింది. దీనినే క్రోని క్యాపిటలిజం (అశ్రిత పెట్టుబడిదారీ విధానం) అని అంటున్నారు. అందులో భాగంగానే ప్రభుత్వ రంగాలను ప్రైవేటీకరించడం కోసం పెట్టుబడుల ఉపసంహరణ పథకాన్ని ప్రభుత్వాలు తీసుకొచ్చాయి. అంతేకాక దేశీయ మార్కెట్‌ను అంతర్జాతీయ సంస్థలు ప్రవేశించడానికి తలుపులు బార్లాగా తెరిచి, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల నియంత్రణను ఎత్తివేయడం, దేశ సంపదపై ప్రజలకున్న సహజ హక్కులను తొలగిస్తూ ప్రైవేట్ వ్యక్తులకు కట్టబెట్టే విధానాలు తీసుకొచ్చారు. దీనితో అన్ని వ్యవస్థలను వ్యాపారమయం చేసే ప్రక్రియ ఊపందుకుంది. ఈ విధంగా భారతదేశం పారిశ్రామిక వేత్తల స్వర్గధామంగా మార్చబడింది. అటుతర్వాత సంపద కేంద్రీకరణ అనేది కని విని ఎరగని రీతిలో పెరిగిపోతూనే ఉంది. ఈ విషయాన్ని పట్టిక-1లో పరిశీలించవచ్చు.

2007లో ఫార్చ్యూన్ ఇండియా జాబితా చూస్తే, టాటా మొదటి స్థానం ఎగిరిపోయింది. ఆ స్థానంలో 1,14,086 కోట్లతో ముఖేష్ అంబానీ ముందుకు వచ్చాడు. నయా ఉదారవాద విధానాల అమలుకు ముందు అంటే, 1989-90 నాటికి మొత్తం 20 పారిశ్రామిక కుటుంబాల సంపద కేవలం 41,522 కోట్లు ఉంటే, అవి అమలైన తర్వాత ఒక్క ముఖేష్ సంపద 1,14,086 కోట్లు. ఇంతకుముందే చెప్పినట్లు, ఆర్థిక సంస్కరణలు అమలైన తర్వాత ప్రభుత్వ రంగ సంస్థలను, సహజ వనరులను అప్పనంగా ప్రైవేట్ వ్యక్తులకు ధారాదత్తం చేయడం వంటి విధానాల వల్ల క్రోణి క్యాపిటలిజం పెరగటంతో టాటా, బిర్లా లాంటి సాంప్రదాయ పెట్టుబడిదారులు వెనుకపట్టు పట్టారు. 1997లో ముఖేష్, అనిల్ ఇద్దరిది కలిపి కూడా 19,345 కోట్లు మాత్రమే. కానీ 15 సంవత్సరాలలో ముఖేష్ సంపద అమాంతంగా పెరిగింది. ఇందుకు కారణం కేజీ బేసిన్ సహజ వాయువు నిక్షేపాలు రిలయన్స్ ఇండస్ట్రీస్‌కు పూర్తిగా యజమాన్య హక్కులు కల్పించటంతోపాటు గ్యాస్ ధరల విధానం పూర్తిగా ఆ సంస్థకు అనుకూలంగా నిర్ణయించడంతో విపరీతంగా లాభాలు పెరిగిపోయాయి.

హురూన్ ప్రకటించిన ఇండియా సంపన్నుల జాబితా 2014లో కూడా ముఖేష్ ఆస్తులు 37 శాతం పెరిగి 1.65 లక్షల కోట్లకు చేరి తన మొదటి స్థానాన్ని నిలుపుకున్నాడు. ఈ జాబితాలో సన్ ఫార్మాస్యూటికల్స్ అధినేత దిలీప్ సంఘ్వి రెండవ స్థానానికి చేరాడు. ఈసారి కొత్తగా ప్రధానమంత్రి మోడీ సన్నిహితుడు గౌతమ్ అధాని 10వ స్థానానికి వచ్చాడు. ఒక సంవత్సరంలోనే 152 శాతం ఆదాయం పెరుగుదలతో 44,020 వేల కోట్లకు చేరాడు. 20 సంవత్సరాల క్రితం ఇతని ఆదాయం కేవలం 10 లక్షలు మాత్రమే. ఈ రకంగా సంపద పెరిగిందంటే దేశ వనరులు ఏ స్థాయిలో కొల్లగొట్టబడ్డాయనేది తెలుస్తుంది. ఒక అంచనా ప్రకారం బ్రిటిష్ వాడు 200 ఏండ్లలో దోచుకున్నదానికంటే కేవలం 15 ఏండ్లలోనే మన దేశ పెట్టుబడిదారులు దోచుకున్నది ఎక్కువగా ఉన్నదనే అంచనాలు ఉన్నాయి. ఈ పరిణామం ఆర్థిక అంతరాలనీ మన సమాజంలో విపరీతంగా పెంచింది. కాబట్టే 2009 వస్తు సేవలపై మొత్తం వ్యయంలో 21.3 శాతం కేవలం పైభాగంలోనున్న 5 శాతం సంపన్నులున్న చేతుల్లో ఉంది. 1993లో వీరిది 17.7 శాతం మాత్రమే. ఈ విధంగా భారతదేశంలో గడిచిన 15 యేండ్లలో కోటీశ్వర్ల ఆస్తులు నికర విలువ 12 రెట్లు పెరిగింది. ఇక కోటీశ్వరుల ఆస్తులు మోడి పాలనకాలంలో ఇంకా ఎలా పెరిగాయో పట్టిక 2లో పరిశీలించవచ్చు.

**మోడి పాలన కాలంలో ధనవంతులు మరింతగా పెరిగారా?**

2014లో మోడీ ప్రభుత్వం ఏర్పడినప్పటి నుంచి మార్చి 2019 వరకు దేశంలో ధనవంతులసంపద బాగా పెరిగింది. ఈ ఐదేళ్లలో ఏడాదిన్నర మినహాయిస్తే జీడీపీ వృద్ధిరేటు ఏడు శాతానికి పైగా నమోదయింది. దీంతో సంపన్నుల ఆదాయాలు దాదాపు రెట్టింపు అయ్యాయి. సామాన్యుడి తలసరి ఆదాయం మాత్రం రు. 68,572 నుంచి రు. 1.25 లక్షల దాకా పెరిగింది. సంపన్నుల ఆదాయాలతో పోలిస్తే ఇది చాలా తక్కువ. ఫోర్బ్స్ పత్రిక జాబితా 2019 ప్రకారం.. మనదేశంలోనే అత్యంత సంపన్నుడు మరల రిలయన్స్ అధిపతి ముకేశ్ అంబానీనే. ఆయన సంపద 2014లో 23 బిలియన్ డాలర్లు (దాదాపు 1.60 లక్షల కోట్లు) ఉంటే, 2019లో 50 బిలియన్ డాలర్లకు (దాదాపు రు. 2.49 లక్షల కోట్లు) చేరింది. అంటే రెండు రెట్లుపైగా పెరిగిందన్న మాట. రెండో స్థానంలో ఉన్న విప్రో అధిపతి అజీమ్ ప్రేమ్‌జీ సంపాదన 16.4 బిలియన్ డాలర్ల నుంచి 22.6 బిలియన్ డాలర్లకు ఎగిసింది. మూడోస్థానంలో ఉన్న ఎచ్‌సీఎల్ వ్యవస్థాపకుడు శివ్‌నాడార్ సంపాదన 12.5 బిలియన్ డాలర్ల నుంచి 14.6 బిలియన్ డాలర్లకు చేరింది.. నాలుగో ర్యాంకు దక్కించుకున్న అంతర్జాతీయ స్టీల్ కంపెనీ సీఈఓ లక్ష్మీ మిట్టల్ సంపాదన 15.8 బిలియన్ డాలర్ల నుంచి 18.3 బిలియన్ డాలర్లకు ఎగిసింది. 2014లో ఫోర్బ్స్ జాబితాలో స్థానం సంపాదించుకోలేకపోయిన కోటక్ బ్యాంకు ఎండీ ఉదయ్ కోటక్ ఈసారి 11.8 బిలియన్ల సంపాదనతో ఐదో ర్యాంకుకి వచ్చారు. 2014లో ఈయన నెట్‌వర్త్ 6.1 బిలియన్ డాలర్లుగా తేలింది. ఆదిత్య బిర్లా గ్రూప్ చైర్మన్ కుమార మంగళం బిర్లా 11.1 బిలియన్ల సంపాదనతో ఆరో ర్యాంకుకు వచ్చారు. 2014లో ఆయన నెట్‌వర్త్ 9.2 బిలియన్లు ! బిర్లా మాదిరే డిమార్ట్ సూపర్‌మార్కెట్ల అధిపతి రాధాకృష్ణ దమానియా 2014లో ఫోర్బ్స్ జాబితాలో చోటు దక్కించుకోకున్నా ఈ ఏడాది మాత్రం 11.1 బిలియన్ల సంపాదనతో ఏడో ర్యాంకు పొందారు. ఐదేళ్ల క్రింత ఈయన ఆస్తి బిలియన్ డాలర్లు మాత్రమే. సీరమ్ ఇన్‌స్టిట్యూట్ అధిపతి సైరస్ పూణావాలా సంపాదన 6.2 బిలియన్ డాలర్ల నుంచి 9.5 బిలియన్లకు చేరింది. ఈయన ఎనిమిదో ర్యాంకు లోకి వచ్చారు. ఎన్నో వ్యాపారాలు చేసే గౌతమ్ అదానీ సంపాదన 7.1 బిలియన్ల నుంచి 8.7 బిలియన్లకు చేరింది. ఈయన తొమ్మిదో ర్యాంకులో ఉన్నారు. పదో ర్యాంకులో ఫార్మ దిగ్గజమైన దిలీప్ సంఘ్వి నిలిచారు. ఈ లెక్కలను గమనిస్తే ఒకరిద్దరిని మినహాయిస్తే టాప్‌టెన్ ధనికుల సంపాదన ఈ ఐదేళ్లలో కనీసం 75 శాతం పెరిగింది. అంటే ఆదాయాలు రెట్టింపయ్యాయి.

**భారీగా పెరుగుతున్న అంతరాలు**

ఇండియాలో పెరుగుతున్న ఆర్థిక అసమానతలపై ఆక్స్ ఫామ్ అనే అంతర్జాతీయ సంస్థ చేసిన సర్వే దిగ్భ్రాంతికర విషయాలను వెల్లడించింది. ఈ నివేదిక ప్రకారం భారతదేశంలోని సంపదలో ఎక్కువ భాగం కేవలం ఒక్కశాతం మంది సంపన్నుల దగ్గరే ఉంది. అంటే రూపాయిలో 73 పైసలు వీరి దగ్గరే ఉన్నాయి. అంటే మిగిలిన 27 శాతం డబ్బు 99 శాతం మంది పంచుకుంటున్నారు. ఈ విధంగా దేశంలోని 99 శాతం మంది జనం కేవలం 27 శాతం డబ్బుతో బతికేస్తున్నారు. వీళ్లందరూ స్వయం ఉపాధి చేసుకుంటే అరకొర సంపాదనతో బతుకు బండి లాగుతున్నారు. మరో ఆశ్చర్యకర విషయం ఏంటంటే 67 కోట్ల మంది భారతీయుల సంపద గత రెండేళ్లలో పెరిగింది కేవలం ఒక్క శాతం అంటే వెయ్యికి 10 రూపాయలు మాత్రమే పెరిగింది.

ఈ విధంగా కార్పొరేట్ సంస్థల ఆస్తులు పెరగటమేకాదు, అందులో

పనిచేస్తున్న వివిధ కంపెనీల చీఫ్ మేనేజింగ్ డైరెక్టర్స్ సంవత్సర జీతభత్యాలు కూడా కోట్లలోనే ఉంటున్నాయి. 2017లో సీపి గుర్నాని సాలుసరి వేతనం 150.7 కోట్లు ఉంటే కళానిది మారన్ (సన్ టీవీ) పొందుతుంది 78 కోట్లుగా ఉంది. హీరోమోటార్ సిఇఒ పవన్‌మంజల్ 60 కోట్లు. ఈ విధంగా అన్ని కంపెనీల సిఇఓలు కోట్లలోనే ఆదాయాన్ని పొందుతున్న విషయాన్ని పట్టిక-2లో చూడవచ్చు.

2011-17లలో మధ్య సాధారణ ఉద్యోగుల వేతనాలలో వృద్ధి 3 శాతం ఉండగా సంపన్నుల డెవిడెండ్ ఆదాయాల వృద్ధి 31 శాతంగా ఉందని ఆక్స్‌ఫామ్ పేర్కొన్నది. వివిధ వర్గాల ఆదాయ స్థాయి వృద్ధిని పరిశీలించినప్పుడు మొదటి 10 శాతం వర్గాల ఆదాయాల వృద్ధి 1951-80 మధ్యకాలంలో 28 శాతం పెరగగా 1980-2014 మధ్య వారి ఆదాయాలు 61 శాతానికి పెరిగినవి. ఇదే కాలంలో మధ్య నున్న 40 శాతం వారి ఆదాయాల వృద్ధి 49 నుండి 23 శాతానికి, చివరికి 50 శాతానికి పెరిగిన ఆదాయాల వృద్ధి 24 నుంచి 11 శాతానికి తగ్గాయి. అదే సమయంలో ఫ్యాక్టరీల రంగంలో 1981-82 నాటికి వాటి నికర విలువలో కార్మికుల జీత భత్యాలు 30.28 శాతంగా ఉండేవి. అవి 1992-93 నాటికి 19.90 శాతానికి, 2007-08 నాటికి 10.60 శాతానికి దిగజారిపోయాయి.

ఇలా కార్మికుల జీత భత్యాల నికర విలువ తగ్గితే, ఈ నికర విలువ పెరుగుదలను 90 శాతం లాభాల రూపంలో ఈ సిఇఒలందరూ ఎగురేసుకుపోయారు. అలాగే 1990-2001 మధ్య కాలంలో సంఘటిత రంగంలో ఉన్న కార్మికుల నిజవేతనం రోజుకు 108.41 రూపాయలు ఉంటే 2010-11 నాటికి 103.76 రూపాయలకు దిగజారిపోయింది. ఈ కార్మికుల వేతనాల్ని సిఇఓల వేతనలతో పోల్చిచూస్తే కొన్ని వందల రేట్లు తేడా ఉంటుంది. ఈ విధంగా ఒకవైపు సిఇఓల జీతాలు కోట్లలో ఉంటే కొత్తగా ఉనికిలోకి వచ్చిన సాఫ్ట్‌వేర్ రంగంలో కొందరి వేతనాలు లక్షల్లో ఉంటున్నాయి. కొందరు ఐఏఎస్‌లు ఉద్యోగాలకు రాజీనామాచేసి సాఫ్ట్‌వేర్ రంగంలోకి వెళ్లినట్లు సమాచారం అందుతున్నది. ఈ రంగం టెక్నోస్వేచ్ఛ బానిసత్వాన్ని అమలులోకి తెచ్చింది. అంతేకాక ప్రభుత్వ రంగంలో కూడా కాంట్రాక్టు, క్యాజువల్స్ టెంపరరీ, ఔట్‌సోర్స్ తదితర రకాల పద్ధతి విస్తరిస్తుంది.

**పోని పెరిగిన సంపద ప్రజాస్వామికరించబడిందా?**

అంటే అదీ లేదు, మనువాద కుల యథాస్థితిని అలాగే కొనసాగిస్తున్నట్లు తెలుస్తున్నది. ప్రపంచీకరణ వల్ల కార్పొరేట్ రంగం విస్తరిస్తున్నప్పటికీ అందులో కూడా అగ్రకులాల వారే అధికంగా ఉంటున్నారు. దేశీయ కార్పొరేట్ రంగంలోని టాప్ 1000 కంపెనీల బోర్డుల్లో ఉన్న వ్యక్తుల కులాలను పరిశీలిస్తే, భారత సామాజిక వ్యవస్థను తరతరాలుగా శాసిస్తున్న కులవ్యవస్థ కార్పొరేట్ రంగంలో కూడ ఉందని స్పష్టమవుతుంది. 2010లో కెనడా యూనివర్సిటీకి చెందిన డి. అజిత్ హెచ్ డోంకర్, ఆర్ సెక్సేనాలు మార్కెట్ క్యాపిటలైజేషన్ దృష్ట్యా దేశీయ వ్యాపార, పారిశ్రామిక రంగాల్లో టాప్ 1000 కంపెనీలను ఎన్నుకొని వారు ఈ అధ్యయనం చేశారు. బిఎస్ఇ, ఎన్ఎస్ఇల్లో లిస్ట్ అయిన మొత్తం కంపెనీల మార్కెట్ క్యాపిటలైజేషన్‌లో ఈ 1000 కంపెనీల వాటా ఐదింట నాలుగు వంతులుంది. ఈ కంపెనీల బోర్డ్ డైరెక్టర్లుగా ఉన్నావారిలో 93 శాతం మంది అగ్రకులాల వారే ఉన్నారు. ఇందులో 46 శాతం మంది వైశ్యులు, 44 శాతం మంది బ్రహ్మణులు ఉన్నారు. 0.5 శాతం క్షత్రియులైతే, మరో 1.5 శాతం ఇతర అగ్రకులాల వారు ఉన్నారు. మిగతా 7 శాతంలో 3.8 శాతం బిసిలు 3.5 శాతం, ఎస్సీ, ఎస్టీలకు చెందిన వారు ఉన్నారు. అధ్యయనం జరిపిన సంస్థల్లో 65 శాతం కార్పొరేట్ బోర్డులో ఒకే కులానికి చెందినవారే ఉన్నారని పేర్కొన్నారు. కాబట్టి భారతీయ కార్పొరేట్స్ ప్రపంచం బయటకు విశాలంగా కనిపిస్తున్నా అది చుట్టూ కులం దడికట్టుకున్న ఒక చిన్న ప్రపంచమని ఈ అధ్యయనం వ్యాఖ్యానించింది. ఈ కార్పొరేట్ కంపెనీలు బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల కనుసన్నల్లోనే నడుస్తున్నాయి. కార్పొరేట్ అగ్రకుల శక్తికి ఈ బోర్డులను సంకేతంగా చెప్పవచ్చు.

**పట్టిక-1. ఆస్తులపరంగా దేశంలో తొలి పది కంపెనీలు (రూ. కోట్లలో)**

| ఆర్థిక సంస్కరణలకంటే ముందు | | | | | | ఆర్థిక సంస్కరణల తర్వాత | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1939 | | 1969 | | 1989-90 | | 2007 | | 2014 | |
| టాటా | 62.42 | టాటా | 505.63 | టాటా | 85.31 | ముఖేష్ అంబానీ | 1,14,086.40 | ముఖేష్ అంబానీ | 1,65000 |
| మార్టిన్ బన్ | 18.02 | బిరా | 456.40 | బిర్లా | 84.73 | టాటా | 98,233.05 | దిలిప్ సందీప్ | 1,29000 |
| బర్డ్ | 12.40 | మార్టిన్ బన్ | 153.06 | రిలయన్స్ | 3600 | అనిల్ | 47929.85 | లక్ష్మీ మిట్టల్ | 97,000 |
| అండ్రూ యూలే | 12.38 | బంగూర్ | 104.31 | థాపర్ | 1277 | ఆదిత్య బిర్లా | 45568.89 | ప్రేమ్‌జీ | 86,000 |
| ఇంచ్‌కేఫ్ | 10.70 | థాపర్ | 97.80 | జీకె సింగానియా | 2139 | ఎస్సార్ | 35138.09 | శివనాడార్ | 78,000 |
| ఎడ్ శాస్సన్ | 9.56 | ఎస్ నగర్మల్ | 95.61 | లార్‌సేన్/టర్బో | 1681 | ఓపి జిందాల్ | 26,856.40 | ఎస్.పి హిందూజా | 72,000 |
| ఎసీసీ | 8.68 | మఫత్‌లాల్ | 92.70 | మోడీ | 1399 | హిందూజా | 23,196.88 | పల్లోంజీ మిస్త్రి | 63,000 |
| బీఈజీజీ | 5.75 | ఏసీసి | 89.80 | బజాజ్ | 1391 | భారతీ | 20,628.72 | బిర్లా | 61,620 |
| ఓరియంటల్ టెలి | 5.60 | వాల్‌చంద్ | 81.11 | మఫత్‌లాల్ | 1344 | స్టెరిలైట్ | 19,324.34 | సునీల్ మిట్టల్ | 51,320 |
| దాల్మియా | 5.51 | శ్రీరామ్ | 74.13 | ఎం.ఎ చిదంబరం | 1278 | బజాజ్ | 16,960.74 | అదానీ | 44.020 |

ఆధారం : సిఎంఐఇ, భారతదేశ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన ప్రాథమిక గణాంకాలు, ఆగస్టు 1993. ఫార్చ్యూన్ ఇండియా జాబితా – 2007. హురూన్, ఇండియా జాబితా – 2014

**ఈ ఆర్థిక అసమానతలకు కారణమేమిటి?**

1) ఒకప్పుడు వారసత్వంగా వచ్చిన స్థిరచరాస్తులే ఆర్థిక అసమానతలకు కారణమవుతున్నాయి. సంస్కరణల అనంతరం మనదేశంలోనూ అత్యధిక జీతభత్యాలు ఆర్జించే వర్గం ఏర్పడింది. దీనికి తోడు కార్పొరేట్ రంగానికి 1.5 లక్షల కోట్ల పన్ను రాయితీలను ఇచ్చి, మోడీ ప్రభుత్వం తన దయా గుణాన్ని చాటింది. ఈ పరిస్థితి కూడా అసమానతలకు కారణమయింది.

2) 1992లో ఆర్థిక సంస్కరణల అనంతరం ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం వల్ల భారతీయుల ఆదాయాల్లో విపరీతమైన అంతరాలు చోటుచేసుకున్నాయి. దేశ ఆర్థికాభివృద్ధి నుంచి కార్మికులు, ఉద్యోగులు లబ్ధి పొందింది ఏమీ ఉండటం లేదని పలు అధ్యయనాల్లో తేలింది.

3) ధనిక వర్గాలకు నాణ్యమైన, అధిక ఆదాయాన్ని సమకూర్చే విద్యలను పొందే అవకాశం ఉంటుంది. వృత్తి విద్య, వైద్య విద్య, ఇంజనీరింగ్ విద్య, కంప్యూటర్ విద్య అభ్యసించే ధనికవర్గాలు మరింత ధనికులుగా మారుతుండగా, పేదవారు పేదవారిగానే మిగిలిపోతున్నారు. ముఖ్యంగా విద్యా, వ్యాపారీకరణ చెందడం వల్ల విద్యను పొందే విషయంలో వర్గ అసమానతలకు దారి తీస్తున్నది. డబ్బున్నళ్ళకు నాణ్యమైన విద్య అందుబాటులోకి వస్తే డబ్బు లేనివారికి నాసిరకం విద్యా సాంప్రదాయ కోర్సులకు పరిమితం కావల్సివస్తున్నది. ఈ రకమైన స్థితి పేద కులాల వారి ఉపాధి అవకాశాలకు గండి కొడ్తున్నది. ఇది చాలా ప్రమాదకరమైన ధోరణిగా చెప్పవచ్చు. మనువాదం ఆధునిక రూపంలో అమలు కావడం అంటే ఇదే.

4) ఇండియా ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందేకొద్దీ వివిధ వర్గాల ఆదాయాలు వేర్వేరుగా వృద్ధి చెందుతున్నాయి. పేదల ఆదాయంకన్నా ఎగువ మధ్య తరగతి, మధ్యతరగతి వర్గాల ఆదాయాలు వేగంగా పెరుగుతున్నాయి.

5) గ్రామాల్లో నివసించే 40 కోట్ల మంది మహిళల్లో 40 శాతం మంది వ్యవసాయ రంగంలో నిమగ్నమైఉన్నారు. వీళ్లకు రైతులుగా గుర్తింపులేదు. సొంత భూమీ లేదు. ప్రభుత్వం సాయమూ అందడం లేదు. ఈ వివక్ష వారి ఆదాయాల్లో కూడా తీవ్ర ప్రభావాన్ని చూపుతున్నది.

6) కార్మికులు అవసరం ఎక్కువగా ఉండే పరిశ్రమలు మూతపడటం వల్ల వేలల్లో ఉపాధి కోల్పోతున్నారు. కొత్త ఉద్యోగాల పుట్టుక తగ్గిపోతున్నది. వ్యవసాయం, మౌలిక వసతుల రంగాల్లో పెట్టుబడులు తగ్గిపోవడమూ మరోకారణంగా ఉంది.

**దేశాన్ని సవాల్ చేస్తున్న నల్లధనం**

ఇక దేశ ఆర్థిక వ్యవస్థను సవాల్ చేస్తున్న నల్లధనం విషయానికొస్తే 2011 నాటికి మొత్తం 20.92 లక్షల కోట్లు ఉంటే 2018లో 300 లక్ష కోట్ల రూపాయలకు చేరింది. ఇదంతా పన్ను ఎగవేత, అవినీతి, లంచాలు, నేరపూరిత కార్యకలాపాల వల్ల పెరిగిన పాపం. ఇందులో 9.64 లక్షల కోట్ల రూపాయలు 1948 నుండి 2008 మధ్యకాలంలో తరలిపోగా, మిగిలిన 11.28 లక్షల కోట్లు, 2008–10 మధ్య తరలిపోయింది. మరో మాటలో చెప్పాలంటే 60 యేండ్ల అవినీతికంటే కేవలం 2008–19 మధ్యకాలంలో జరిగిన అవినీతి విచ్చలవిడిగా పెరిగింది. ప్రస్తుత బిజెపి ప్రభుత్వం విదేశాల్లో దాచి నల్లధనాన్ని బయటకు తెస్తామనే హామీతోనే 2014లో అధికారంలోకి వచ్చింది. అందుకోసమే 2016లో పెద్ద నోట్లు రద్దును ప్రకటించింది. కాని రద్దయిన నోట్లలో 99.3 శాతం డబ్బు తిరిగి రిజర్వు బ్యాంకుకు చేరింది. ఈ విధంగా నల్లడబ్బును రాబట్టే చికిత్స విఫలమైంది. 2017–18 ఆర్థిక సంవత్సరంలో భారతదేశంలో జాతీయ పార్టీలు పారిశ్రామిక వేత్తలు, వ్యాపారుల నుండి 1,198.75 కోట్ల రూపాయల విరాళాలు పొందాయి. ఈ విరాళాల డబ్బును ఓటర్లను ప్రలోభ పెట్టడానికి వాడుతున్నాయి. ఈ విధంగా ఎన్నికల వ్యవస్థ వ్యాపారమయంగా మార్చబడింది. ఇందువల్లనే రాజకీయాల్లో డబ్బున్నవారి జోక్యం పెరిగింది. ప్రస్తుత పార్లమెంటులో 541 మంది ఎంపిలలో 442 మంది కోటీశ్వరులున్నారు. వీరిలో ఒక్కొక్కరి సరాసరి ఆస్తి 14.61 కోట్ల రూపాయలు. 2009లో 521 మందిలో 300 మంది కోటీశ్వరులు ఉంటే, 2014 నాటికి వారి సంఖ్య 442 మందికి పెరిగింది. ఇందులో బిజెపిదే సింహ భాగం.

**పట్టిక – 2**

**టాప్ 10 సంస్థలు ఆదాయాల పెరుగుదల వివరాలు (బిలియన్ డాలర్లలో)**

| | 2014 | 2019 |
|---|---|---|
| ముకేశ్ అంబానీ | 23.0 | 50.0 |
| అజీమ్ ప్రేమ్‌జీ | 16.4 | 22.6 |
| శివ్ నాడార్ | 12.5 | 18.3 |
| లక్ష్మీ మిట్టల్ | 15.8 | 18.3 |
| ఉదయ్ కోటక్ | 6.1 | 11.8 |
| కుమార్ బిర్లా | 9.2 | 11.1 |
| రాధాకృష్ణ దమానియా | 1.0 | 11.12 |
| సైరస్ పుణావాలా | 6.2 | 9.5 |
| గౌతం ఆదానీ | 7.1 | 8.7 |
| దిలీప్ సంఘ్వీ | 18.0 | 7.6 |

ఆధారం : ఫోర్బ్సు పత్రిక జాబితా, 2019

**ఇంకా పేదరికం ఉందంటే పాలకులకు సిగ్గు ఉందా?!**

పేదరికం విషయానికి వస్తే, రంగరాజన్ కమిటీ ప్రకారం 2011–12 నాటికి 36.3 కోట్ల మంది పేదరికంలో ఉన్నారు. ఈ అంచనా కేవలం ఒక మనిషి ఒకరోజుకు తీసుకోవాల్సిన 2,400 క్యాలరీల ఆహారం ఆధారంగా జరిగింది. ఇందుకు తలసరి వినియోగం ఖర్చు రోజుకు 22 రూపాయలుగా చెప్పటం జరిగింది. నిజంగా ఈ రకమైన క్యాలరీల ఆహారం తీసుకోవాలంటే స్వీట్ దుంపలు తీసుకున్నా లభిస్తుంది. మరి దుంపలు తింటే సరిపోతుందా? పౌష్టికాహారం వద్దా? ఈ 22

**పట్టిక–3**

**కార్పొరేట్ రంగ సిఎండి వార్షిక జీతభత్యాలు, 2017 (కోట్లలో)**

| | | | |
|---|---|---|---|
| 1. | సి.ఆర్ గుర్‌నాని | టెక్ మహేంద్రా | 150.7 |
| 2. | కళానిది మారన్ | సన్‌గ్రూపు | 78 |
| 3. | పవన్ మంజల్ | హిరోమోటర్స్ | 60 |
| 4. | విశాల్ సిక్కా | ఇన్ఫొసిస్ | 45.11 |
| 5. | ఎన్. చంద్రశేఖరన్ | టాటాగ్రూప్ | 25.9 |
| 6. | రాహుల్ బజాజ్ | బజాజ్ గ్రూప్ | 25.59 |
| 7. | గ్వెంథర్ బట్‌షెక్ | టాటా మోటర్స్ | 22.5 |
| 8. | కుమార్ మంగళం బిర్లా | ఆదిత్య బిర్లా | 22.5 |
| 9. | మోగెష్ చందర్ దేవేశ్వర్ | ఐటిసీ | 21.10 |
| 10. | ముఖేష్ అంబాని | రిలయన్స్ ఇండస్ట్రీస్ | 15 |

ఆధారం : బిజినెస్ వ్యూ మ్యాగజైన్ 2019

రూపాయలకు కెజి దుంపలు కూడా రావు కదా? కాబట్టి మనిషి ఏదో ఒకటి తింటే సరిపోదు. దీనితోపాటు బట్టలు, గృహ వసతి, విద్య, వైద్యం అవసరాలు కూడా ఉంటాయి. వీటన్నిటికి ఖర్చు లెక్కవేసుకుంటే ఎంత కావాల్సి ఉంటుందో లెక్కేయండి. అప్పుడు ఈ 22 రూపాయలు ఏ మూలకు సరిపోతాయి. కాబట్టి ఇవన్ని పరిగణలోకి తీసుకొని లెక్కిస్తే పేదరికపు శాతం చాలా ఎక్కువగా ఉంటుంది. కానీ ఒక వైపు సంక్షేమ రంగంపై ఖర్చును ప్రభుత్వాలు తగ్గిస్తున్నాయి. ఈ నేపథ్యంలో పేదరికం విపరీతంగా పెరగటానికి అవకాశం ఉంది.

ప్రపంచ బ్యాంకు అంచనా ప్రకారం రోజుకు 2 డాలర్ల ఆదాయం పొందుతున్న వారిని పరిగణనలోకి తీసుకుని భారతదేశంలో 30 శాతం మంది పేదరికంలో మగ్గుతున్నారని తెలిపింది. అదే 1.25 డాలర్లలోపు ఆదాయం పొందే వారిని తీవ్రమైన పేదవారిగా పరిగణిస్తూ ఇలాంటి వారు 2011 నాటికి 23.6 శాతంగా ఉన్నట్టు తెలిపింది. ఇందువల్లనే యుఎన్ఒఓ ఆధ్వర్యంలో వెలువడుతున్న ప్రపంచ ఆకలి సూచికలో భారతదేశం 2014లో 55 స్థానంలో ఉండగా 2019 నాటికి మన స్థానం 102కు చేరింది. దక్షిణాసియా దేశాలన్నిటిలో కెల్లా అత్యంత నికృష్టమైన స్థానంలో ఉంది.

ఈ నయా ఉదారవాద విధానాల 23 సంవత్సరాల కాలంలో జరిగిన అభివృద్ధి జనాభాలోని కేవలం 23 శాతం మంది అవసరాలను మాత్రమే తీర్చగలిగింది. మిగతా 77 శాతం ప్రజలు పక్కకు నెట్టివేయబడ్డారు. ఈ తరగతి ఆదాయం గాని, వినియోగం గాని పెరగలేదు. వీరంత అసంఘటిత రంగంలో ఉండిపోవడం వల్ల రోజుకు కనీసం 32 రూపాయల కంటే తక్కువ మొత్తంలో జీవిస్తున్నారని అసంఘటిత రంగంపై నియమించబడిన ప్రొఫెసర్ అర్జున్‌సేన్ గుప్తా కమిటీ తెలిపింది. దేశ అభివృద్ధి క్రమం నుండి పక్కకు నెట్టివేయబడిన ఈ 77 శాతం మంది ప్రజలు అత్యధికులు అత్యంత నిరుపేదలేకాక నిరాక్షరాస్యులు కూడా. వీరంతా పౌష్టికాహారలోపం, అనారోగ్యాలతో బాధపడుతున్నారు. వీరిలో అత్యధికులు స్వయం ఉపాధిగల అసంఘటితరంగ కార్మికులు. ఈ అసంఘటిత రంగ కార్మికులలో 84 శాతం మంది వ్యవసాయ రంగానికి చెందినవారే. వీరంత చిన్న, సన్నకారు రైతులు, వారికి 2 హెక్టార్లకంటే తక్కువ భూమి ఉంది. వీరి ఉత్పాదకత స్థాయి తక్కువగా ఉండటం వల్ల జీవించటమే కష్టంగా ఉంది. ఇందువల్ల గ్రామీణ ప్రాంతంలో అణగారిపోతున్నవారి సంఖ్య 2001-02 నుండి 2009-10 కాలంలో 82 నుంచి 84 శాతానికి పెరిగిందని ఎన్.సి.ఎ.ఇ.ఆర్ ప్రకటించింది. అందువల్ల వీరు వ్యవసాయేతర రంగాలకు తరలిపోవటం జరుగుతుంది.

ఇక పారిశ్రామిక రంగంలో 5.8 కోట్ల చిన్న పరిశ్రమలు ఉన్నాయి. ఇవి 10.4 కోట్ల మందికి ఉపాధిని కల్పిస్తున్నాయి. రు. 5 లక్షల లోపు పెట్టుబడిగల యూనిట్లలలో వీరు పనిచేస్తున్నారు. అయినప్పటికి జిడిపిలో 31 శాతం ఆదాయానికి వారు దోహదపడుతున్నారు. వీరంత దేశ వ్యాప్తంగా చేనేత, హస్తకళలు, పీచు పరిశ్రమ, తోళ్ల పరిశ్రమ, దుస్తులు, ఆహారం శుద్ధి నిల్వ, లోహ ఉత్పత్తులు పరిశ్రమలు తదితరాలలో పనిచేస్తున్నారు. వీరు చేస్తున్న ఉత్పత్తిలో 90 శాతం దేశీయంగా వినియోగించబడుతుంది. అయినప్పటికి వీరి పరిస్థితి కూడా దయనీయంగానే ఉంది. దీనికి తోడు పెద్ద నోట్ల రద్దు వల్ల ఈ పరిశ్రమలు పూర్తిగా చితికిపోయాయి. ఇందువల్ల దేశంలో నిరుద్యోగిత కూడా విపరీతంగా పెరిగింది. ఈ విధంగా ఎక్కువ మంది చాలీచాలని వేతనాలతో జీవనాన్ని గడుపుతూ పేదరికంలో మగ్గుతున్నారు. ఈ పేదరికానికి కారణం దేశంలో సంపద లేక కాదూ. మన దేశంలో సహజ వనరులతోపాటు నదీ జీవజలాలు, సమశీతోష్ణస్థితి పరిస్థితులు ఉన్నాయి. ఒక మాటలో చెప్పాలంటే సకల సంపదలు గల దేశం. కాకపోతే ఇంతకు ముందే చెప్పినట్లు ఈ సంపద కేవలం కొద్దిమంది పెట్టుబడిదారుల చేతుల్లో కేంద్రీకృతం కావటం వల్ల అనే దాన్ని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదనుకుంటాను.

### మధ్యతరగతి వర్గం ఏం చేస్తున్నది?

ఇదే క్రమంలో మధ్యతరగతి వర్గం కూడా పెరుగుతూ వచ్చింది. మెకెన్సీ గ్లోబల్ సంస్థ అంచనా ప్రకారం మన దేశంలో మధ్యతరగతి 25 కోట్ల వరకు ఉండొచ్చు. అంటే మొత్తం జనాభాలో 20 శాతం. 1980లో వీరు 8 శాతం మాత్రమే. 2025 నాటికి ఈ సంఖ్య 38 కోట్లకు చేరుకుంటుందంటున్నారు. ఆదాయాల పరంగా 3.4 నుంచి 17 లక్షలు పొందే కుటుంబాలన్ని ఈ తరగతికి వస్తాయి. 1995-96 నుండి 2001-02 మధ్యకాలంలో ఈ తరగతి వృద్ధిరేటు 138 శాతంగా ఉంది. గతంలో ప్రభుత్వరంగ ఉద్యోగ కల్పనల ద్వారా పెరిగిన ఈ వర్గం నయా ఉదారవాద కాలంలో ప్రైవేట్ రంగం పెరగటంతోనే తీవ్రమైన ఊపులోకి వచ్చింది. కాబట్టే ఈ వర్గం నయా ఉదారవాద విధానాలకు ప్రధాన మద్దతుదారుగా ఉంది. వీరు భారతదేశం వినియోగ రంగంలో అతిపెద్ద మార్కెట్‌గా అవతరించి ఉన్నారు. ప్రధానంగా ఈ వర్గమంతా పట్టణాల్లోనే కేంద్రీకృతమై ఉంది. పెట్టుబడి దారులు శ్రమ దోపిడీ ద్వారా దోచుకున్న సంపదలో కొంతభాగం మధ్యతరగతి వర్గానికి దోచిపెట్టడం జరుగుతుంది. ఈ విధంగా ఈ రెండు వర్గాలు కలిసి మెజారిటీ ప్రజలకు వ్యతిరేకంగా నేడు నయా ఉదారవాద విధానాలను ముందుకు తీసుకుపోతున్నారు.

### మరేం చెయ్యాలి?

ప్రస్తుత పరిస్థితులను మార్క్సిస్టు మేధావి ప్రభాత్ పట్నాయక్ కూడా ప్రతిఘాత విప్లవంగా ధృవీకరిస్తున్నాడు. ఈయన అంచనా ప్రకారం మనదేశంలో అంబేద్కర్‌చే రూపొందించిన భారత రాజ్యాంగం అమలులోకి వచ్చిన కాలం నుండి దీర్ఘకాలిక విప్లవం ప్రారంభమైనట్లు చెపుతున్నాడు. అయితే ఇప్పుడు జరుగుతున్న ప్రతిఘాత విప్లవానికి మధ్య తరగతి మద్దతుతో పెట్టుబడిదారులు నాయకత్వం వహిస్తున్నారనీ, ఇది పేదల, దళితుల, ముస్లింల వ్యతిరేక స్వభావం కలిగిఉందని ఆయన విశ్లేషిస్తున్నారు. విద్యా ప్రైవేటీకరణ, సంక్షేమ రంగంలో నిధుల తగ్గింపు, ప్రభుత్వ రంగ సంస్థలను మూసివేయటం లేదా తెగనమ్మటం. అందువల్ల రిజర్వేషన్లు నామమాత్రానికి పరిమితం చేయబడటం, అదే సమయంలో ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు అమలు చేయకపోవడం, భూ పంపిణీకి బదులు, సెజ్‌ల పేర భూకేంద్రీకరించబడడం లాంటి చర్యలన్నీ ప్రతిఘాత విప్లవ లక్షణాలుగా ఉన్నాయి.

మొత్తంగా ఈ విశ్లేషణ తెలియజేస్తున్నదేమంటే, రాజ్యాంగం అణగారిన వర్గాలకు ఎన్నో ఆర్టికల్స్ ద్వారా వారి అభివృద్ధిని సంక్షేమాన్ని పెంచాలని పేర్కొన్నప్పటికీ ఆ రాజ్యాంగాన్నే అపహాస్యం చేసే విధంగా ఈ ప్రతిఘాత విప్లవం కొనసాగుతున్నది. ఇది రాజ్యాంగంలోని ఒక వాక్యం కూడా మార్చకుండానే ఈ తతంగమంత నడుస్తుంది. కానీ రాజ్యాంగ కాపలాదారుగా ఉన్న సుప్రీంకోర్టు, రాష్ట్రపతులు ఈ విధానాలకు వ్యతిరేకంగా ఎందుకు జోక్యం చేసుకోవటంలేదు? అలాగే ఫోర్త్ ఎస్టేట్‌గా ఉన్న మీడియా ఈ విధానాలకు వ్యతిరేకంగా ఎందుకు గగ్గోలు పెట్టడంలేదు. వాటికున్న అగ్రకుల ధనస్వామ్య స్వభావరిత్యాన్నే మిన్నకుండిపోతున్నాయనే విమర్శ వ్యక్తమవుతున్నది. ఈ పరిణామం మహోన్నత రాజ్యాంగ ఆశయాలకు వ్యతిరేకం. కాబట్టి రాజ్యాంగం లక్ష్యాలను కాపాడుకోవాల్సిన బాధ్యత ప్రజలదే. కాబట్టి ఈ ప్రతిఘాత శక్తులకు వ్యతిరేకంగా ప్రజలు ఉద్యమించాల్సి ఉంది.

*(రచయిత అసోసియేట్ ప్రొఫెసర్ ఆఫ్ ఎకనామిక్స్,*
*ప్రభుత్వ డిగ్రీ కళాశాల)*

వీ

# బిఎస్ఎన్ఎల్ అధోగతికి కారకులెవరు?

***ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేట్ పరంచేసే లక్ష్యంతో పాలకులు అమలు చేసిన విధానాల వల్ల ఆయా సంస్థల ఉద్యోగుల, ప్రజల జీవితాలను సంక్షోభంలోకి నెడుతున్న తీరును వివరిస్తున్నారు బి.ఎస్. రాజు***

ప్రగల్భాల పేలాలు గాలికి కొట్టుకు పోయాయి. ప్రభుత్వ ఖజానా కాళీ అయిపోయింది. బ్యాంకుల నుండి లక్షల కోట్ల ప్రజాధనం లూటీ అయింది. ఈ లూటీకి నిరర్ధక ఆస్తులని ముద్దుపేరు. లూటీ ఆగుతుందా? ఆగదు కదా! కొత్త లూటీకి, కొత్తగా పైసలు కావాలి. అందుకు చెయ్యాలి రిజర్వు బొక్కసంపై దాడి. చేసేశారు అది కూడా! ఇదీ చాలదు. ఆఖరికి 'సెబీ' సొమ్ము కూడా నాకేశారు. అబ్బే! అది ఏమూలకు? ఇక ఏం చెయ్యాలి? అమ్మెయ్యాలి, మరిన్ని ప్రభుత్వ ఆస్తులు.

ఇప్పటికే చాలానే అమ్మేశారు, అమ్ముకుంటూనే వస్తున్నారు. మా ఆస్తులు ఎందుకు అమ్ము తున్నారు అని ప్రజలు అడగడంలేదు. నోరు వెళ్లబెట్టి చూస్తూనే ఉన్నారు. వీడికో, వాడికో, మరోడికో, ఈ బొమ్మకో, ఆ బొమ్మకో, మాటల మాంత్రికులకో, డబ్బు సంచులకో ఓట్లేసి గెలిపించి అధికార పీఠాలపై కూర్చోబెడుతున్నారు. ప్రైవేట్ పెట్టుబడిదారులకు కావలి కుక్కగా ఉన్న రాజ్య వ్యవస్థ ప్రజాధనాన్ని కొల్లగొడుతూనే ఉంటుంది. ఈ లూటీ ఆగదు, కొనసాగుతూనే ఉంటుంది. ఇది దాని మూల ప్రకృతి. దాని నైజం. దాని ఆయువు. అంచేత ప్రజల ఆస్తులపై, సంపత్తిపై, ప్రైవేట్ పెట్టుబడి దాడిచేస్తూనే ఉంటుంది. ప్రభుత్వరంగ ఆస్తుల అమ్మకాల జోరు, దూకుడు మరింతగా పెరుగుతుంది. లాభదాయకంగా లేని ప్రభుత్వ ఆస్తుల అమ్మకంతో మొదలైన ఈ పర్వం, ఇప్పుడు ప్రజల ఊపిరిగా నడుస్తున్న, ప్రజల జీవనానికి, మనుగడకు భరోసాగా నిలబడి ఉన్న జీవిత భీమా సంస్థను కూడా పూర్తిగా అమ్మివేసే దశకు చేరుకుంది.

ముందుగా ప్రభత్వరంగ టెలికాం సంస్థ, భారత్ సంచార్ నిగమ్ లిమిటెడ్ (బిఎస్ఎన్ఎల్) గురించి చూద్దాం! భారతదేశ టెలికాం రంగానికి వెన్నెముకైన ఈ సంస్థను ప్రైవేట్ సంస్థలకు అంటకట్టే దుర్మార్గం కాంగ్రెస్ పాలనలోనే మొదలైంది. సరళీకరణ, నూతన టెక్నాలజీల మిషతో, ఈ సంస్థ పొదుగుకోసేసే పని ఆనాడే మొదలుపెట్టారు. సరళీకరణ, పోటీతత్వం మాటున మొబైల్ టెక్నాలజీలు వచ్చేనాటికి ఈ సంస్థకున్న విస్తృతమైన, విలువైన టెలికాం క్షేత్ర వ్యవస్థలను ప్రైవేట్ కంపెనీలకు దారాదత్తం చేశారు. పట్టణాల నెట్‌వర్క్‌ను, లాభదాయకమైన సర్కిళ్లను ప్రైవేట్ సంస్థలు తన్నుకుపోయే వెసలుబాటు కల్పించి, నష్టాల వలయంలో ఉన్న గ్రామీణ ప్రాంత నెట్‌వర్క్‌ను 'బిఎస్ఎన్ఎల్'కు మిగిల్చారు.

ప్రజా అవసరాల రీత్యా ఒకచోట సంభవిస్తున్న నష్టాలను మరోచోట వస్తున్న లాభాలతో పూడ్చుకుని బ్యాలెన్సు చేసుకొనే అవకాశాన్ని, ప్రత్యామ్నాయ మార్గాలను ప్రభుత్వమే పనిగట్టుకు ఈ సంస్థకు లేకుండా చేసింది. గ్రామీణ ల్యాండ్ లైన్ టెలికం వ్యవస్థను బిఎస్ఎన్ఎల్ మెడకు తగిలించి, ఇబ్బడి ముబ్బడిగా లాభాలు చేకూర్చిపెట్టే నగర, పట్టణ మొబైల్ టెలికాం వ్యవస్థలను ఆనాటికి అసలు టెలికాం రంగంలో లేని ప్రైవేట్ సంస్థలకు సరళీకరణ, వ్యాపార పోటీతత్వం ముసుగులో సమకూర్చి పెట్టింది, ప్రభుత్వం.

అలా... పాలు, వెన్న ప్రైవేట్ పరమైతే; పెండ, పెంట బిఎస్ఎన్ఎల్‌కు మిగిలాయి. ఈ సంస్థను ప్రభుత్వాలే పనిగట్టుకు నష్టాల ఊబిలోకి నెట్టేశాయి. ఇక, ఇదిగో చూడండి, ఈ సంస్థ నష్టాల్లో కూరుకు పోయింది, సరైన పని విధానం లేదు అనే నెపంతో టెక్నాలజీ ఆధునీకరణకు కావలసిన పెట్టుబడులకు ఇది అనర్హమని కట్టుకథలు అల్లుకుంటూ వచ్చింది.

అప్పట్లో బిఎస్ఎన్ఎల్ నాసిరకం సేవల పట్ల విసిగి వేసారి ఉన్న ప్రజలు ఈ దుర్మార్గాన్ని గ్రహించలేదు. ఈ సంస్థ ఉద్యోగులు, యాజమాన్యం ప్రజల ఆదరాభిమానాలను సంపాదించలేక పోయారు. అటు ప్రభుత్వ ఆర్థిక దుర్నీతి, ఇటు ప్రజా వ్యతిరేకత, ఈ రెండింటి మధ్య ఈ సంస్థ ప్రైవేట్ మార్కెట్ శక్తుల కత్తిపోట్లకు బలైపోయింది.

ప్రజలు, ఉద్యోగులు ఉమ్మడి అవగాహనతో, ఉద్యమ స్ఫూర్తితో, ఈ సంస్థపై జరుగుతూ వచ్చిన అన్యాయపు దాడిని సరైన సమయంలో, సరైన రీతిలో అర్థం చేసుకుని ప్రభుత్వ దుర్నీతిని ఎండగట్టి ఓడించలేక పోయారు. ఎంతో విలువైన ఈ ప్రజా సంస్థను, సేవామార్గం పట్టించి ప్రజల తరపున నిలబెట్టుకోవడానికి బదులు, మొత్తం దేశ టెలికాం రంగాన్ని అనతి కాలంలోనే దేశ-విదేశీ ప్రైవేట్ వ్యాపార సంస్థలకు పళ్లెంలో పెట్టి అందించింది ప్రభుత్వం. జనం తాళీ బజాయించి సంతోషించారు.

ఇప్పుడు, బిఎస్ఎన్ఎల్ ప్రజలకు అందించే సేవల్లో నాణ్యతను సాధించినప్పటికీ, ఇప్పటి ప్రభుత్వం ఈ సంస్థను చుట్టచుట్టి అయినకాడికి అమ్మివేసే కుతంత్రంతో ఉద్యోగులకు ముందస్తు పదవీ విరమణ అనే గాలం వేసింది. ఈ సంస్థ ఇక మిగలదని, రేపో మాపో ఊడిపోయేదే నని, దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవడం మంచిదని, ఇచ్చేదేదో, వచ్చేదేదో, ఇప్పుడే 'వీఆర్ఎస్' సొమ్ము అందుకోవడమే ఉత్తమమనే ముమ్మర ప్రచారం చేసింది. ఈ కుతంత్రాన్ని ఎండగట్టి పోరాడాల్సిన ఉద్యోగులు ప్రలోభాలకు లోనై సంస్థను గాలికొదిలేశారు. ఉద్యోగులకు పోరాడమని చెప్పాల్సిన ప్రజలు అచేతనంగా, అదేదో బ్రహ్మాండమైన పరిణామమనే భ్రమలోపడి అసలు ఏ పునాదిని కోల్పోతున్నామో కూడా అంచనాకట్టలేని స్థితికి చేరుకున్నారు.

ఒకపక్క ప్రైవేట్ టెలికాం రంగంలో జరుగుతున్న అరాచకత్వ పోటీ,

పన్ను ఎగవేతలు, తీర్చలేని అప్పుల కుప్పలు, అత్యున్నత న్యాయస్థానం వీళ్లకు జారీచేసిన ఖబడ్దార్ హెచ్చరికలు చూస్తూ కూడా మనం మిన్నకున్నాం. బిఎస్ఎన్ఎల్ ఉద్యోగులు ఐచ్ఛిక పదవీ విరమణ (విఆర్ఎస్) గాలానికి చిక్కుకుని చప్పుడు చేయడంలేదు. వర్గస్పృహ లేని ఇటువంటి ప్రజా అచేతనాస్థితి దేశంలో ప్రభలిపోతున్న ఆర్థిక అరాచకత్వాన్ని, దమన నీతిని, ముంచుకొచ్చిన ఫాసిజాన్ని ఎలా అడ్డుకుంటుంది?

కేంద్రంలో అధికారం చెలాయించిన అన్ని ప్రభుత్వాలు 'బిఎస్ఎన్ఎల్' పట్ల పనిగట్టుకుని ప్రదర్శించిన వివక్షే ఆ సంస్థ కుంటుపడిపోవడానికి కారణమని, సత్తాలేని బలహీనమైన యాజమాన్యం, స్వతంత్ర పనివిధాన లేమి, నిరంతర రాజకీయ ప్రమేయం, రాజకీయ దళారీ ఒత్తిడులు, యాజమాన్యానికి స్వతంత్ర నిర్ణయాలు తీసుకునే వెసలుబాటు లేకపోవడం, వీటి కారణంగానే టెలికాం ప్రభుత్వరంగ సంస్థ 'బిఎస్ఎన్ఎల్' కుదేలై పోయిందని, ఆ సంస్థలో పనిచేసే ఉద్యోగ ప్రముఖులు, యూనియన్ల నాయకులు చెబుతున్నారు.

బిఎస్ఎన్ఎల్‌లో 35 ఏళ్లుగా పనిచేస్తున్న ఓ సీనియర్ ఉద్యోగి "మా సంస్థపట్ల ప్రభుత్వ వివక్షకు ఓ మచ్చుతునక ఏమంటే, మొబైల్ నెట్‌వర్క్ సేవలు అందించడానికి మాకు 2002 సంవత్సరం వరకూ లైసెన్సులు ఇవ్వకుండా నొక్కిపెట్టి, 1995లోనే ప్రైవేట్ ఆపరేటర్లకు ఎదురెళ్లి ఆహ్వానించి లైసెన్సులు మంజూరు చెయ్యడం. ఏడేళ్లపాటు మేం ఈ సర్వీసుల ద్వారా వచ్చే ఆదాయాన్ని, లాభాలను ఎందుకు కోల్పోవాలి? ఓ ప్రభుత్వ సంస్థ పట్ల ప్రభుత్వానికి ఎందుకింత వివక్ష? ఇదేమి నీతి? దీన్నేమనుకోవాలి? దీన్నేమని పిలవాలి? బిఎస్ఎన్ఎల్ పుట్టి ముంచే ప్రైవేట్ కంపెనీలకు అడ్డగోలు లాభాలు సమకూర్చే దుష్టనీతిగాక ఇదేమిటి?" అని అన్నాడు.

అంతేగాక 2006-2012 మధ్యకాలంలో మా సంస్థ ఆధునికీకరణకు కావాల్సిన నూతన సామాగ్రిని సమకూర్చుకోకుండా అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వమూ, టెలికాం మంత్రి ఏ.రాజా అన్నివిధాలా అడ్డుకున్నారు. ఆలా అన్యాయంగా మేము వెనకబడ్డాం! అని సంస్థ యాజమాన్యంలో ఉన్న పెద్దలు, ఇతర సీనియర్ ఉద్యోగులు వాపోయారు.

2006 నుండి 2012 వరకు మా సంస్థ ఆధునీకరణకు పూర్తిగా అడ్డుకట్టవేశారు. ఈ కాలంలో టెలికాం సామాగ్రి సమకూర్చుకోడానికి మేం పిలిచిన టెండర్లన్నిటినీ ఏదో ఒక మిషతో రద్దు చేస్తూ వచ్చారు. దీంతో మా నెట్‌వర్క్ విస్తృతి, ఉన్నతీకరణ ఆగిపోయింది. 2007లో, 45 మిల్లియన్ (నాలుగున్నర కోట్ల) లైన్ల, 2010లో 93 మిల్లియన్ లైన్ల విస్తరణకు కావాల్సిన సామాగ్రి కొనేందుకు వేసిన టెండర్లను అప్పటి టెలికాం శాఖ రద్దుచేసింది.

2006-12 మధ్యకాలం చాలా విలువైన కాలం. ఈ సమయంలోనే మొబైల్ సేవల విప్లవం చోటు చేసుకుందని గుర్తుపెట్టుకోవాలి. మొబైల్ నెట్వర్క్ లెక్కకు అందనంతగా ఈ కాలంలోనే విస్తరించింది. మరి ఈ కాలంలోనే మా కాళ్లు ఎందుకు నరికేశారు? ఈ అభివృద్ధి ఫలాలను మా సంస్థకు ఎందుకు అందకుండా చేశారు? మా సంస్థను భ్రష్టు పట్టించింది ఎవరు? ప్రభుత్వమేకదా! మరి నష్టాల పాపాలన్నీ మా సంస్థ యాజమాన్యం, ఉద్యోగుల నెత్తిపై ఎందుకు రుద్దుతున్నారు? అని పేరు వెల్లడించడానికి ఇష్టపడని మరో ప్రముఖ బిఎస్ఎన్ఎల్ ఉన్నతోద్యోగి ప్రశ్నిస్తున్నారు.

ఇంకా చూడండి బిఎస్ఎన్ఎల్‌ను గోతిలోనికి నెట్టివేసిన ప్రభుత్వాల నీతి. మొత్తం ప్రపంచమంతా మొబైల్ ఫోన్లపై అత్యంత వేగవంతమైన 5జి సేవలు సమకూర్చుకుంటుంటే, ఇక్కడ మా సంస్థకు మొన్నటివరకు 4జి సేవలు కూడా అందించలేని స్థితి కల్పించాయి ప్రభుత్వాలు. 2019 అక్టోబర్ వరకు 4జి సేవలు అందించే భాగ్యం మాకు దక్కలేదు. అదే ప్రైవేట్ టెలికాం కంపెనీలకు 5 ఏళ్ల క్రితమే 4జి సేవలు అందించే వెసలుబాటు ఆగమేఘాల మీద కల్పించారు. ఇంత ద్రోహం జరిగాక బిఎస్ఎన్ఎల్ ప్రజా టెలికాం సంస్థ నష్టాల ఊబిలో కూరుకుపోక ఏమౌతుంది? ప్రభుత్వాలే ప్రభుత్వ సంస్థల పట్ల ఇటువంటి ఖూనీకోరు ఆర్థిక నీతిని అమలుచేస్తుంటే ఇక ఆ సంస్థలు ఎలా మనుగడ సాగిస్తాయి?

ఒకప్పటి ఈ నవరత్న కంపెనీ ఓ దశాబ్ద కాలంగా ఘోరంగా దెబ్బతినిపోయి నష్టాలపాలైన ప్రభుత్వరంగ సంస్థగా మారిపోయింది. 2019 ఆర్థిక సంవత్సరాంతానికి రు.18,300 కోట్ల నష్టంతో, రు.20,000 కోట్లు చెల్లించాల్సి ఉన్న అప్పుల భారంతో కునారిల్లుతోంది. ఇదిలా ఉండగా, మోడీ-2 ప్రభుత్వం ఎంటిఎన్ఎల్ ను (మహానగర్ టెలిఫోన్ నిగమ్ లిమిటెడ్ ప్రభుత్వ సంస్థను) బిఎస్ఎన్ఎల్‌లో విలీనంచేసి ఈ రెండిటిని నష్టాల నుండి గట్టెక్కించే, రు.75,000 కోట్ల ఆర్థిక ఊపిరి అందించే ప్యాకేజీ ప్రకటించింది. దీనికి ఉద్యోగుల స్వచ్ఛంద పదవీ విరమణ పథకాన్ని జోడించింది. ఇప్పటివరకు 90,000 మంది ఉద్యోగులు ఈ విఆర్ఎస్ పథకం కింద నమోదైనట్లు సమాచారం. బిఎస్ఎన్ఎల్‌లో మొత్తం 1,50,000 మంది ఉద్యోగులు ఉన్నారని, ఇందులో రమారమి 60 శాతం మంది సంస్థ నుండి వెళ్లిపోవడానికి సిద్ధంగా ఉన్నట్లు తెలుస్తోంది.

అయితే బిఎస్ఎన్ఎల్ ఉద్యోగ సంఘాలు ఈ పథకాన్ని ప్రభుత్వం ఎలా అమలు చేస్తుందనే విషయంలో పలు సందేహాలు వెలిబుచ్చుతున్నారు. 'బిఎస్ఎన్ఎల్ ఉద్యోగుల సంఘం' అధ్యక్షుడు, ఇస్లాం అహ్మద్ 'ద సండే గార్డియన్' అనే వార్త సంస్థతో తన అనుమానాలను ఇలా వెల్లడించారు: అసలు ఈ స్వచ్ఛంద విరమణ పథకాన్ని ప్రకటించే ముందు మా యూనియన్ను ప్రభుత్వం నిర్లక్ష్యం చేసింది. మాతో వివరాలను చర్చించలేదు. గత కొన్ని మాసాలుగా పి.ఎఫ్, ఇ.ఎస్.ఐ ప్రభుత్వ వాటా జమచేయడం మానేసింది. ఉద్యోగులు తీసుకున్న బ్యాంకు రుణాలకు సంస్థ ఇచ్చిన గ్యారంటీ ప్రకారం నెలవారీ చెల్లింపులు బ్యాంకులకు జమచేయడం లేదు. ఉద్యోగుల జీతాల నుండి ఈ సొమ్ము కోతబెడుతూనే ఉన్నారు గాని ఆ సొమ్మును బ్యాంకులకు ఇవ్వకుండా నిలుపుదల చేశారు. గత కొన్ని నెలలుగా ఉద్యోగులకు జీతాలు కూడా ఇవ్వడం లేదు. ఇటువంటి స్థితిలో చివరకు ప్రభుత్వం ఈ వి.ఆర్.ఎస్ పథకాన్ని ఎలా అమలు చేస్తుందో అనే సందేహం, భయం ఉద్యోగులను వెంటాడుతోంది.

ఇదీ బిఎస్ఎన్ఎల్‌ను అధోగతి పాల్జేసి, ప్రైవేట్ సంస్థలకు అందల మెక్కించిన తీరు. ఇప్పుడు ఈ ప్రైవేట్ సంస్థల్లో కూడా ఆశ్రిత పక్షపాతం ప్రదర్శించి, ముసలం సృష్టించి, కొన్ని కంపెనీలకు పోటీ తట్టుకోలేని స్థితి కల్పించి, మిగిలిన మూడు కంపెనీల్లో రెండు దివాళాదారి పడితే,

# బిఎస్ఎన్ఎల్‌ను ఎందుకు రక్షించుకోవాలి?

***పాలకులు ప్రైవేట్ సంస్థలకు ప్రయోజనం చేకూరేలా విధానాలు రూపొందించి బిఎస్ఎన్ఎల్‌ను పూర్తిగా నీరుగారుస్తున్నారనీ, దీన్ని రక్షించుకోవాల్సిన బాధ్యత ప్రజలపై ఉందనీ అంటున్నారు* జి.వి. భాస్కర రెడ్డి**

'కార్మికులు బిచ్చగాళ్లు కాదు. వారు సంపద సృష్టికర్తలు' అన్నారు కా. బాబూతారాపాద తంతి తపాల కార్మికోద్యమ నిర్మాత.

కాని నేడు ఈ పరిస్థితి తలకిందులై బిఎస్ఎన్ఎల్ సంస్థ తన కాంట్రాక్టు ఉద్యోగులకు 10 నెలలుగా జీతాలు చెల్లించడం లేదు. రెగ్యులర్ ఉద్యోగులకు కూడ రెండు నెలలకొకసారి జీతాలు చెల్లిస్తున్నది. సంస్థ నిర్వహణ ఖర్చులు భరించడానికి చాలా ఇక్కట్లు పడుతున్నది. ఇటీవల భారత ప్రభుత్వం బిఎస్ఎన్ఎల్‌ను రివైవల్ పేరిట సగం ఉద్యోగులకు పైగానే (78,569 మంది) విఆర్ఎస్ ద్వారా రిటైర్ చేసింది. తగ్గిన ఉద్యోగులతో సర్వీసుల నిర్వహణ తీవ్ర ఇక్కట్లతో నడుస్తున్నది. మిగిలిన ఉద్యోగులకు కూడ జీతాలు చెల్లింపు, మెడికల్ అలవెన్సులు చేయలేక పోతున్నది. ఉద్యోగులకు వైద్య సదుపాయం దాదాపు అగిపోయింది. దీనికి కారణాలేమిటో పరిశీలిద్దాం.

1987లో తంతి తపాలా శాఖను ప్రభుత్వం రెండుగా విభజించి పోస్టల్, టెలికాం శాఖలను ఏర్పాటు చేసింది. టెలికాం శాఖ ఆధునీకరణలో భాగంగా శ్యాంపిట్రోడా ఆధ్వర్యంలో సిడిఒటిని ఏర్పాటు చేసి తద్వారా గ్రామీణ పట్టణ ప్రాంతాల్లో ఎలక్ట్రానిక్ ఎక్స్ఛేంజీలను నెలకొల్పి టెలిఫోన్ సదుపాయాలను సామాన్యులకు అందుబాటులోకి తీసికొని వచ్చింది. ఢిల్లీ, బొంబాయి నగరాలకు ప్రత్యేకంగా ఎంటిఎన్ఎల్ కార్పొరేషన్‌ను ఏర్పాటు చేసింది. విదేశీ ఫోన్ సేవల కొరకు విఎస్ఎన్ఎల్ ఏర్పాటు చేసింది. పెద్ద పట్టణాల అవసరాలకనుగుణంగా డిజిటల్ ఎలక్ట్రానిక్ ఎక్స్ఛేంజ్‌లను ఫ్రాన్స్ ఇ10బి ఎక్స్ఛేంజీలను మొదలగు వాటిని దిగుమతి -చేసుకొని వాటిని ఏర్పాటు చేసింది.

1991లో నూతన ఆర్థిక విధానాల కనుగణంగా 1994లో నూతన టెలికాం పాలసీ భారత ప్రభుత్వం ప్రకటించింది. దీని ప్రకారం మొబైల్ రంగంలో కేవలం ప్రైవేటు కంపెనీలు మాత్రమే సెల్‌ఫోన్ సేవలను అందిస్తారు. ఈ ప్రైవేటీకరణ అనుకూల విధానాన్ని నిరసిస్తూ టెలికాం ఉద్యోగులు దేశవ్యాప్తంగా 5 రోజులు సమ్మె చేశారు. అయినప్పటికీ 1996లో ప్రభుత్వం సెల్‌ఫోన్ సేవలను మొదటగా ప్రైవేట్ కంపెనీల ద్వారానే ఆరంభించింది. అయితే రేట్లు చాలా ఎక్కువగా ఉండేవి. ఇన్‌కమింగ్ కాల్స్‌కు కూడ ఎయిర్‌టైమ్ చార్జ్ పేరుతో డబ్బులు వసూలు చేసేవారు.

తర్వాత భారతదేశం డబ్ల్యుటిఒలో చేరడంతో టెలికాం సేవలు కూడ దీని పరిధిలోకి రావడంతో అప్పటి ఎన్‌డిఏ ప్రభుత్వం ఉద్యోగులు వ్యతిరేకించి సమ్మె చేసినప్పటికీ 2000 అక్టోబర్ 1న టెలికాం డిపార్టుమెంట్‌ను బిఎస్ఎన్ఎల్ కార్పొరేషన్‌గా మార్చివేసింది. ఉద్యోగులకు పెన్షను భద్రత, ఉద్యోగ భద్రత వంటి కొన్ని హామీలు ఇచ్చింది. అలాగే బిఎస్ఎన్ఎల్‌కు నష్టాలొచ్చే గ్రామీణ సర్వీసులకు గాను యాక్సెస్ డెఫిసిట్ చార్జెస్ వంటి సదుపాయాన్ని కలిగించింది. ఇంకా కొన్ని రాయితీలు ఇచ్చింది. కాని బిఎస్ఎన్ఎల్ వివిధ ట్యాక్సులు చెల్లించాల్సి వచ్చింది.

తదనంతరం 2002లో బిఎస్ఎన్ఎల్‌కు కూడ సెల్ సర్వీసులు ప్రారంభించేందుకు లైసెన్సు ఇచ్చింది. బిఎస్ఎన్ఎల్ మొబైల్ సర్వీసుల రంగంలో ప్రవేశించిన తర్వాతనే రేట్లు తగ్గడంతో పాటు చిన్న పట్టణాలకు, గ్రామాలకు సర్వీసులు విస్తరించాయి. దీనికి తోడు బిఎస్ఎన్ఎల్ తన ల్యాండ్ లైన్ బ్రాడ్‌బ్యాండ్ సర్వీసుల ద్వారా దేశవ్యాప్తంగా ఇంటర్‌నెట్ సేవలను విస్తరింపచేసింది. ప్రకృతి వైపరీత్యాలలో కూడ బిఎస్ఎన్ఎల్ తన విశిష్ట సేవలను అందించింది. భారత ప్రభుత్వం తన జాతీయ టెలికాం విధానం 2012లో జాతీయ భద్రతా ప్రయోజనాల రీత్యా, సమాచార భద్రత రీత్యా, అంతర్జాతీయ ప్రాధాన్యత గల అంశాలతో ప్రభుత్వం జోక్యం చేసుకునే సామర్థ్యాన్ని పెంచేందుకు బిఎస్ఎన్ఎల్ అవసరమని ప్రకటించింది. కాని అలా ప్రకటించినప్పటికీ యుపిఏ/ఎన్‌డిఏ కేంద్ర ప్రభుత్వాలు ప్రైవేటు కంపెనీలకు అనుకూలంగా బిఎస్ఎన్ఎల్‌కు ప్రతికూలంగా ముఖ్యంగా నష్టాలు వచ్చే చర్యలు తీసుకున్నాయి. అవి ఏమిటో ఒకసారి పరిశీలిద్దాం.

---

అవి ఎగవేయబోయే అప్పుల కుప్పల సంక్షోభం సంగతి ఏమిటి? అటు బిఎస్ఎన్ఎల్, ఇటు ఎయిర్‌టెల్, ఐడియా-వోడాఫోన్‌లను కాటికి పంపించి, ముఖేష్ అంబానీగారి జియో-టెలికాంకు ఏకచ్ఛత్రాధిపత్యం కట్టబెట్టే ప్రభుత్వ మెగాస్కామ్ గాక ఏమిటి ఇదంతా? టెలికాం రంగంలో ప్రభుత్వ అస్తవ్యస్త ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం సృష్టించిన ఆర్థిక అరాచకత్వం కాక ఏమిటిది? దివాళా టెలికం కంపెనీలు చేతులు ఎత్తేస్తే, అవి ఎగ్గొట్టే బిలియన్ల సొమ్ముకు చెల్లుచీటీ రాసేస్తారా? ఆవిరయ్యే ప్రజాధనం సంగతేమిటి? అందుకనేనా మిగిలిన నవరత్నాలకు అంటే భారత్ పెట్రోలియం, జీవిత భీమా సంస్థలకు కూడా మంగళం పాడేసి దేశ ప్రజలను పాపర్లుగా మార్చేస్తారా? అవును, ఈ దివాలాకోరు ప్రభుత్వం అదే చేయబోతోంది అనడంలో ఏ సందేహం ఉండనక్కర్లేదు. ఇటువంటి ఆర్థిక ఫాసిస్టు అరాచకత్వాన్ని ప్రజలు ఎలా అడ్డుకోవాలో ఆలోచించాల్సిన తరుణమిది.

*(రచయిత శ్రామికనేస్తం సంపాదకులు)* వీ

1) గిట్టుబాటు కాకుండా నష్టాలు తెచ్చే గ్రామీణ ప్రాంత ల్యాండ్‌లైన్‌లను నిర్వహిస్తున్నందుకు గాను బిఎస్ఎన్ఎల్‌కు పూర్తి పరిహారం ఇస్తామని ప్రభుత్వం బిఎస్ఎన్ఎల్ సంస్థ ఏర్పాటు చేసే సమయంలో హామీని ఇచ్చింది. ఇందుకు భిన్నంగా కొంతకాలం మాత్రమే ఎడిసిని ప్రైవేటు కంపెనీల ద్వారా ఇప్పించి, తర్వాత తగ్గించి అటు తర్వాత పూర్తిగా ఎత్తివేసింది. దీనివల్ల బిఎస్ఎన్ఎల్‌కు గ్రామీణ సర్వీసుల నిర్వహణలో దాదాపు 10 వేల కోట్లు ప్రతి సంవత్సరం నష్టం వచ్చింది. ముఖ్యంగా సెల్ సేవల నేపథ్యంలో గ్రామీణ టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌ల మూసివేతకు అవకాశం ఇవ్వకపోగా పదిలైన్ల ఎక్స్ఛేంజ్‌లను సొంత భవనాలలలో లేనటువంటి వాటిని, బ్రాడ్‌బ్యాండ్ సేవలు లేకపోయినవి, ఎక్స్ఛేంజ్ ఆవరణలో సెల్‌టవర్ లేకుంటేనే వాటిని మూసివేయాలని నిబంధన విధించింది. ఇలా విధానపరమైన నిర్ణయాలు తీసుకునే వెసలుబాటునే బిఎస్ఎన్ఎల్‌కు ప్రభుత్వం కల్పించలేదు. ప్రైవేటు కంపెనీలకు గ్రామీణ ప్రాంతాల్లో ల్యాండ్‌లైన్ టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లు లేనేలేవు. కాని బిఎస్ఎన్ఎల్‌కు మాత్రం నష్టాలు వచ్చే అలాంటి చిన్న ఎక్స్ఛేంజ్‌లను నిర్వహించాల్సి రావడంతో ఎక్కువగా నష్టాలు వచ్చాయి.

2) బిఎస్ఎన్ఎల్‌లో మొబైల్ సేవల విస్తీర్ణకు అవసరమైన ఎక్విప్‌మెంట్ కొనుగోలుకు ప్రభుత్వం అనుమతి ఇవ్వకపోగా నిబంధనల పేరుతో అనేక ఆటంకాలు కలుగచేయడంతో బిఎస్ఎన్ఎల్ సెల్‌ఫోన్ సర్వీసుల విస్తరణలో వెనుకబడింది. 2002 నుండి 2007 వరకే అంటే ప్రవేశించిన 5 సంవత్సరాలకే బిఎస్ఎన్ఎల్ ఎయిర్‌టెల్ తర్వాత స్థానానికి చేరుకుంది (2వ స్థానానికి). కాని యుపిఎ, ఎన్‌డిఎ కేంద్ర ప్రభుత్వాలు ప్రైవేటు కంపెనీల విస్తరణకు అవకాశాలు కల్పించి బిఎస్ఎన్ఎల్‌కు రకరకాల ఇబ్బందులు కలుగజేయడంతో 2007 నుండి సెల్‌ఫోన్ రంగంలో అత్యంత వెనుకబడి నేడు బిఎస్ఎన్ఎల్ కేవలం 10 శాతం మార్కెట్ వాటాకు పరిమితమైంది.

3) బిఎస్ఎన్ఎల్ దగ్గరున్న రిజర్వు ఫండ్‌ను 3జి స్పెక్ట్రం లైసెన్సుకు (రూ.10,000 కోట్లు) నాసిరకం బిడబ్ల్యుఏ స్పెక్ట్రంను గ్రామీణ సేవలకు మాత్రమే అనుమతి ఇచ్చి 8,500 కోట్లు ప్రభుత్వం ఖర్చు చేయించింది. ముఖ్యంగా 3జి విషయంలో ప్రైవేట్ కంపెనీల మధ్య రాష్ట్రాలలో షేరింగ్‌కు అవకాశం ఇవ్వడం ద్వారా వారికి తక్కువ ఖర్చులోనే 3జి సేవలు అందుబాటులోకి వచ్చాయి. బిఎస్ఎన్ఎల్ మాత్రం పాన్ ఇండియా లైసెన్సు పేరుతో ఎక్కువ చెల్లించాల్సి వచ్చింది.

4) ఎన్‌డిఎ ప్రభుత్వం 2003లో ప్రైవేటు సెల్ కంపెనీలు భారీ స్థాయిలో చెల్లించాల్సిన లైసెన్సు ఫీజును తగ్గించి రెవెన్యూ షేరింగ్ విధానానికి మారినందున అవి భారీగా లబ్దిపొందాయి. ప్రభుత్వ ఖజానాకు 43,000 కోట్లు నష్టం వాటిల్లింది.

5) రిలయెన్స్ జియోకి దొడ్డి దారిన 4జి స్పెక్ట్రంను కేటాయించేందుకు ప్రభుత్వం అనుమతించింది. కేవలం 2 వేల కోట్ల విలువ గల్గిన ఇన్ఫోటెల్ అనే కంపెనీతో 12వేల కోట్ల విలువ గల 4జి సెక్ట్రంను కొనిపించి, ఆ కంపెనీని రిలయెన్స్ జియో స్వాధీనం చేసుకొని అక్రమ పద్ధతిలో 4జి స్పెక్ట్రంను సంపాదించింది.

6) రిలయెన్స్ జియో కంపెనీకి బ్రాడ్‌బ్యాండ్ ఇంటర్నెట్ లైసెన్సు మాత్రమే ఉన్నది. కాని ప్రభుత్వ మద్దతుతో ఇంటర్‌నెట్ సేవలతో పాటు వాయిస్ కాల్స్ కూడ ఇస్తున్నది.

7) అన్నిటికీమించి రిలయెన్స్ జియోకి మొత్తం మార్కెట్‌లో 30 శాతం వచ్చేంత వరకు ఉచితంగా, అతి తక్కువ ధరలకే డేటా, వాయిస్ సేవలందించే ప్రిడేటరీ ప్రైసింగ్ అమలు చేయవచ్చునని టెలికాం రెగ్యులరేటరీ అథారిటీ ఆఫ్ ఇండియా రూలింగ్ ఇచ్చింది. దీనివల్ల బిఎస్ఎన్ఎల్‌తో పాటు ఇతర సెల్ కంపెనీలు కూడ దెబ్బతిన్నాయి, కొన్ని మూతపడినాయి.

8) ప్రైవేటు కంపెనీలన్నింటికీ 4జి స్పెక్ట్రం ఉండగా బిఎస్ఎన్ఎల్‌కు రకరకాల కారణాలతో 4జి స్పెక్ట్రంను కేటాయించలేదు. బిఎస్ఎన్ఎల్ ఉద్యోగులు, ప్రజల నుండి వచ్చిన వత్తిడి వల్ల బిఎస్ఎన్ఎల్‌కు 4జి ని కేటాయిస్తామని ప్రభుత్వం పార్లమెంటులో హామీ ఇచ్చింది. 2020 ఏప్రిల్ 01 నుండి వాటిని మొదలుపెడతామని ప్రభుత్వం చెబుతున్నది.

9) బిఎస్ఎన్ఎల్ ఏర్పాటు సందర్భంగా డిఓటిలో రిక్రూటైన ఉద్యోగులకు పెన్షను ఇచ్చేందుకు గాను బిఎస్ఎన్ఎల్ చెల్లించే పెన్షను కాంట్రిబ్యూషన్‌ను కూడ కేంద్ర ప్రభుత్వం రూల్స్‌కు భిన్నంగా స్కేల్ మాగ్జిమము పై లెక్కించి తీసుకోవడం వల్ల బిఎస్ఎన్ఎల్‌కు దాదాపు రెండువేల కోట్లు అదనంగా ఖర్చు అయింది. దీనికి ఉద్యోగులు పోరాడినా, బిఎస్ఎన్ఎల్ అభ్యర్థించినా ప్రభుత్వం ఏ మాత్రం సహకరించలేదు.

10) నోషనల్ లోను పేరుతో బిఎస్ఎన్ఎల్ నుండి కొన్నివేల కోట్ల రూపాయలు వడ్డీగా ప్రభుత్వం తీసుకున్నది.

11) ప్రభుత్వం అనేక రాయితీలను కొందరికి బిఎస్ఎన్ఎల్ ద్వారా కలుగజేస్తున్నది. కాని వాటిని కాంపన్‌సేట్ చేయడం లేదు. ఉదా:- టెలికాం అడ్వైజర్ కమిటీ సభ్యులకు ఉచిత కాల్స్ మొదలైనవి.

ఈ విధంగా ప్రభుత్వం బిఎస్ఎన్ఎల్‌కు నష్టం కలిగించి, నష్టాలకు కారణం అధిక ఉద్యోగులు అనే ప్రచారం చేసి చివరకు బిఎస్ఎన్ఎల్ రివైవల్ పేరుతో 78,569 మంది ఉద్యోగులను 2020 జనవరి 31న విఆర్ఎస్ ద్వారా రిటైర్ చేసింది. వారికి చెల్లించాల్సిన డబ్బులకు గాను మరి ఇతర అప్పులకు గాను దాదాపు 38 వేల కోట్ల రూపాయల ఆస్తుల అమ్మకానికి అనుమతిచ్చింది.

ఒకవైపు పార్లమెంటులో బిఎస్ఎన్ఎల్ స్ట్రాటెజిక్ కంపెనీ అని దాని సర్వీసులు అవసరమని చెబుతూనే ఇంకోవైపు దానిని ముక్కలుగా చేయడానికి ప్రయత్నిస్తున్నది. సెల్‌టవర్ కంపెనీని, ఆప్టికల్ ఫైబర్ కంపెనీలను వేరు చేయాలని తెలుపుతున్నది. అలా విడగొట్టి బలహీన పరచి ప్రైవేటు పరం చేసే ఆలోచన ఉన్నదని మిగిలిన ఉద్యోగులు భయాందోళన చెందుతున్నారు. 4 లక్షల కోట్ల విలువ గల ఆస్తులు కలిగిన ప్రభుత్వ సంస్థను కాపాడుకునేందుకు ప్రధాన రాజకీయ పార్టీలు, మేధావులు, ఉద్యోగులు ఐక్యపోరు చేయాలని కోరుకుంటున్నారు.

**బిఎస్ఎన్ఎల్‌ను ఎందుకు కొనసాగించాలి?**

1) బిఎస్ఎన్ఎల్ బలహీనపడితే టెలికాం సేవల రేట్లు పెరగడమే కాక, సమాచార భద్రత లోపిస్తుంది. వెనుకబడిన ప్రాంతాల సేవలకు ఆటంకం ఏర్పడుతుంది. (ముఖ్యంగా ప్రకృతి వైపరీత్యాలలో)
2) ముఖ్యంగా రక్షణ వ్యవస్థ తర్వాత అత్యంత కీలమైంది కమ్యూనికేన్ వ్యవస్థ. బిఎస్ఎన్ఎల్ దెబ్బతింటే అది దేశానికి నష్టం చేకూరుస్తుంది.
3) అన్నిటికీ మించి భారతదేశం అత్యంత ఎక్కువ జనాభా కలిగి మానవ వనరులు అపారంగా కలిగిన దేశం. ప్రభుత్వం బిఎస్ఎన్ఎల్ సేవలను విస్తరించి ఎక్కువమంది యువతకు ఉద్యోగ అవకాశాలు కల్పించే అవకాశమున్నది.

# ఆదివాసేతరుల పరమవుతున్న సమ్మక్క - సారలమ్మ జాతర

*ఏజెన్సీ ఏరియాగా గుర్తించినా పాలక వర్గాలు ఆదివాసేతరుల వలసలను ప్రోత్సహిస్తూ, సమ్మక్క - సారలమ్మ జాతర నిర్వహణలో ఆదివాసుల పాత్రను తగ్గించారని అంటున్నారు* **మైపతి అరుణ్ కుమార్, చర్ప గోపాల్**

సమ్మక్క జాతరలో మాఘపున్నమిపై చిమ్ముతున్న విషం మేడారం శ్రీ సమ్మక్క – సారలమ్మ జాతర అంటే అర్థం, పచ్చని దట్టమైన అడవులు–కొండలు, కొండల నడుమ నుండి ప్రయాణం. నాటి కాకతీయుల కాలంలో "లక్నవరం"గా వచ్చిన చెరువు మత్తటి నీరు కోయగూడెంల దప్పికను తీరుస్తూ, సమ్మక్క–సారలమ్మల పాదాలు కడిగి ప్రయాణించి గోదావరి తల్లిని ముద్దాడి సహజసిద్ధ జంపన్న వాగు, కోయల రేలాపాటలు, గుస్సాడీలు డోలి పురాణాలు, మహిళను కొలిచే గద్దెలు, గద్దెలపై ప్రకృతిసిద్ధ అలంకరణ పడిగెలు, చిత్రలిపి, దేవర బాలలు, ఎదురేటలు, పవిత్ర మాఘపున్నమి పండువెన్నెలలో మధ్య భారతదేశంలోని ఆదివాసుల సవరకచ్చురం ఎడ్ల బండజిలో ప్రయాణం, నిలువెత్తు బంగారం మాఘపున్నమి పండు వెన్నెల బుదవారం, సారలమ్మ, పగిడిద్దరాజు, గోవందరాజు, జంపన్న, నాగులమ్మల రాక, గురువారం సమ్మక్క శుక్రవారం మొక్కులు, జంపన్న వాగులో స్నానాలు, అడవిలో పెద్దపులుల గాండ్రింపు లేడిపిల్లల ఆటలు, నెమలి పంచాలు, అడవి దున్నలు సంబురాలు, చిరుత పులుల ఆటలు, చిలకలగట్టు గుట్టలో ఆకాశంలో మెరుపు, పశు పక్ష్యాదులు, ప్రకృతి పూజించే ఆదివాసుల అతి పవిత్రమైన జాతర మేడారం జాతర.

కాని ఈ జాతర విశిష్ఠత, సహజ సిద్ధత, ప్రకృతిని పూజించే రక్షించే, ఉత్పత్తిని కొలిచే ఆదివాసి సమాజపు ఆనవాళ్లను ప్రతి ఏడాది ప్రభుత్వం చిదిమేస్తుంది. ఆదివాసి సంస్కృతిని ద్వంసం చేస్తుంది. అభివృద్ధి పేరిట ఒక పక్క హరిత తెలంగాణ అని చెబుతూ మేడారం అడవి ప్రాంతాన్ని బోడ మేడారంగా, అడవి లేని మేడారంగా తయారు చేయాలని చూస్తోంది. ఆదివాసి మూలాలలను, ఆదివాసుల అస్థిత్వాన్ని చిదిమేయాలని చూస్తోంది. ఆదివాసి మూలాలను, ఆదివాసుల అస్తిత్వాన్ని చిదిమేయాలని చూస్తోంది. ఆత్మగౌరవాన్ని మంట కలుపుతుంది. స్థానిక మేడారం కోయగూడెం ప్రజలకు విలువ లేకుండా వారి అభిప్రాయం లేకుండా అభివృద్ధి పేరిట ఆదివాసులను వెళ్లగొట్టాలని చూస్తోంది. పూర్వకాలంలో కరువు కొరల్లో ఉండి కూడా స్థానిక కోయలు జొన్నలు, కందులు, బొబ్బర్లు చందాలుగా వేసుకొని వస్తులుండి ఆకలిమంటల్లో పండుగ వేలదిసారు. ఆనాడైనా ఆత్మగౌరవం కాపాడబడంది కాని నేడు 100 కోట్లు ప్రభుత్వం విడుదల చేసిన ఆ కోట్ల రూపాయాలు ఆదివాసుల వినాశానానికే తప్ప ఆదివాసుల రక్షణకు మాత్రం కాదు అనేది స్పష్టం అవుతుంది.

ఈ రోజు మేడారం జాతర ప్రపంచంలోనే రెండవ అతిపెద్ద జాతర అయిందంటే కారణం. ఆదివాసి విగ్రహాలను కాకుండా ప్రకృతిని, ఉత్పత్తిని కొలవటమే దానికి ప్రధాన కారణం. అటువంటి ప్రకృతిని వినాశనం చేస్తుంది. అభివృద్ధి పేరిట, ఆదివాసి సంస్కృతి రక్షణలో ఇప్పటికే ప్రభుత్వం విఫలం అయింది. 1996లో ఎప్పుడైతే 'రాష్ట్రపండుగా' గా గుర్తింపు వచ్చిందో అప్పుడే మొదలైంది ఆదివాసి సంస్కృతి విధ్వంసం. ఆదివాసులు విగ్రహాన్ని మొక్కరు కాని గద్దెల ప్రాంగణంలో సమ్మక్క పులిపై, సారలమ్మ జింకపై ఉన్నట్టు విగ్రహాల చిత్రీకరణ చేసి, సమ్మక్క అంటే వనదుర్గ, అడవి దుర్గ, సరస్వతి దేవి మూడోరూపం, నాలుగో రూపమని హిందునామ కరణాలు చేసి హైందవికరించారు. అడవిలో స్వేచ్ఛగా బతికే ఆదివాసి ఎలానో ఆదివాసి దైవాలు కూడా గద్దెలపై స్వేచ్ఛగా ఉంటారు. మాఘ పున్నమి వెలుతురు గద్దెపై పడాలి కాని మెల్లమెల్లగా సమ్మక్క గద్దెలపై మూసి వేసి బంధించే ఛాయలు వచ్చాయి. గద్దెపై ఉన్న సమ్మక్క చెక్కలో చేసిన స్థూపంకు 5 బోట్లు (గాట్లు), జాతర రోజు వెదురు బొంగు, పసుపు కుంకుమని ఉండాలి. కాని చిన్నగా కళ్లు తయారు చేశారు. రంగు రంగుల చీరలు చుడుతున్నారు. ఇవన్ని దేవాదాయ శాఖ హైందవికరంచే ప్రయత్నంలో ఆడే దొంగ నాటకాలు. మొత్తం మీద సమ్మక్క–సారలమ్మకు విగ్రహరూపం తీసుకువచ్చే ప్రయత్నాలు జోరుగా సాగుతున్నాయి.

శాస్త్రీయంగా పరిశీలన చేస్తే మేడారం సమ్మక్క–సారలమ్మ జాతర ఉత్పత్తిని కొలిచే జాతర, కోయపూజారులు ప్రతి రెండేళ్లకు ఒకసారి చిలకలగుట్ట నుండి సమ్మక్క వెదురు బొంగుకు పసుపు, కుంకుమ రాసి తీసుకువస్తారు. దాని అర్థం సమ్మక్క కోయ సమాజంలో '5'వ గొట్టులో తొలి అడపడుచు బిడ్డ, స్త్రీ లేకుండా మానవ ఉత్పత్తి సాధ్యం కాదు. మానవ మనుగడ లేదు. కాబట్టి తొలుత పుట్టిన ఆడబిడ్డ మానవ

---

4) ముఖ్యంగా ఆర్ అండ్ డిని అభివృద్ధి పరిచి సెల్ ఎక్విప్‌మెంట్‌ను చైనా ప్రభుత్వ కంపెనీలైన హువాయి జడ్‌టియి వలె బిఎస్ఎన్ఎల్ లోనే తయారు చేసి స్వయం సమృద్ధిని సాధించాలి.
5) బిఎస్ఎన్ఎల్ ను ప్రభుత్వ శాఖగా మార్చి పోస్టల్, దూరదర్శన్ వలె వివిధ ట్యాక్సుల నుండి విముక్తి కల్గించాలి. (అంటే లైసెన్స్ ఫీజు, స్పెక్ట్రం చార్జెస్ మొదలగునవి).
6) కేంద్ర ప్రభుత్వ ఉద్యోగుల వలె బిఎస్ఎన్ఎల్ ఉద్యోగులకు 10 ఏండ్లకు చేసే వేతన సవరణ పెన్షన్ సవరణ చేయాలి.
7) ఈ చర్యలు తీసుకొని బిఎస్ఎన్ఎల్ ప్రజలకు తక్కువ రేట్లతో నాణ్యమైన సేవలు అందించేందుకు తోడ్పడాలి.

*(రచయిత బిఎస్ఎన్ఎల్ ఉద్యోగ సంఘం ప్రతినిధి)* వీ

ఉత్పత్తిలో భాగం అవుతుంది. కాబట్టి దేవతగా కొలుస్తారు. అడవుల్లో ఏకాలంలో అయిన ఎండిపోకుండా పచ్చగా ఉండేది వెదురు బొంగు. కాబట్టి వెదురు బొంగుల ఎల్లకాలం పచ్చగా మానవ ఉత్పత్తి జరగాలని వెదురు బొంగులో సమ్మక్కను తీసుకువస్తారు. ప్రతియేడాది కోయ పూజారులు, జూన్ నెలలో సమ్మక్క గద్దెల దగ్గర భూమి పండుగ చేస్తారు. దాని అర్థం ఈ సృష్టిలో సకల జీవరాశికి మూలం భూమి. జూలై నెలలో 'విత్తనాల పండుగ' చేస్తారు. దానర్థం మానవ మనుగడను సుస్థిరం చేసేది ఆహారం. మానవుని ఆకలిని తీర్చేది. ఆహారపు గింజలు ఆ ఆహారాన్ని అందించేది విత్తనం, విత్తనం లేకుండా భూమిలోకి విత్తనం వెళ్లి అది పంటను అందివ్వకుంటే మనుగడలేదు అందుకే విత్తన ఉత్పత్తిని మా పూజారులు మొక్కుతున్నారు. ఆగస్ట్‌లో పొట్టపండుగ చేస్తారు. గర్భ రక్షణ ఈ సృష్టిలో అతి ప్రధానం అయింది. అందుకే పంటలు పొట్టకు రాగానే 'పొట్టపండుగ' చేస్తారు. సెప్టెంబర్‌లో పెద్దల పండుగ చేస్తారు. చనిపోయిన పూర్వికునే దైవాలుగా కొలుస్తారు. దాద, అమ్మమ్మ, తండ్రి, అమ్మ చనిపోయివారు మాకు జన్మనివ్వకుంటే మేం తాము కాబట్టి మా పూర్వికులే మా దైవాలు,

ఇదే మేడారంలో కోయ పూజారులు జరిపే జాతర మేడారమే కాదు మధ్య భారతదేశంలో జరిగే ప్రతి ఇలవేల్పు జాతర ఈ విధంగా ఉత్పత్తిని కొలిచే జాతరలు, పంట వేస్తే పండుగ, కోస్తే పండుగా, విత్తనం చెతికి వస్తే పండుగ. విప్పచెట్టు 7 రకాలు ఆహారాన్ని ఆదివాసులకు అందిస్తుంది. ఇప్ప చెట్టు కోయజాతిని బతికిచ్చిందని పూర్వికులు చెబుతారు. అందుకే ఉత్పత్తినిచ్చె విప్పచెట్టు దేవుడు. ఈ రకమైన చారిత్రక ప్రకృతి విలువలు ఉన్న మేడారం జాతర నేడు ఇదంత ధ్వంసం చేసి, హిందు దేవాలయాలు గా మార్చే కుట్రలు జరుగుతున్నవి.

ఈ రోజు మేడారంలో ఉన్న ఆదివాసులం ఈ ప్రభుత్వాలను, అధికారులను ప్రశ్నిస్తున్నాం. ఈ మేడారం అనేది భారత రాజ్యాంగంలో 1950 జనవరి 26న భారత రాష్ట్రపతి గెజిట్లో పేర్కొనబడిన '5'వ షెడ్యుల్ ప్రాంతం. 1/70 చట్టం అమలులో ఉన్న ప్రాంతం. పూర్వం 40 కోయల గుడిసెలున్న ప్రాంతం కాని అభివృద్ధి జరిగిన కొలది ఈ ప్రాంతంలోకి గిరిజనేతరుల వలుసలు పెరిగినవి. ఈ వలసలను అరికట్టడంలో ప్రభుత్వం విఫలం అయింది. నేటికి వలసలను ప్రోత్సహిస్తుంది. నేడు మేడారంలో కోయల జనాభా 20 శాతం, గిరిజనేతరుల జనాభా 80 శాతం. ఇది భవిష్యత్‌లో ఆదివాసులకు ప్రమాదమని తెలిసిన పట్టించుకోరు.

ఈ గిరిజనేతర జనాభా అక్రమంగా నిర్మించుకున్న బిల్డింగ్ మేడారం రూపమే మారింది. మేడారం నేడు ఆదివాసి గూడెం కాదు. కబ్జాకొరల్లో ఉన్న మేడారం సిటీగా మార్చారు. గిరిజనేతర వ్యాపారాలే జోరు మీదున్నాయి. ఇది సరిపోదన్నట్లు, మేడారం ఆదివాసులకు డబుల్ బెడ్‌రూమ్‌లు వారి సొంత స్థలాలలో కట్టెయండి కలెక్టర్ గారు అంటే హరిత హోటల్ నిర్మాణానికి ఉన్న భూమిని సర్వే చేసి గుంజుకుంటు న్నాడు. ఆదివాసులకు కడుపునింపె వ్యవసాయ భూమిలో హరితహోటల్ నిర్మాణం దుర్మార్గమైన చర్య. బలిసినోడు వచ్చిహరిత హోటల్ బిర్యాని తిని బొక్కలు పారేస్తే వాటిని ఆదివాసులు చికమన్నట్టుంది ప్రభుత్వ వ్యవహారం మేడారంలో ఇప్పటికే ఒక హరిత హోటల్ కట్టారు. ఇంకోటికడుతున్నారు. సిమెంట్ కట్టడాల సంఖ్య మేడారంలో జరిగితే అది ప్రకృతి సిద్ధ జాతర కాదు. మోడ్రన్ సిటీ జాతరగా మారుతుంది. మేడారంలో చేసే అభివృద్ధి సమ్మక్క-సారలమ్మ జాతర, కోయల అస్తిత్వాన్ని, భవిష్యతను నిర్దేశించాలే తప్ప వినాశనాన్ని కాదు.

జాతీయ హోదా కోసం ప్రయత్నం చేస్తున్నాం అని చెబుతున్నారు కాని జాతీయ హోద మాకు అవసరం లేదు. ఈ జాతర కేంద్రం చేతిలో పడితే జాతీయ హోద మాకు అవసరం లేదు. ఈ జాతర కేంద్రం చేతిలో పడితే జాతీయ హోదా నిబంధనల ప్రకారం గుడికి 2 కి.మీ. దూరంలో స్థిరనివాసాలు ఉండొద్దు. అంబాని, అదానిల పెట్టుబడు లొస్తాయి. మేడారం కోయగూడెం మొత్తం గద్దెల పరిధిలోనే ఉంది. దీంతో సంస్కృతి పరంగా కూడా నష్టమే అనేది గ్రహించాలి.

జాతరనాడు సమ్మక్క భర్త అయిన పగిడిద్దరాజు మహబుబాబాద్ జిల్లా, గంగారం మండలం పూనుగొండ్ల నుండి కాలినడకన దేవున్ని మేడారానికి తీసుకువస్తారు వీరిపై పట్టింపు ఉండదు పగిడిద్దరాజు తమ్ముడయిన గోవిందరాజును ఏటూర్ నాగారం మండలం కొండాయి నుండి తీసుకొస్తారు. వీరి అభివృద్ధి పట్టదు. కన్నెపల్లి నుండి సారలమ్మను తీసుకొస్తారు. ఈ గ్రామ అభివృద్ధికి సిదులుండవు.

నాగులమ్మ, లక్ష్మీదేవరల ఈ దేవతల గ్రామాల గుడులు అభివృద్ధి దేవుడెరుగు. ప్రభుత్వం ఖర్చు చేసే కోట్ల రూపాయలలో ఒక్క రూపాయి ఇవ్వరు. మేడారం సొమ్ము గద్దెల పాలు అన్నట్లు ఉంది. ప్రతియేడాది రాను రాను మేడారం జాతర ఆదివాసుల నుండి అభివృద్ధి ముసుగులో చేజారుతు వస్తుంది.

జాతరకు వచ్చే భక్తులు అధిక ప్లాస్టిక్ వాడకం వలన భూమి కలుషితం అయింది. భక్తులు ఇష్టమొచ్చిన విధంగా చెట్లను విరవడం, వంట చెరుకు కోసం చెట్లను కొట్టడం, అడవిలో ప్లాస్టిక్ అధికంగా వదిలేయడం, జాతర అవసరాలకు చెట్లను నరకడం, వలసలు పెరిగి అడవిని పోడుగా మార్చడం మూలంగా మేడారంలో ప్రకృతి విధ్వంసం అయింది. భూమి తనసారం కోల్పోయింది.

ప్రకృతి సిద్ధంగా ప్రవహించే జంపన్న వాగు ఎండిపోయి ఏడుస్తుంది. భూగర్భ జలాలు అడుగంటినవి, కృత్రిమంగా నీరు పారిస్తున్నారు. ఒకనాటి జంపన్నవాగు ఒడ్డుకు ఉన్న దట్టమైన అడవి వలసవాదుల రాకతో మాయం అయింది. దుప్పలు, మణిబోతులు, అడవి కుక్కలు, గుడ్డెలుగులు, పులులు అడవి దున్నలు మాయం అయినవి. ఇంకొన్ని రోజులలో కోయలను కూడా మాయం చేసే అభివృద్ధి మొదలయింది. ఇంకా కొంచెం ముంగటికి వెళితే భవిష్యత్ లో సమ్మక్కను కూడా మాయం చేస్తారు.

అందుకే మేడారంపై మేధావుల విశ్లేషణ జరగాలి. మేడారంలో సిమెంట్ కట్టడాలు, భారీ ప్రభుత్వ భవనాలు నిషేధించాలి. మేడారంలో గిరిజనేతరుల వలసలు నిరోధించాలి. ప్లాస్టిక్ నిషేధించాలి. అడవుల నరికివేతను ఆపాలి. చెట్ల పెంపకం యుద్ధ ప్రాతిపాదికన చేపట్టాలి. మేడారంలో దేవాదాయ శాఖను రద్దు చేసి అటానమస్ ఆదివాసి బోర్డును ఏర్పాటు చేసి నిధులు ఆదివాసి ప్రాంత అభివృద్ధికి కేటాయించాలి. రాజకీయ ప్రచారాలు నిషేదించాలి. ప్రకృతిని మేడారంలో రక్షించి అడవి తల్లిని, అడబిడ్డల సంస్కృతిని రక్షించాలి లేదంటే సమ్మక్క-సారలమ్మ మేడారంలో మాయమవటం కాయం.

*(రచయితలు ఆదివాసి హక్కుల పోరాటసమితి*
*తుడుందెబ్బ తెలంగాణ రాష్ట్ర అధ్యక్షులు;*
*ఆదివాసి విద్యార్థి సంఘం ఉపాధ్యక్షులు)*

వీ

# ప్రలోభాలే ప్రధానంగా మున్సిపల్ ఎన్నికలు

***మున్సిపల్ ఎన్నికల్లో ప్రజల సమస్యలు అప్రధానమై ప్రలోభాలే ప్రధానమై, కనీసమైన విలువలు పాటించలేదనీ, దీంతో ప్రజాస్వామ్యం ప్రశ్నార్థకమయ్యే స్థితి ఏర్పడిందనీ అంటున్నారు* వంగాల సంపత్ రెడ్డి**

రిజర్వేషన్లు ఖరారు చేయకుండానే రాష్ట్రంలో మున్సిపల్ ఎన్నికల నోటిఫికేషన్ విడుదలైంది. దీనిపై వచ్చిన అభ్యంతరాలను హైకోర్టు కొట్టివేయడంతో 120 మున్సిపాల్టీలలో 10 నగరపాలక సంస్థలకు ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో టిఆర్ఎస్ ఘన విజయం సాధించింది. మొత్తం 120 మున్సిపాటీలకు గానూ 112 స్థానాల్లో గెలుపొందింది. కాంగ్రెస్ 4, బిజెపి 2, ఎంఐఎం 2 స్థానాలు దక్కించుకున్నాయి. ఎన్నికలు జరిగిన పది నగర పాలక సంస్థలనూ కూడా టిఆర్ఎస్ కైవసం చేసుకుంది. మొత్తంగా తెలంగాణ మున్సిపల్ ఎన్నికల్లో టిఆర్ఎస్ తన ఆదిక్యతను చాటింది.

ఈ ఎన్నికల్లో టిఆర్ఎస్ సాధించిన విజయం వెనుక రాష్ట్ర ప్రజలు, పార్టీ కార్యకర్తలున్నారని తెలంగాణ రాష్ట్ర సమితి ప్రచారం చేసుకున్నది. గత ఐదున్నరేళ్లుగా సిఎం కెసిఆర్ నేతృత్వంలో రాష్ట్రంలో చేసిన అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాలకు ప్రజల నుంచి ఆమోదం లభించిందని టిఆర్ఎస్ చెప్పుకున్నది. ఎన్నికల సందర్భంగా ప్రతిపక్షాలు చేసిన అసత్య ప్రచారాలను ప్రజలు తిప్పికొట్టారనీ, తెలంగాణ రాష్ట్రం వచ్చిన తర్వాత జరిగిన ప్రతీ ఎన్నికలో ప్రతిపక్షానికి ప్రజలు బుద్ధి చెబుతూనే ఉన్నారని టిఆర్ఎస్ ప్రకటించుకున్నది. అయితే మరొక పక్క మున్సిపల్ ఎన్నికల్లో అధికార టిఆర్ఎస్ పార్టీ ప్రజలను అనేక ప్రలోభాలకు గురిచేసిందని, అధికార దుర్వినియోగానికి పాల్పడడం వల్లనే టిఆర్ఎస్ విజయం సాధించిందని ప్రతిపక్ష పార్టీలు ఆరోపించాయి.

ఎన్నికల సందర్భంగా ఓటర్లను ప్రసన్నం చేసుకునేందుకు అభ్యర్థులు అనేక రకాలుగా ఓటర్లను ప్రలోభ పెట్టారు. హంగూ, ఆర్భాటాలేకుండా ఇంటింటికీ వెళ్లి నగదు, మద్యం, మాంసం, చీరలు, కుర్చీలు, వాచీలు, బంగారు ఆభరణాలుతో పాటు గిఫ్టులు ఇస్తూ ఓటర్లను ఆకర్షించారు.

డబ్బులు, మద్యంతోపాటు కాలనీల్లో యువకులు తమకు అవసరమయ్యే క్రికెట్ కిట్లు, ఇతర వస్తు సామగ్రిని అభ్యర్థులు ఇచ్చారు. దాదాపు అంతటా 'ఓటుకు నోటు' అనే సంప్రదాయం వర్ధిల్లింది. ఏది ఏమయినా 'మూడు నోట్లు.. ఆరు బాటిళ్లు' అన్న చందంగా మున్సిపల్ ఎన్నికల ప్రచారం సాగింది. ఓటర్లను ఆకట్టుకునేందుకు నాయకులు, అభ్యర్థులు పడరాని పాట్లు పడ్డారు. ఎప్పటికప్పుడు తగిన ఏర్పాట్లు చేసుకుంటూ గెలుపే లక్ష్యంగా తొక్కాల్సిన దొడ్డి దార్లన్నీ అభ్యర్థులు తొక్కారు. ఈ ఎన్నికల సందర్భంగా మనం ఒక విషయాన్నీ గమనించవచ్చు. ప్రపంచ బ్యాంకు ప్రత్యక్ష జోక్యం పెరిగిన తరువాత ఎన్నికల పట్ల ప్రజలకు విశ్వాసం సన్నగిల్లింది. రాజకీయ నాయకుల పట్ల, రాజకీయాల పట్ల హేయ ధోరణి పెరిగింది. ప్రజాస్వామ్యం అంటే ఎలా ఉంటుందో ప్రజలకు అర్థం అయింది. రాజకీయాల పట్ల హేయ భావం కలిగించి తమ పని పూర్తి చేసుకోవడం చాల కాలం నుండి ప్రపంచ బ్యాంకు చేస్తున్నదే. అన్ని వ్యవస్థల పట్ల నమ్మకం పోయేటట్టు చేయడం ప్రపంచ బ్యాంకు లక్ష్యం. గత 25 సంవత్సరాలలో ఆ పని పూర్తి చేయడంలో ప్రపంచ బ్యాంకు సఫలం అయింది.

ఈ ఎన్నికల్లో పట్టణ ప్రాంత ప్రజల సమస్యల మీద చర్చ జరుగలేదు. తాగు నీరు పెరుగుతున్న నీటి పన్ను, ఇంటి పన్ను ఇంటి నిర్మాణానికి అనుమతుల విషయములో జరిగే అవినీతి తాత్సారం వీధి దీపాలు గుంతలు పడిన రోడ్లు దోమల సైర్వ విహారం శుభ్రమైన నీరు పందుల పరిశుభ్రత అంటు వ్యాధుల నివారణకు సంబంధించిన విషయమంలో పెద్దగా చర్చ జరుగలేదు. పారదర్శకతతో కూడిన పాలనను ఎలా అందించాలో చర్చ జరుగలేదు. ప్రజల అవసరాలు ఏమిటో తెలుసుకోవడం జరుగలేదు. కనీసం ఆ అవసరలేంటో గుర్తించడానికి చేసిన ప్రయత్నం కూడా కనిపించలేదు. పేదలపై ప్రభావం పడకుండా ఆదాయం పెంచుకునే మార్గాలపై చర్చ జరుగలేదు. కాలుష్యాన్ని ఎలా తగ్గిస్తరో చెప్పిన వారే లేరు.

లేబర్ అడ్డా మీద నిలబడి ఉన్న అడ్డా కూలీల జీవితం పెద్దగా చర్చకు రాలేదు, రోడ్ల మీద కూరగాయలు అమ్ముకునే వారి సమస్యల ఊసే లేదు. మురుగు కాల్వల నిర్మాణం కానీ, నిర్వహణకు సంబంధించిన ప్రస్తావన లేదు. ట్రాఫిక్ నిర్వహణ మెరుగు పరచే పద్ధతి మీద చర్చ జరుగలేదు. పేద ప్రజల మురికివాడల విషయం చర్చలో లేకుండా పోయింది.

ఏదో విధంగా గెలిచే వారికి టికెట్లు ఇవ్వడం ఆనవాయితీగా మార్చారు. తమ పార్టీ కానివారు గెలిస్తే, గెలిచిన వారిని నయానో భయానో బెదిరించి తమ పార్టీలో చేర్చుకోవడం ద్వారా ఎన్నికల్లో ఎవరు గెలిచినా ఏ పార్టీలో ఉంటారో తెలియని పరిస్థితి సృష్టించారు. తద్వారా ప్రజా అభిప్రాయాన్ని తుంగలో తొక్కారు. భిన్న అభిప్రాయాన్ని సహించే స్థితిలో పాలక వర్గం లేదు, తాము చెప్పిన దానిని గుడ్డిగా విని అనుసరించాలి తప్ప ప్రశ్నించకూడదు. దీనికి భిన్నంగా ప్రవర్తిస్తే వేధించడం మామూలు విషయం అయిపోయింది.

ఎక్స్ అఫీషియో సభ్యుల నియామకం కూడా ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేసే ధోరణిలోనే జరిగింది. గెలవడమే గీటురాయిగా పెట్టుకుని ఎన్నికలు జరిగాయే తప్ప విలువల స్థాపన దిశగా ఎన్నికలు జరుగలేదు. తద్వారా ప్రజాస్వామ్యం ప్రమాదంలో పడే స్థితి ఏర్పడింది. వీ

*(రచయిత అధ్యాపకులు)*

# రాజధాని ఆందోళన ఆర్థిక మూలాలు

***ఏపి రాజధాని అమరావతి వెనుక తెలుగుదేశం పార్టీ నాయకుల ఆర్థిక ప్రయోజనం, చంద్రబాబు వాస్తు నమ్మకం తప్ప ప్రజల ప్రయోజనం ఏమిలేదని అంటున్నారు*** **వై. హెచ్.కె. మోహన్‌రావు**

ఆంధ్రప్రదేశ్‌లో రాజధాని అంశం ఇప్పుడు హాట్ టాపిక్‌గా మారింది. రాజధాని ఒకటిగా ఉండాలా? మూడుగా ఉండాలా? అనే చర్చ విస్తారంగా నడుస్తుంది. అధికార వైసిపి, విపక్ష టిడిపికి మధ్య ప్రచ్ఛన్న యుద్ధమే జరుగుతుంది. ఏ విధంగానైనా రాజధానిని వికేంద్రీకరించాలని వైసిపి తన శక్తియుక్తులను ప్రదర్శిస్తుంటే, ఎట్టి పరిస్థితుల్లోనైనా అడ్డుకోవాలని టిడిపి బలాన్నంతా కూడదీసుకుంటుంది. దీక్షలూ, సదస్సులు, న్యాయపరమైన ఇతర ఆందోళనలతో “దేశం” అలుపెరగని పోరు చేస్తుంది. అదే క్రమంలో వికేంద్రీకరణకు మద్దతుగా వైసిపి ప్రదర్శనలు, సభలు నిర్వహిస్తుంది. అయితే అటు ప్రభుత్వం, ఇటు విపక్షం రెండు కూడా రాజధాని భూములనే కేంద్రంగా మలుచుకున్నాయి. రాజధాని కోసం భూములు ఇచ్చిన రైతులు తీవ్రంగా నష్టపోతారని విపక్ష టిడిపి గగ్గోలు పెడుతుంటే, రైతులను అడ్డుపెట్టుకొని ఇన్‌సైడర్ కొనుగోళ్లు చేసిన టిడిపినే తన మనుషులను, రైతులను, రియల్ ఎస్టేట్ వ్యాపారులను ఉసిగొలిపి కృత్రిమ ఉద్యమం నడుపుతుందని వైసిపి ప్రభుత్వం తిప్పికొడుతుంది. 29 గ్రామాల రైతులు ఉధృత ఆందోళనలు అని టిడిపి అంటుంటే, నాలుగు ఐదు గ్రామాల, అదీనూ చంద్రబాబు సామాజిక వర్గ రైతులే ఈ ఉద్యమం చేస్తున్నారని వైసిపి ప్రభుత్వం పోటీ ఆందోళనలు చేపట్టింది. రాష్ట్ర పురపాలక శాఖా మంత్రి బొత్స సత్యన్నారాయణ మీడియాతో మాట్లాడుతూ రాజధానికి భూములు ఇచ్చిన కొందరు రైతులు తమ భూములు వెనుకకు తీసుకోవటానికి అంగీకారం తెలిపినట్లు మీడియాకు వివరించారు. ఇదే క్రమంలో మంగళగిరి శాసనసభ్యుడు ఆళ్ల రామకృష్ణారెడ్డి, మంత్రి కొడాలి నాని నేతృత్వంలో ఐదు గ్రామాల రైతులు ముఖ్యమంత్రి జగన్మోహన్‌రెడ్డిని కలిసి అభివృద్ధికి సంబంధించిన షరతులతో భూములు వెనక్కి తీసుకోవడానికి ఇష్టపడ్డారు.

అలాగని వికేంద్రీకరణ వైసిపి చిత్తశుద్ధిని కూడా ప్రశ్నిస్తుంది. చంద్రబాబు నిర్ణయాన్ని శాసనసభలో స్వాగతించి ఇప్పుడు టర్న్ తీసుకొని వికేంద్రీకరణ చేపట్టడం సమంజసమా? అంటూ కొన్ని వర్గాలు ముఖ్యమంత్రి జగన్మోహన్‌రెడ్డిని నిలదీస్తున్నాయి. చంద్రబాబునూ టిడిపిని రాజకీయంగా తొక్కే క్రమంలో భూములు ఇచ్చిన రైతులను ఇబ్బంది పెట్టడం సరికాదని విజ్ఞులు చెబుతున్నారు. అంతే కాకుండా అమరావతిలో టిడిపి ఇన్‌సైడర్ ట్రేడింగ్ నిర్వహిస్తే, విశాఖలో వైసిపి ఇన్‌సైడ్ పాత్ర పోషిస్తుందని ఆరోపిస్తున్నారు.

అయితే రాజధాని వికేంద్రీకరణలో రెండు పార్శ్వాలు ఉన్నాయి. ఒకటి భూములు ఇచ్చిన రైతుల ప్రయోజనాలూ, రెండోకోణం ఆయా గ్రామాల్లోని భూములు ఇవ్వనీ లేక భూమి లేని పేదల ఇక్కట్లు. 29 గ్రామాల్లో 26 వేల మంది రైతులు 33 వేల ఎకరాలు రాజధానికి ఇచ్చివుంటే, మొత్తంగా ఆయా గ్రామాల్లో సుమారు లక్షా యాభై వేల మంది ప్రజలు ఉన్నారు. భూమి ఇచ్చిన 26 వేల మందిని మినహాయిస్తే ఇంకనూ మిగిలిన ఒక లక్షా ఇరవై నాలుగు వేల మంది ప్రజలను కూడా ఒక ప్రాధాన్యతాంశంగా తీసుకోవలసివుంది. వీరంతా భూమిలేని వారూ, పేదలూ, నిరుపేదలూ, వ్యవసాయ కూలీలూ, చిన్నచిన్న వ్యాపారాలూ, వృత్తులు చేసుకొనేవారూ, ఆధారిత చాకలి, మంగలి వంటి కులాల వారు. రాజధాని వికేంద్రీకరణ సందర్భంగా భూముల ధరలు పడిపోయాయని రైతులు రెండు నెలలకు పైగా చేస్తున్న ఆందోళనకు మనం చెప్పుకున్న భూమిలేని వర్గాలు మద్దతుగా వచ్చినట్లు ఎక్కడా కనిపించలేదు. అంటే ఈ భూములు ఇచ్చినవారు మినహా, వారికి మినహా ఇతరులెవ్వరికీ రాజధాని ఒకటిగా అమరావతిలోనే ఉన్నందువల్ల ప్రయోజనం కానీ, కోల్పోయేది కానీ ఏమీ లేదని గుర్తించవలసి ఉంది. పది, పదిహేను లక్షలు విలువచేసే ఎకరం భూమి ఐదు కోట్లకు చేరినందువల్ల అక్కడి భూమిలేని వారికి ఒరిగేదేమీ ఉండను గాక ఉండదు. రాజధాని మొత్తంగా అమరావతిలోనే ఉన్నా, మూడు భాగాలుగా వికేంద్రీకరణ జరిగినా భూమి ఇవ్వని వారికి ఒనగూడేది శూన్యమే. వీరందరినీ తన వైపుకు మళ్లించుకోవడానికి ముఖ్యమంత్రి జగన్మోహన్‌రెడ్డి తెలివిగా, వారికి క్రితం ప్రభుత్వం ఇస్తున్న నెలవారీ పింఛన్‌ను ఐదు వేలుగా రెట్టింపు చేసి వారి సానుభూతిని కూడగట్టుకున్నారు. చంద్రబాబుగానీ, ఆయన వర్గీయులు కానీ అల్పసంఖ్యాకులైన భూమి ఇచ్చినవారిని గురించి మినహా అధికసంఖ్యాకులైన వారిని పట్టించుకోకపోవడం విచారకరం.

ఇది ఇట్లా ఉంటే రాజధాని ఏర్పాటుకు ముందుగా లీకులతో చంద్రబాబూ, ఆయన అనుయాయులు ఆ ప్రాంతంలో ముందుగానే ఇన్‌సైడర్ పేరుతో కొనుగోలు చేసిన భూముల సమస్యే ఈ వికేంద్రీకరణకు దారి తీసిందని పలు వైసిపి నేతలు పేర్కొంటున్నారు. ఇన్‌సైడరే లేకుంటే జగన్మోహన్‌రెడ్డికి వికేంద్రీకరణ ఆలోచనే వచ్చివుండేది కాదంటున్నారు. చంద్రబాబు వంకర బుద్ధితో రానున్న నాలుగు ఎన్నికలకు రాజధాని భూముల ఇన్‌సైడర్ కొనుగోలుతో నిధులు సమీకరించుకున్నారనీ, చంద్రబాబును ఆర్థికంగా అణచివేయడానికే జగన్మోహన్‌రెడ్డి ఈ సాహసానికి పూనుకున్నారనీ స్పష్టం చేస్తున్నారు. వికేంద్రీకరణ రైతులకు సంబంధించింది కాదని, కేవలం రాజకీయ యుద్ధమే అంటున్నారు. రైతులపై సిఎంకు ఎలాంటి ద్వేషం లేదంటున్నారు. రైతులు

నిందించాల్సింది జగన్మోహన్‌రెడ్డిని కాదనీ, ఈ మొత్తం వివాదానికి కారకమైన చంద్రబాబునేనంటున్నారు. చంద్రబాబుకు రైతులపై ప్రేమకంటే తనూ, తనవారలు కొనుగోలు చేసిన భూముల ధరలు పడిపోయాయని దుఃఖం వేధిస్తుందంటున్నారు. అందుకే వైసిపి వారు ఈ ఉద్యమాన్ని ఆర్థిక ఉద్యమంటున్నారు. ఈ ఉద్యమం ధరల కోణమేగానీ మరొకటి కాదంటున్నారు.

కాగా రాజధాని ఉద్యమాన్ని రాష్ట్రవ్యాప్తం చేయాలని టిడిపి తపన విఫలయత్నమే అయ్యింది. తెలుగుదేశం శ్రేణులు మినహా ఇతరత్రా పౌరులు ఈ నినాదాన్ని అందిపుచ్చుకోకపోవటం అంత విచిత్రమైన విషయమేమీ కాదు. చంద్రబాబు విద్యార్థులను సైతం రెచ్చగొడుతూ ఈ ఉద్యమంలోకి లాక్కురావాలని ప్రయత్నించారు. సఫలం కాలేదు. అయితే ఈ మొత్తం సమస్యకు బాబే కారకులు. తాను సిఎంగా ఉన్న కాలంలో ఏ విషయం మీదనూ, ఎవరినీ నోరెత్తనీయలేదు. అటు కాపు ఉద్యమాన్ని ఉక్కు సంకల్పంతో అణచి వేయడంతోపాటు, హోదా కోసం రోడ్లపైకి వచ్చిన వారికి కారాగారాల దారి చూపించారు. విద్యార్థులు అందోళనలో పాల్గొంటే వారి తల్లిదండ్రులపై కేసులు పెట్టి జైల్లో కుక్కుతామని హెచ్చరికలు చేశారు. ఆ విధంగా తన హయాంలో ప్రవర్తించిన నియంతృత్వ వాతావరణం ఇప్పుడు బాబుకే ఎదురైంది.

ఇది ఇట్లా ఉంటే సమసమాజ సిద్ధాంత ప్రాతిపదికన పోరాడే రెండు వామపక్ష పార్టీలు ఎక్కడ పదిమంది నిలుచుంటే అక్కడికి చేరుకుని గళమెత్తే అవాంఛిత స్థితికి దిగజారినట్లుగా ఉంది. పేదల పక్షాన ఉద్యమించాల్సింది పోయి, పెట్టుబడిదారుల పంచకు చేరుతున్నట్లు తోస్తుంది. ఉపాధి కోల్పోయిన లక్షా పాతికవేల మంది భూమిలేని వారిని వదలి, పట్టుమని పాతికవేలు కూడా లేని సంపన్న రైతుల పక్షాన చేరుకున్నారు. సిపిఎం వాస్తవ పరిస్థితులను మూల్యాంకనం చేసుకొని రాజధాని రైతుల ఆందోళనకు మద్దతు ప్రకటనతో సరిపుచ్చి గమ్మున పక్కకు తొలగి ఉత్తమ నిర్ణయం తీసుకున్నట్లు అనిపించింది. సిపిఐ కేంద్ర కమిటీ కార్యదర్శి నారాయణ, జిల్లా కార్యదర్శి నాగేశ్వరరావు లోకేష్ వెనుకా, ఏపి రాష్ట్ర కార్యదర్శి రామకృష్ణ చంద్రబాబు నడకలో నడచిన వైనం వారి సిద్ధాంత వైఫల్యానికి సూచనగా నిలుస్తుంది. రాజధాని అమరావతి ప్రకటన రాకమునుపు ఎకరం పది నుండి పదిహేను లక్షలు ఉన్న ధర అనంతరం ఐదు కోట్లకు ఎగబాకింది. భూమిలేని వారు సున్నా వద్దనే పడివుంటే రాజధానికి భూములు ఇచ్చిన వారు తక్కువలో తక్కువ ఎకరానికి ఐదు కోట్లకు చేరారు. ఈ అగణిత ఆర్థిక వ్యత్యాసాలను సిపిఐ అభిలషిస్తుందేమో చెప్పవలసిన అవసరం ఉంది.

రాజధాని ఒకటిగా ఉన్నా వికేంద్రీకరణ జరిగి మూడు ప్రాంతాలకు మూడు విభాగాలుగా చేరినా రాష్ట్ర ప్రజలందరికీ కలిగే నష్టం ఏమీ ఉండదు. ఇదో భావోద్వేగమైన అంశం మాత్రమే. పదమూడు జిల్లాల ప్రజలు భావోద్వేగానికి లోను కాలేదనేది వాస్తవం. ఐదు కోట్ల మందికి చెందిన రాజధాని అంటూ ప్రతిపక్షాలు పదే పదే స్వరమెత్తినా, ఆ నినాదాన్ని ప్రజల్లో నాటలేకపోయారు. ఆ మేరకే ఆ కేక వ్యాప్తి చెందనూ లేదు. వికేంద్రీకరణను వ్యతిరేకిస్తూ చేసిన ఏ కొద్ది ఆందోళనలూ కూడా అతి కష్టం మీద జరిగినవే. ఆయా ప్రాంతాల్లో జరిగిన ఆందోళనలో కూడా టిడిపి వైఖరే కనిపించింది. రాజధాని ప్రాంత రైతుల భూములు ఎదిగితే మాకేం ఉపయోగం? అంటూ కొందరు ప్రశ్నిస్తున్నారు. మూడు రాజధానుల బిల్లును సెలక్ట్ కమిటీకి పంపిన వివాదం కూడా రాజకీయ క్రీడగానే మారింది. ప్రజాభిప్రాయ సేకరణ అంటూ కాలయాపనకే టిడిపి ఈ నిర్ణయం తీసుకుందని వైసిపి దుయ్యబడుతుంది. మూడు నాలుగు నెలల అనంతరం కూడా సెలక్ట్ కమిటీ చేసిన సూచనలను తోసిపుచ్చి బిల్లును యథాతథంగా చట్టం చేసుకునే అధికారం, హక్కు శాసనసభకు ఉన్నప్పుడు కమిటీ అభిప్రాయం అంటూ టిడిపి ఆడుతున్న నాటకం దురుద్దేశ్యంతో కూడుకున్నదేగానీ, మరొకటి కాదని విస్పష్టంగా చెబుతున్నారు.

**త్యాగం ఎవరిది? భోగం ఎవరిది?**

2014 తరువాత "స్వచ్ఛందం"తో పాటు ఎక్కువగా వినిపిస్తున్న శబ్దం "త్యాగం". ఈ రెండు పదాలూ విభజిత ఆంధ్రప్రదేశ్ తాజా రాజధాని స్థాపనకు సంబంధించి కర్ణభేరిని బద్దలుకొడుతున్న మాటలు. ముఖ్యంగా టిడిపి అధినేత, గత ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, ఆ పార్టీ నాయకులూ పదే పదే వల్లెవేస్తూ జపం చేస్తున్నారు. లోపలికి వెళితే ఈ రెండు పదాలూ అమరావతి పేరుతో ఆ ప్రాంతంలో ఏర్పరిచే రాజధాని కోసం "సమీకరణకు" భూములిచ్చిన రైతులూ, భూ యజమానులకు ఆన్వయమయ్యేవే. నిజనిజాలు వెతుక్కుంటూ ఒకసారి నెమరువేసుకుంటే స్వచ్ఛంద సమీకరణకు సమాంతరంగా బలవంతపు సమీకరణ కూడా ఉన్నట్లు నిర్ధారణకు వస్తాం. అనేకమంది రైతుల దుఃఖ సమయాలనూ, విచారవదనాలనూ, మహిళా రైతుల కన్నీటి కనురెప్పలనూ, ఆందోళనతో జీరబోయిన స్వరాలనూ మూల్యాంకనం చేసినట్లయితే బలప్రయోగానిదే పైచేయి అవుతుంది. అయితే చంద్రబాబు ప్రణాళిక ఐదేళ్ల తరువాత గాని వారికి బోధపడలేదు. వ్యవసాయం చేసి ఆర్జించే మొత్తంకంటే బాబుగారి రాజధాని మాటున ఎదిగే ధరలు భూములిచ్చిన రైతులను అమిత సంతృప్తికి గురిచేశాయి. ఏదో అనుకుంటే వైభవమేదో అందుకున్నామనే ఆనందం అనుభవించారు. సాలుకు 50 వేలూ, ఆపై ఏడాదికి 10శాతం చొప్పున నీరు పెట్టకుండానే, ఎరువు వేయకుండానే ఎదిగే కౌలూ, ఆయాచితంగా వారికి వచ్చే గజాల ఆకాశధరలూ వెరశి వారిని నయా కోటీశ్వరులనే చేశాయి. ఎకరం 10 నుండి 30 లక్షల విలువైన భూమిచ్చిన యజమాని గజం రు. 30,000 పలికే 1250 గజాలు పొందడం అల్లాఉద్దీన్ అద్భుత దీపం పొందిన విధంగా ఒక్కసారిగా జీవితం ఖరీదైన మలుపుతిరిగింది. 2019 ఎన్నికలలో అఖండ విజయం సాధించిన జగన్మోహన్‌రెడ్డి పాలనా వికేంద్రీకరణ ప్రకటనతో మేడలన్నీ కుప్పకూలాయి. ఒక్క సారిగా ప్రపంచం తలకిందులైంది. కౌలూ, అభివృద్ధి పరచిన ప్లాట్లూ తీసుకోవడం త్యాగం ఎట్లా అవుతుందో తెలుగు చదువుకున్న వారికి బోధపడని అంశం. ఇచ్చిన దానికంటే తిరిగి అందుకునే విలువ అధికంగా ఉంటే, దానిని కూడా త్యాగం అంటారా? ఏమో తెలియదు. బాబూ, ఆయన అనుయాయులు నూతన నిఘంటువును రూపొందించి త్యాగానికి అర్థం మార్చితే బాగుంటుందేమో.

రాజధాని భూ సమీకరణకు సహకరించిన వారిది త్యాగమైతే గత కాలంలో సాగునీటి ప్రాజెక్టుల నిర్మాణాల సందర్భంలో భూములు, నివాసాలు కోల్పోయి గ్రామాలకు గ్రామాలే తరలి వెళ్లిన వైనాన్ని

భోగమనాలా? వరుసగా చెప్పుకుంటూ వెళితే ప్రజల సొమ్ముతో కట్టిన ప్రకాశం బ్యారేజి వలన కలిగే ప్రయోజనాలు కృష్ణా, తెనాలి డెల్టా రైతులు మాత్రమే దశబ్దాలుగా అనుభవిస్తున్నారు. ఆపై శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణానికి 103 గ్రామాలూ, 15 శివారు గ్రామాలు తరలిస్తే 85 వేల ఎకరాల సాగు భూములు మునిగిపోయాయి. ఈ ప్రాజెక్టు ఫలితాలు కృష్ణా, గుంటూరు, ప్రకాశం, తెలంగాణ రైతులు పొందుతున్నారు. భూములూ, నివాసాలు, బతుకులు కోల్పోయిన వారు రాయలసీమకు చెందిన కర్నూలు జిల్లా వాసులు. ఆపై 300 గ్రామాలవారు నిరాశ్రయులై, లక్షల ఎకరాల సాగుభూమి మునిగిపోయి నిర్మితమైన నాగార్జునసాగర్ లాభాలను కృష్ణా, గుంటూరు, ప్రకాశం, తెలంగాణాలోని రైతులు సొంతం చేసుకుంటూన్నారు. జీవితాన్ని కోల్పోయిన లక్షలాది ప్రజలంతా తెలంగాణ అల్పజీవులు. అదే విధంగా నిన్నటికి నిన్న తెలంగాణ ప్రాంతంలో 16 గ్రామాలూ, ఏపిలో 16 గ్రామాలూ ఖాళీ చేయించి పూర్తి చేసిన 42 టిఎంసిల నీటి సామర్థ్యం కలిగిన పులిచింతల నీటి వనరులను కృష్ణా డెల్టా ప్రాంత రైతులు అప్పనంగా తమ ఖాతాకూ చేర్చుకుంటున్నారు. శ్రీశైలం, పులిచింతల రెండూ స్థిరీకరణ కోసం నిర్మించినవే అన్నది నగ్న సత్యం. ఇది ఇలా ఉంటే ఎప్పుడో నాగార్జునాసాగర్ నిర్మాణ దశలో జరిగిన ఒప్పందాన్ని ఆసరా చేసుకుని నాగార్జునసాగర్ నీటినిల్వ డెడ్ స్టోరేజి చేరుకున్నా, రాష్ట్ర తాగునీటి అవసరాలకు చాలకున్నా జూన్ 15 రాకమునుపే కృష్ణాజిల్లా మోతుబరి రైతులు తమ డెల్టాకు నీరు వదలాలంటూ గగ్గోలు పెట్టడం చూస్తూనేవున్నాం. కృష్ణావేణి నడకలకు వేసిన అడ్డుకట్టలతో సిరులు పండినది కృష్ణా, గుంటూరు ప్రకాశం, తెలంగాణలోని కొంత ప్రాంతమైతే రాయలసీమ, ఇతర ప్రాంతాలకు చుక్క నీరందడంలేదు. ఈ జిల్లాల్లో పూరిగుడిశెలన్నీ కాంక్రీటు శ్లాబులైతే రాయలసీమ వాసులు పొట్ట పోషణకై వలసవెళుతున్నారు. కృష్ణా నది ప్రయాణం రాయలసీమ గడ్డపైనుండే తెలుగు రాష్ట్రాలకు మొదలవుతుంది. రాజశేఖర్‌రెడ్డి పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ ప్రస్తావన తెచ్చిన ప్రతిసారీ మన మూడు పంటల సంపన్న రైతులంతా నానాయాగీ చేసిన సందర్భాలను చరిత్ర లిఖించింది. ఒక మహిళా సంఘం చేసిన సాధికార సర్వే ప్రకారం నాగార్జునాసాగర్ ప్రాజెక్టు మూలంగా బ్రతుకు కోల్పోయిన కొన్ని శ్రామిక అల్పాదాయ కుటుంబాల మహిళలు దిక్కుతోచక, ఉపాధి లేమితో పడుపువృత్తి వైపువెళ్లి జీవనం కొనసాగించారని తెలుస్తుంది. కనీసం పునరావాసానికి కూడా నోచుకొని శ్రీశైలం, నాగార్జునాసాగర్ ప్రాజెక్టుల వలన ఆధారం కోల్పోయిన బాధిత జీవులది త్యాగమా? సాలుకు రెండు లేక అంతర్ పంటతో మూడు పైర్లు వేసుకుని స్థిరపడిన మోతుబరి రైతులది భోగమా? అనేది మన ముందున్న ప్రశ్న. అందరూ సమానం, మనమంతా తెలుగువారం, మనది తెలుగు జాతి, అన్నదమ్ములం అనేవి బుజ్జగింపు మాటలేనా? ప్రజా స్వామ్యంలో పరిపాలనా ఫలాలు అందరికి సమానంగా అందవలసిన అవసరం తప్పనిసరి కాదా? 'ఒన్ మ్యాన్ ఒన్ వాల్యూ' ఉట్టి నినాదమేనా?

రాష్ట్ర ప్రజల సౌకర్యార్ధమేనని మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబు పదే పదే పలుకుతున్న పలుకులు నిజం కాదనే సంగతి ఆయన హైదరాబాదు విడిచే ముందు జరిగిన పరిణామాలను గుర్తుకు తెచ్చుకుంటే బోధపడుతుంది. 13 జిల్లాల ప్రజలకు సమాన దూరంలో ఉంటుందనే అమరావతిని రాజధానికి ఎంపిక చేసినట్లుగా ఆయన చెప్పే మాటలు డొల్లవే మినహా మరేమీ కావు. పండితులు, వాస్తు సిద్ధాంతులు, జ్యోతిష్కుల సలహాల మేరకే అమరావతిని రాజధానిగా ఎంచుకున్న మాట వాస్తవం. తొలుత ఆయన నాగార్జున విశ్వవిద్యాలయంలోని ఒక పెద్ద బోధనా భవనంలో శాసనసభ సమావేశాలు పెట్టుకునే ప్రయత్నం ఆరంభించి నప్పుడూ ఈ బృందమే విముఖత వ్యక్తం చేస్తే బాబు ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

ఈశాన్య భాగాన ప్రవాహం (కృష్ణానది) పల్లు ఉండే ప్రాంతంలో రాజధాని నిర్మాణం జరిగితే చంద్రబాబే మళ్లీ మళ్లీ ముఖ్యమంత్రి కాగలడన్న సిద్ధాంతుల సలహా మేరకే ఆ ప్రాంతం ఎంపిక చేసుకున్న మాట వాస్తవం కాదా. శంకుస్థాపనకు అతిథిగా వచ్చిన పక్క రాష్ట్ర ముఖ్యమంత్రి కెసిఆర్ కూడా వాస్తుపరంగా చాలా శ్రేష్టంగా ఉందని ప్రశంసించి చంద్రబాబుకు కితాబిచ్చాడు. తన వ్యక్తిగత స్వప్రయోజనం కొరకు అమరావతిని రాజధానిగా ఎంచుకున్న బాబు దానికి మసిబూసి రాష్ట్ర ప్రజల సౌకర్యం అంటూ రాగాలు తీయడం న్యాయంకాదు. నిజంగా మూఢ విశ్వాసాలను మూడు ముక్కలు చేయాల్సిన అవసరం కచ్చితంగా ఉంది.

*(అధ్యక్షులు నవ్యాంధ్ర రచయితల సంఘం గుంటూరు జిల్లా శాఖ)* వీ

# ఢిల్లీలో గెలిచింది నిజంగా సామాన్యుడేనా?

***ఢిల్లీ ఎన్నికలలో ఆమ్ ఆద్మీ పార్టీకి, భారతీయ జనతా పార్టీకి మధ్య హోరాహోరి జరిగిన పోరులో ప్రభావం చూపిన అనేక అంశాలను వివరిస్తున్నారు* కె. మహేష్**

ఢిల్లీ ఎన్నికలు ఒక కీలక సందర్భంలో జరిగాయి. ప్రజలు రాజ్యాంగాన్ని చేతిలో పట్టుకుని పౌరసత్వ సవరణ చట్టం పై గళమెత్తుతున్న కాలంలో..; ప్రజలే ప్రతిపక్షంగా పరిణమిస్తున్నప్పుడు ఈ ఎన్నికలు ముందుకొచ్చాయి. కేంద్ర సర్కారు దూకుడుగా తీసుకొచ్చిన పౌరసత్వ సవరణ చట్టంపై దేశవ్యాప్తంగా ఆందోళనలు జరుగుతుండగా, సీఏఏ వ్యతిరేక ఆందోళనలకు ఢిల్లీలోని షాహీన్‌బాగ్ ఒక సూచికగా మారుతుండగా ఆ రాష్ట్ర ఎన్నికలు జరిగాయి. కానీ, ఢిల్లీలో అధికారంలో ఉన్న ఆప్ మాత్రం షాహీన్‌బాగ్‌పై మాట్లాడలేదు. ఢిల్లీలో సీఏఏపై పెద్దఎత్తున ఆందోళనలు జరుగుతున్నా.. ఆ ఆందోళనలపై స్పందించని ఆప్‌కే అక్కడి ప్రజలు పట్టం కట్టారు. ఢిల్లీ వాసులకు ఆప్‌కు సీఏఏపై ఏదో ఒప్పందం ఉన్నట్టుగానే.. ముందే నిర్ణయించుకున్న తరహాలో ఓటర్లు ఆమ్ ఆద్మీకే మళ్లీ అధికారం కట్టబెట్టారు. ఢిల్లీ ప్రజలు ఆమ్ ఆద్మీ కేజ్రీవాల్‌నే విశ్వసించారు. సీఏఏ ఆందోళనకారులను శత్రువులుగా చిత్రించిన బిజెపి కూడా గతం కంటే అధిక స్థానాలనే గెలుచుకుంది. ఈ నేపథ్యంలోనే ఢిల్లీ ఎన్నికలు సహా సామాన్యుడి పక్షమని ప్రజలు నమ్మిన ఆమ్ ఆద్మీ నిజంగానే ఢిల్లీ వాసుల పక్షం నిలుచున్నదా.. బిజెపి విద్వేష రాజకీయాలను ఓటర్లు తిరస్కరించారా? అనే విషయాలను పరిశీలిద్దాం..

ఫిబ్రవరి 8 న జరిగిన ఢిల్లీ అసెంబ్లీ ఎన్నికల్లో ఆప్ అఖండ విజయం సాధించింది. మొత్తం 70 అసెంబ్లీ సీట్లకు గాను 62 స్థానాలను కైవసం చేసుకుంది. 8 సీట్లను బిజెపి సాధించుకుంది. కాంగ్రెస్ మాత్రం ఖాతా కూడా ఓపెన్ చేసుకోలేకపోయింది. ఎగ్జిట్ పోల్స్ ఊహించినట్టే ఆప్ ఢిల్లీ పీఠాన్ని కాపాడుతుంది. కేజ్రీవాల్ అధికారాన్ని తిరిగి సంపాదించుకున్నాడు. గత ఎన్నికలతో పోల్చితే.. ఆప్‌కు సీట్లు తగ్గినా ఓటు షేరింగ్ (సుమారు 54శాతం)లో పెద్ద తేడా కనిపించలేదు. దాదాపు 20 ఏళ్ల క్రితం అధికారం కోల్పోయిన బిజెపి ఢిల్లీ పీఠాన్ని అధిరోహించాలన్న ఆశలు అడియాశలు గానే మిగిలాయి. కానీ గత ఎన్నికల కంటే ఈసారి చాలా మెరుగైంది. ఐదు స్థానాలను అధికంగా సంపాదించుకుంది ఓటు షేరింగ్ 32 నుంచి దాదాపు 39 శాతానికి పెంచుకుంది. కాగా షీలా దీక్షిత్ నాయకత్వంలో వరుసగా మూడు సార్లు అధికారంలో ఉన్న కాంగ్రెస్ మాత్రం మరోసారి దారుణంగా భంగ పడింది. గత ఎన్నికలు, తాజా ఎన్నికల్లోనూ ఒక్క సీటు కూడా గెలుచుకో లేకపోయింది.

ఊహించిన ఫలితాలే అయినా.. ఈ ఎన్నికల ప్రచారం కనీవినీ ఎరుగని రీతిలో సాగింది. బిజెపి అయితే.. ఢిల్లీ పీఠాన్ని అత్యంత ప్రతిష్టాత్మకంగా తీసుకున్నట్టు కనిపించింది. సార్వత్రిక ఎన్నికల స్థాయిలో ప్రిపేర్ అయింది. దాదాపు 200కుపైగా ఎంపీలను, ఇతర రాష్ట్రాల సీఎంలు, కేంద్ర మంత్రులను ప్రచారంలోకి దింపింది. ఎప్పటిలాగే.. జాతీయ రాజకీయాంశాలనే ఎజెండాగా బరిలోకి దిగింది. ఆప్ స్థానిక సమస్యలపైనే దృష్టి కేంద్రీకరించడంతో.. బిజెపి కూడా తొలుత కొన్ని స్థానిక సమస్యలపై మాట్లాడింది. కానీ, తిరిగి పాత ధోరణిలోనే మతపరమైన వ్యాఖ్యలు, పాకిస్థాన్, భద్రత, ఉగ్రవాదుల చుట్టే ప్రచారాన్ని నిర్వహించింది.

ఆప్ మాత్రం స్థానిక సమస్యలు, సంక్షేమం పైనే దృష్టి పెట్టింది. అధికారంలో ఉన్నప్పుడు ఆప్ చేపట్టిన అభివృద్ధి పనులను ఎజెండాగా చేసుకుని ప్రచారం చేపట్టింది. విద్యకు నిధులు పెంచి మౌలిక వసతులు కల్పించడం, బోధనలో తీసుకువచ్చిన సంస్కరణలు, ఉచిత విద్య, మంచినీరు, మొహల్లా క్లినిక్‌లు, మహిళలకు ఉచిత రవాణా సహా పలు సంక్షేమ పనులను ప్రజల్లోకి తీసుకుని వెళ్ళింది. రిపోర్ట్ కార్డు అంటూ ఆప్ చేపట్టిన పనులను ప్రజల ముందు పెట్టింది. తర్వాత గ్యారంటీ కార్డు అంటూ ఎన్నికై అధికారంలోకి వస్తే తీసుకునే నిర్ణయాలను హామీగా ప్రకటించింది.

ఇలా పనిపై రాజకీయాలు అన్న నినాదాన్ని కేజ్రీవాల్ బలంగా తీసుకెళ్లారు. వ్యూహకర్త ప్రశాంత్ కిషోర్ నియమించుకుని సొంత ఎజెండాను ఆప్ పటిష్టంగా రూపొందించుకుంది. బిజెపి విసిరిన వలకు చిక్కకుండా నిర్దేశించుకున్న అంశాలకే పరిమితమైంది. ఈ క్రమంలోనే సీఏఏ, షాహీన్‌బాగ్ ఆందోళనలు, జాతీయ రాజకీయాంశాల జోలికి వెళ్లలేదు. మోడీ వర్సెస్ కేజ్రీవాల్ కాకుండా చూసుకుంది. బిజెపి మాత్రం సిఎఎ, ఆర్టికల్ 370 లాంటి జాతీయ రాజకీయ అంశాలకే ప్రాధాన్యత ఇచ్చింది.

ఢిల్లీలో కేజ్రీవాల్‌కు ధీటైన ప్రతిపక్ష నాయకుడు లేడు. ఈ కారణం చేత బిజెపి ముఖ్యమంత్రి అభ్యర్థి అని ప్రకటించలేదు. సీఎం అభ్యర్థి లేకున్నా ప్రధాని మోడీ చరిష్మా పై గెలవాలని బిజెపి భావించింది. మోడీ వర్సెస్ కేజ్రీవాల్ అని తీసుకొచ్చిన బిజెపి వ్యాఖ్యానాలను కేజ్రీవాల్ తిప్పికొట్టారు. ఆప్‌కు ఓటేస్తే కేజ్రీవాల్ సీఎం అవుతాడు.. బిజెపికి ఓటు వేస్తే సీఎం ఎవరు అవుతారు అని ప్రశ్నించాడు. ప్రధాని సీఎం కాలేడు కదా అంటూ ప్రభుత్వ అనుకూల మీడియాను చిక్కుల్లో పెట్టాడు. పాకిస్తాన్ నేత ఒకరు మోడీని విమర్శిస్తూ ఆప్‌కు అనుకూలంగా ఓ కామెంట్ చేస్తే దానిపై వెంటనే స్పందిస్తూ మోడీ తమ ప్రధాని అని కేజ్రీవాల్ రీ ట్వీట్ చేసారు కూడా.

**పౌరసత్వం.. షాహీన్ బాగ్**

గతేడాది జరిగిన ఝార్ఖండ్ ఎన్నికల ప్రచారంలో బిజెపి సీఏఏ ఎన్ఆర్సిలను ప్రస్తావించి ఓట్లు రాబట్టుకోవాలని చూసింది. కానీ స్థానిక సమస్యలు ఇతర కారణాలతో బిజెపి జార్ఖండ్ రాష్ట్రాన్ని కోల్పోయింది. గతేడాది చివర్లో జరిగిన జార్ఖండ్ ఎన్నికల్లోనే ఎన్ఆర్సి దేశవ్యాప్తంగా అమలు చేస్తామన్న అమిత్ షా వ్యాఖ్యలు పై కలకలం రేగిన విషయం తెలిసిందే. ఢిల్లీ ఎన్నికల నాటికి సీఏఏ, ఎన్ఆర్సిలకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా పెద్ద ఎత్తున ఆందోళనలు మొదలయ్యాయి. మహిళలు, పిల్లలు వీధుల్లోకి వచ్చి శాంతియుత ప్రదర్శనలు చేశారు. ఇటువంటి సందర్భంలో ఢిల్లీ ఎన్నికలు జరిగాయి. ఒకానొక దశలో ఈ ఎన్నికలను సిఏఏ పై రిఫరెండంగా కూడా కొంత మంది భావించారు. అందుకే ఫలితాల అనంతరం ఎన్నికలను సీఐపై రిఫరెండం గా భావించవద్దని అమిత్ షా అన్నాడు.

మతపరమైన వివక్షతో రూపొందిన ఈ చట్టన్ని ఢిల్లీ ఎన్నికల్లోనూ బిజెపి పదే పదే ప్రస్తావించి ఓ వర్గం ఓట్లు రాబట్టుకునేందుకు యత్నించింది. ఈ నేపథ్యంలోనే షాహీన్‌బాగ్ సహా సిఏఏ వ్యతిరేక ఆందోళనలను దేశానికి ముప్పు అన్నట్టుగా బిజెపి నేతలు చిత్రించారు. చట్టబద్ధంగా నిరసనలు చేస్తున్న ఆందోళనకారులను దేశద్రోహులు అన్నారు. ఈ నిరసనలపై తప్పుడు అభిప్రాయాలను ప్రచారం చేశారు. ప్రదర్శన శిబిరాల్లో అసలు దేశ చట్టాల అమల్లో ఉండడం లేదని తప్పుదారి పట్టించే ప్రసంగాలు చేశారు. ఆ నిరసనకారులు మరో వర్గం వారి ఇల్లుకి చొరబడి మహిళలపై అఘాయిత్యాలకు పాల్పడతారని విద్వేషాన్ని రగిల్చారు. ఢిల్లీ ఎన్నికలను పాకిస్తాన్ వర్సెస్ ఢిల్లీగా చిత్రించారు. ఇదే సమయంలో దేశద్రోహులను కాల్చి చంపండి అన్న నినాదాలను ఇచ్చారు. సాక్షాత్తు కేంద్ర మంత్రి అనురాగ్ ఠాకూర్ ఈ నినాదాలు ఇవ్వడం గమనార్హం. ఈ నినాదం ఇచ్చిన తర్వాత జామియా మిలియ ఇస్లామీయ యూనివర్సిటీ సమీపంలో ఓ యువకుడు తుపాకి పట్టుకొని వీరంగం సృష్టించాడు. హిందుత్వ రాజకీయాలతో సంబంధాలు ఉన్నట్లు తెలిసిన ఆ యువకుడు ఓ వర్గం కోసం ఈ 'ఘనకార్యం' చేయబోతున్నట్టు ముందుగానే ఫేస్బుక్లో ప్రకటించుకున్నాడు. సీఏఏ వ్యతిరేక ర్యాలీ చేపట్టబోతున్న యూనివర్సిటీ విద్యార్థులపై కాల్పులు జరిపాడు. ఓ విద్యార్థి బుల్లెట్ గాయాలపాలయ్యాడు. కేంద్ర పరిధిలోని ఢిల్లీ పోలీసులు మాత్రం యువకుడు వీరంగం చూస్తూ మిన్నకుండిన దృశ్యాలు వైరల్ అయ్యాయి. షాహీన్‌బాగ్ ప్రదర్శనకు సమీపంలోనూ ఇటువంటి ఘటనే చోటు చేసుకుంది. 'యహా హిందూవోంకి చలేగీ' అంటూ ఆ ఆ యువకుడు పలకడం గమనార్హం. సీఏఏపై జరుగుతున్న ఆందోళనలను మతపరంగా విభజించి విద్వేషాల పరిణామాలే ఈ ఘటనలన్న విశ్లేషణలున్నాయి.

బిజెపి నేతలు పదే పదే విద్వేషాన్ని చిమ్ముతున్నా ఎన్నికల కమిషన్ మాత్రం ఉదారంగా వివరించింది. రెండు, రోజులు మూడు రోజుల ఎలక్షన్ క్యాంపెయిన్‌కు దూరంగా ఉండాలని నోటీసులు ఇచ్చింది. నేతల రెచ్చగొట్టే వ్యాఖ్యలపై ఈసీ కఠినంగా వ్యవహరించలేదు. ఎన్నికలు ముగిసిన రోజు నమోదైన పోలింగ్ శాతం ప్రకటించకుండా అనుమానాలకు తావిచ్చే విధంగా ప్రవర్తించింది. ఫలితాలకు ముందు స్ట్రాంగ్ రూమ్‌లో ఉండాల్సిన ఈవీఎంలు వీధిలో చక్కర్లు కొడుతున్నట్టు చూపిస్తున్న కొన్ని వీడియోలను ఆప్ విడుదల చేసింది కూడా.

సీఏఏ ఆందోళనకారులు అరవింద్ కేజ్రీవాల్ బ్యాచ్ అని, ఆందోళనకారులందరూ ముస్లింలేనని, కేజ్రీవాల్ వారికి ప్రతినిధి అంటూ బిజెపి ప్రచారం చేసినా ఆప్ స్పందించలేదు. కేజ్రీవాల్ మాత్రం సీఏఏ ఆందోళనలపై, షాహీన్‌బాగ్ పై మాట్లాడనేలేదు. ఎన్నికల ప్రచారంలో కేజ్రీవాల్ ఒక మధ్యేవాద నాయకుడిగా కనిపించారు. బిజెపి మత పరమైన విభజనను కేజ్రీవాల్ దాని దారిలోనే వెళ్లి ఎదుర్కొన్నారు. తాను హిందువుల పక్షమేనన్న సంకేతాలిచ్చేందుకు హనుమాన్ చాలీసాల పఠనం, ఆలయ సందర్శనలు చేశారు. అలాగే, ముస్లింలను దూరం చేసుకోలేదు. ఇరువురిని సంతృప్తి పరచగలిగాడు. ఢిల్లీ ఎన్నికలను కేవలం ఢిల్లీకే పరిమితం చేయడంలో సఫలమయ్యాడు. అందుకే కేజ్రీవాల్ అధికారాన్ని కాపాడుకోగలిగాడు.

సార్వత్రిక ఎన్నికల్లో ఘన విజయం సాధించిన బిజెపి రాష్ట్ర ఎన్నికల్లో వెనుకపట్టు పడుతున్నది. కొత్త అధ్యక్షుడిగా జేపీ నడ్డాను ఎన్నుకున్నా.. అన్నీ తానై అమిత్ షానే ఢిల్లీ ఎన్నికల ప్రచారాన్ని నిర్వహించాడు. అయినా, ఓటమి తప్పలేదు. బిజెపి చెప్పిన జాతీయ రాజకీయాంశాల కన్నా రాష్ట్రంలోని సంక్షేమ పథకాలే తమకు ముఖ్యమని ఢిల్లీ ఓటర్లు తేల్చి చెప్పారు. పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికలకు మధ్య స్పష్టమైన తేడాను చూపెట్టారు. గత సార్వత్రిక ఎన్నికల్లో ఏడుకు ఏడు సీట్లు బిజెపి గెలుచుకున్నా.. అసెంబ్లీ ఎన్నికల్లో మాత్రం 70 స్థానాలకు గాను ఎనిమిది స్థానాలకే పరిమితమైంది. ఢిల్లీ ఎన్నికల్లో ఆప్ గెలుపు ప్రాంతీయ పార్టీలకు పెద్ద ఊరటనిచ్చింది. బిజెపిని ఢీకొట్టగలిగే ఆత్మవిశ్వాసాన్ని వాటిలో నింపింది.

స్థానిక అంశాలనే చూపెట్టి ఆప్ గెలిచినప్పటికీ.. దాని విజయాన్ని ఆశించినవారు కేవలం సంక్షేమాలనే కోరుకోలేదు. సామాజిక న్యాయాన్నీ ఆశించారు. ఒక వర్గాన్ని టార్గెట్ చేస్తున్న బిజెపికి ప్రత్యామ్నాయంగా ఆప్‌ను చూసినవారున్నారు. కానీ, సంక్షేమాలకే పరిమితమై అన్ని వర్గాల సమస్యలను పరిగణనలోకి తీసుకోకుండా మౌనంగా ఉంటే.. ఆప్‌కు బిజెపికు పెద్ద తేడా ఏమీ ఉండదు. బిజెపి కొంచెం తీవ్రమార్గాన్ని ఎంచుకుంటే.. ఆప్ సున్నిత మార్గాన్ని ఎంచుకున్నట్టే అవుతుంది. ఈ మాట ఎందుకంటే.. సీఏఏపై మాట్లాడితే.. ప్రచారంలో విద్వేషాల్లో భాగం పంచుకున్నట్టవుతుందని లేదా కొన్ని వర్గాలను పార్టీకి దూరమయ్యే ప్రమాదముందని ఆప్ దూరంగా ఉంటే సమస్యలేదు. కానీ, ఎన్నికల్లో గెలిచిన తర్వాత కూడా వాటిపై స్పందించకుంటే.. తాము సామాన్యుడని నమ్మిన అరవింద్ కేజ్రీవాల్ నిజంగా సామాన్యుడేనా? అన్న సందేహాలు రాకపోవు. ఫిబ్రవరి 16న ఢిల్లీ సీఎంగా కేజ్రీవాల్ ప్రమాణం తీసుకుంటున్న రోజే.. జామియా మిలియా ఇస్లామియా వర్సిటీలోకి ఢిల్లీ పోలీసుల చొరబడి విద్యార్థులపై దాడి చేసిన వీడియోలు బయటికి వచ్చాయి. జామియా వర్సిటీ ఢిల్లీలోనే ఉంది కదా.. వారిలోనూ ఢిల్లీ విద్యార్థులుంటారు. అటువంటి విద్యార్థులపై పోలీసుల అరాచకత్వాన్ని బట్టబయలు చేసిన వీడియోలపై ఆప్ స్పందించలేదు. ఢిల్లీ అల్లర్లకు సంబంధించి అప్రమత్తత ప్రదర్శించలేదు. బిజెపిని ఎదుర్కొనే క్రమంలో ఆప్ కూడా బిజెపికి సాఫ్ట్ వర్షన్ పార్టీలా మారితే.. ఢిల్లీ ఓటర్ల ఆశలు ఆవిరైనట్టేనని చర్చలు జరుగుతున్నాయి. బిజెపి ఓటర్లను అక్కున చేర్చుకునే ఎత్తుగడలో.. మైనార్టీలను శాశ్వతంగా దూరంగా పెట్టాలనే వ్యూహాన్ని అమలు చేస్తే ఈ చర్చల్లోని అనుమానాలే నిజమవుతాయి. వీ

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్టు)*

# షాహీన్ బాగ్ నిరసనలు శాంతియుతమైనవే

***ఎన్ని బెదిరింపులు వస్తున్నప్పటికీ షాహీన్ బాగ్ నిరసన ప్రదర్శకులు శాంతియుతంగానే తమ నిరసనను వ్యక్తం చేస్తున్నారని నివేదిక ఇచ్చారు సుప్రీం కోర్టు మధ్యవర్తి* వజాహత్ హబీబుల్లా**

పౌరసత్వ సవరణ చట్టానికి వ్యతిరేకంగా షాహీన్ బాగ్ లో నిరసన ప్రదర్శన జరుపుతున్న ఆందోళనకారులు ఎన్నో బెదిరింపులు పొందుతున్నప్పటికీ శాంతియుతంగానే జరుగుతున్నాయని, మాజీ ప్రధాన సమాచార కమిషనర, సుప్రీం కోర్టు నియమించిన మధ్యవర్తి వజాహత్ హబీబుల్లా సుప్రీం కోర్టుకు ఆదివారం నాడు సమర్పించిన వాంగ్మూలంలో తెలియజేశారు.

ఆ ప్రాంతంలో ప్రయాణికుల రాకపోకలకు ఇబ్బందులు కలిగిస్తున్నది నిరసన ప్రదర్శన కాదనీ, నిరసన స్థలంతో సంబంధం లేని రహదారుల మీద పోలీసులు కల్పించిన ఆటంకాలు మాత్రమేననీ హబీబుల్లా అన్నారు.

హబీబుల్లాను, సుప్రీం కోర్టు న్యాయవాదులు సాధనా రామచంద్రన్, సంజయ్ హెగ్డేలను దేశంలోని అత్యున్నత న్యాయస్థానం గత వారం మధ్యవర్తులుగా నియమించి, షాహీన్ బాగ్ నుంచి నిరసన స్థలాన్ని మార్చడానికి ప్రదర్శకులను ఒప్పించమని కోరింది. ఫిబ్రవరి 19 నుంచి నిరసనకారులతో మధ్యవర్తులు నాలుగు విడతల సంభాషణలు జరిపారు.

ఆ సంభాషణల ఫలితంగా సమర్పించిన వాంగ్మూలంలో హబీబుల్లా, ఆ నిరసన ప్రదర్శన "సిఎఎ–ఎన్ఆర్సి – ఎన్పిఆర్ లకు వ్యతిరేకంగా శాంతియుత అసమ్మతి ప్రకటన"కు ఒక రూపం మాత్రమేనని, ఆ చట్టాన్ని ప్రదర్శనకారులు తమ మనుగడకూ, భవిష్యత్ తరాల మనుగడకూ ప్రమాదకరమైనదిగా భావిస్తున్నారని తెలియజేశారు. "ఆ స్థలంలో ఉన్న స్త్రీలలో వృద్ధులు, మధ్యవయస్కులు, యువతులు, చిన్నారి పిల్లలు కూడ ఉన్నారు. ఆ ప్రదర్శన శాంతియుతంగా ఉన్నది" అని ఆ నివేదిక రాసింది.

నిరసన ప్రదర్శన వల్ల ప్రయాణికులకు ఇబ్బందులు కలుగుతున్నాయనే వాదనను కొట్టివేస్తూ, నిరసనకారులు "ఒక నిరాశామయ వాతావరణంలో తమ అసమ్మతి తెలపడానికి" వచ్చారనీ, "వారి జీవితాలను పణంగా పెడుతున్నార"నీ అన్నారు. "వారు ప్రతిరోజూ ఎప్పుడు దాడి జరుగుతుందో ననే బెదిరింపులను ఎదుర్కొంటూ, వాస్తవంగానే దాడులను కూడ ఎదుర్కొంటూ అక్కడ కూచుంటున్నామని వారు నొక్కి చెప్పారు. వారి మీద దాడులలో భాగంగా కాల్పులు జరిగాయి, వారి మీద ఎడతెగకుండా నిందా ప్రచారం జరుగుతున్నది" అని ఆ నివేదికలో చెప్పారు. గత నెల షాహీన్ బాగ్‌లో జరిగిన కాల్పుల సంఘటనను ఉదహరించారు.

స్థానిక ప్రజలలో, దుకాణదారులలో ఏ ఒక్కరూ నిరసన ప్రదర్శన పట్ల తమ అభ్యంతరం తెలియజేయలేదనీ, పగిఆ భారత పౌరులుగా వారితో సహానుభూతిని ప్రకటించారనీ ఈ నివేదిక తెలియజేసింది. నిరసనకారులు తమమీద "రాజకీయపార్టీలు దేశద్రోహులుగా ముద్ర వేసినందుకు లోతుగా గాయపడి ఉన్నారని" స్థానికులు గుర్తిస్తున్నారు. "షాహీన్ బాగ్ లోని ప్రదర్శనా స్థలం వారికి సురక్షితమైనదిగా ఉంది. దానికి అన్ని వైపుల నుంచీ మార్గాలున్నాయి. అత్యవసర వాహనాలను అక్కడ తక్షణమే, సురక్షితంగా వెళిపోయేలా చూస్తున్నారు" అని కూడ నివేదిక రాసింది.

ప్రదర్శనాస్థలం వద్ద ప్రయాణికులకు కలుగుతున్న ఇబ్బందులకు బాధ్యత పోలీసులదేనని హబీబుల్లా నివేదికలో రాశారు. ప్రదర్శనా స్థలంతో ఎటువంటి సంబంధం లేనప్పటికీ, సమాంతరంగా ఉన్న రహదారుల మీద, అక్కడికి చేరే రహదారుల మీద పోలీసులు అనవసరంగా అవరోధాలు ఏర్పాటు చేశారు. అవి ఆగ్నేయ ఢిల్లీ – నోయిడా మార్గంలో ప్రయాణికులకు ఇబ్బందులు కలిగిస్తూ గందరగోళాన్ని సృష్టిస్తున్నాయి అని నివేదిక రాసింది. అక్కడి ట్రాఫిక్ ను నియంత్రించే బదులు సమాంతర రహదారుల మీద, అక్కడికి చేరే రహదారుల మీద అవరోధాలు ఏర్పాటు చేయాలనే నిర్ణయం తీసుకున్నదెవరో తెలియజేయాలని హబీబుల్లా సూచించారు.

నివేదిక ప్రకారం కాళిందీ కుంజ్ మెట్రో స్టేషన్ వలయం నుంచి జామియా, న్యూ ఫ్రెండ్స్ కాలనీ తదితర ప్రాంతాలకు వెళ్లే ప్రధాన రహదారి మీద, 40 అడుగుల రహదారి మీద అనవసరంగా అవరోధాలు ఏర్పాటు చేశారు. ఓఖ్లా వైపు ప్రవేశాన్ని ఆపివేశారు. ఢిల్లీ, ఫరీదాబాద్ ఎక్స్‌ప్రెస్‌వే మీది నుంచి నోయిడాకు ప్రవేశాన్ని మూసివేశారు. ఆ రహదారి మీద యమునా బ్రిడ్జి మీది నుంచి అక్షర్‌ధామ్ ఆలయానికి ప్రవేశం లేకుండా చేశారు.

షాహీన్ బాగ్ చుట్టూ ఐదు మార్గాలను పోలీసులు మూసివేశారని హబీబుల్లా తెలియజేశారు. ఇలా ప్రవేశాలను మూసివేయడం వల్ల ఆశ్రమ్ దగ్గర, దక్షిణ ఢిల్లీలో కొన్ని ప్రాంతాల దగ్గర, ఇతర నోయిడా – ఢిల్లీ మార్గాలలో పెద్ద ఎత్తున ట్రాఫిక్ జాంలు జరుగుతున్నాయి. అందువల్ల ఆగ్నేయ ఢిల్లీలోనూ, నోయిడాలోనూ ప్రత్యామ్నాయ మార్గాల మీద ఒత్తిడి పెరుగుతున్నది.

శనివారం నాడు జరిగిన తాజా విడత సంభాషణల్లో నిరసనకారులు 13ఎ రహదారిని తెరిస్తే తమకు రక్షణ ఉంటుందని సుప్రీం కోర్టు హామీ ఇవ్వాలనీ, సిఎఎ వ్యతిరేక ప్రదర్శనల సందర్భంగా జామియానగర్ వాసుల మీద పెట్టిన పోలీసు కేసులు ఉపసంహరించాలనీ కోరారు. ఢిల్లీనీ నోయిడానూ కలిపే రహదారులు మరెన్నో ఉండగా తమను తమ ప్రదర్శన స్థలం నుంచి ఎందుకు ఖాళీ చేయమని అడుగుతున్నారని నిరసనకారులు శుక్రవారం నాడు ప్రశ్నించారు. ఇతర ప్రత్యామ్నాయ రహదారులను పోలీసులే అడ్డగిస్తున్నారని తెలియజేశారు.

"వారి మాటలు నిజమో కాదో తేల్చుకోవడానికి మేం రహదారులను పరిశీలించినప్పుడు ఎన్నో రహదారులు ఖాళీగా ఉండడం గమనించాం. ఆ రోడ్ల మీద పోలీసులు అవరోధాలు ఏర్పాటు చేశారు. శుక్రవారం

# ఆర్ఎస్ఎస్ మూకలు ఢిల్లీని తగులబెడుతుంటే...

*ఢిల్లీ తగులబడుతున్నప్పుడు స్వయంగా భారతీయ జనతా పార్టీ రాజ్యసభ సభ్యుడు రాజీవ్ చంద్రశేఖర్‌కు చెందిన ఆసియానెట్ న్యూస్‌కు ప్రత్యక్ష కథనం వినిపిస్తున్నారు* **పి ఆర్ సునిల్**

నేను ఢిల్లీలో గత పదహారు సంవత్సరాలుగా ఉంటున్నాను. ఇంత ఘోరమైన కల్లోలాలను నేనెన్నడూ చూడలేదు.

1984లో సిక్కులకు వ్యతిరేకంగా జరిగిన కల్లోలాల తర్వాత ఢిల్లీ దేశంలోకెల్లా పెద్ద ఘర్షణా ప్రాంతాలలో ఒకటిగా మారిపోయింది.

ఇప్పుడు కూడ జరుగుతున్న విషయాల మీద వార్తలు చెపుతుంటే కూడ బెదిరింపులు వస్తున్నాయి.

జరుగుతున్న హింసాకాండను మా కెమెరాల్లో షూట్ చేయడానికి ప్రయత్నిస్తే, మా మీద దాడులు జరుగుతున్నాయి.

ఇది కేవలం వ్యవస్థీకృత హింస మాత్రమే కాదు, ఇది ప్రణాళికా బద్ధంగా జరుగుతున్న వ్యవస్థీకృత హింస.

కర్రలు పట్టుకున్న గుంపు ఒకటి పోలీసుల ముందు నుంచి దర్జాగా నడిచి వెళ్లడం నేను చూశాను.

ఆ గుంపు నేరుగా ఒక మసీదులోకి వెళ్లింది.

తర్వాత కాసేపటికే మసీదులో నుంచి మంటలూ పొగలూ కనిపించాయి. మసీదు లోపలి నుంచి తుపాకి కాల్పుల చప్పుడు కూడ వినబడింది.

ఈ హింసాకాండ జరుగుతుండగా, పోలీసులు తమ తుపాకులు పట్టుకుని ఊరికే చూస్తూ నిలబడ్డారు. జోక్యం చేసుకోవడానికి ప్రయత్నించలేదు.

రెండు గంటల తర్వాత ఫైర్ ఇంజన్ వచ్చింది గాని అప్పటికే మసీదు పూర్తిగా భస్మీపటలమై పోయింది.

వాళ్లు ఒక్కొక్క వాహనాన్నీ ఆపి పేర్లూ మతమూ అడుగుతున్నారు.

నేను ఈ రిపోర్టింగ్ చేస్తుండగానే వాళ్లు నాదగ్గరికి వచ్చి నా మతమేమిటని అడిగారు.

ఈ హింసాకాండకంతా పోలీసులు మౌనంగా మద్దతు ఇవ్వడం నేను కళ్లారా చూశాను.

హింస జరుగుతున్న దృశ్యాలను మేం చిత్రీకరిస్తే మా మీద రాళ్లు విసిరారు.

ఇప్పుడు ఆ హింసా స్థలాల నుంచి నేను కాస్త దూరం వచ్చాను.

అక్కడ చాల మందిని తమ మొబైల్ ఫోన్లు కూడ బైటికి తీయనివ్వలేదు.

కొద్ది సేపటి క్రితం నేను నందిగిరి పోలీస్ స్టేషన్ సమీపంలో ఉన్నాను. అక్కడ నేను చూసిన దృశ్యం ఆసక్తికరమైనది. ఆ పోలీసు స్టేషన్ లో ఇద్దరంటే ఇద్దరే పోలీసులు ఉన్నారు. స్టేషన్ గేటుకు పెద్ద గొలుసులతో తాళం వేసి ఉంది.

వాహనాలను కుప్పపోసి తగులబెడుతున్నారు. పెద్ద పెద్ద గూండాల గుంపులు కలిసి కట్టుగా తిరుగుతూ మసీదుల మీద దాడి చేస్తున్నాయి. వారి చేతుల్లో తుపాకులూ సుత్తెలూ ఉన్నాయి.

ఇక్కడ జరుగుతున్నది కచ్చితంగా చెప్పాలంటే మతం ప్రాతిపదికపై కొందరిని ఎందుకుని వారి మీద దాడులు చేస్తున్నారు.

ఈ ప్రాంతంలో నేను దాదాపు ఐదు కిలోమీటర్లు ప్రయాణించాను. ఎన్నో చోట్ల తగులబడిన దుకాణాలూ వాహనాలూ చూశాను.

పోలీసులు ఎక్కడా కనబడలేదు.

దాడి చేస్తున్న దుండగులు జై శ్రీరామ్ అని నినాదాలిస్తూ తిరుగుతున్నారు.

ఇక్కడ భారతీయ జనతా పార్టీ నాయకుడు కపిల్ మిశ్రా జాఫరాబాద్‌లో ఇచ్చిన ఉపన్యాసం తర్వాత ఉద్రిక్తతలు పెరిగాయి.

తలచుకుంటే కేంద్ర ప్రభుత్వం ఈ పరిస్థితిని అదుపులోకి తీసుకురావచ్చు. సైన్యాన్ని వినియోగించవచ్చు.

కాని అటువంటి చర్య ఏదీ తీసుకోలేదు.

దుండగుల రాజ్యమే సాగుతున్నది.

*(మంగళవారం సాయంత్రం 5.00 – 6.00 మధ్య బ్యూరో రిపోర్టర్ పి ఆర్ సునిల్ తన టివి చానల్ కు మలయాళంలో లైవ్‌లో వినిపించిన కథనానికి అనువాదం)* వీ

---

నాడు తెరిచిన నోయిడా – ఫరీదాబాద్ రహదారిని కూడ పోలీసులు మళ్లీ మూసివేశారని తెలిసి నాకు విచారం కలిగింది. ఈ పని చేసినవారెవరో సుప్రీం కోర్టుకు జవాబు చెప్పాలి" అని సాధనా రామచంద్రన్ అన్నారు. నిరసనకారుల భద్రత గురించి స్థానిక పోలీసు అధికారితో మధ్యవర్తులు మాట్లాడుతున్నప్పుడు షాహీన్ బాగ్ ప్రదర్శకులు "ఢిల్లీ పోలీస్ పర్ భరోసా నహీ" (ఢిల్లీ పోలీసుల మీద మాకు నమ్మకం లేదు) అని నినాదాలు చేశారు.

శనివారం రాత్రికల్లా ప్రదర్శకులు తమంత తామే 9వ నంబర్ రహదారిని తెరిచి నోయిడాకూ దక్షిణ ఢిల్లీకీ మధ్య వాహనాల రాకపోకలకు అనుమతించారు. అదే సమయంలో దాదాపు 500 మంది, అందులో ఎక్కువమంది స్త్రీలు, జాఫ్రాబాద్ మెట్రో స్టేషన్ దగ్గర గుమిగూడి సిఎఎ వ్యతిరేక ప్రదర్శన నిర్వహించారు. దానితో ఢిల్లీ మెట్రో అధికారులు ఆ స్టేషన్ రాకపోకల మార్గాలను మూసివేశారు.

షాహీన్ బాగ్ నిరసన ప్రదర్శనలు పౌరసత్వ సవరణ చట్టం ఆమోదం పొందిన తర్వాత డిసెంబర్‌లో మొదలయ్యాయి. ఫిబ్రవరి మొదట్లో షాహీన్ బాగ్ ప్రదర్శకులను ఖాళీ చేయించమని వచ్చిన దరఖాస్తుపై స్పందిస్తూ సుప్రీం కోర్టు నిరసన తెల్పడానికి ప్రజలకు ఉన్న హక్కును ఎత్తిపడుతూనే, సంబంధిత పక్షాలన్నిటికీ నోటీసులు ఇచ్చింది. వీ

# 'ఈ నేల చావును నిరాకరిస్తుంది...'

***పౌరసత్వ సవరణ చట్టానికి వ్యతిరేకంగా షాహీన్‌బాగ్‌లో సాగుతున్న ఉద్యమం ఎంతో స్ఫూర్తిదాయకమైందనీ, ప్రజలంతా కలిసికట్టుగా సాగిస్తున్న ఈ ఉద్యమానికి అన్ని వర్గాల నుంచి మద్దతు రావాలనీ అంటున్నారు* రాజేంద్రబాబు అర్విణి**

'షాహీన్‌భాగ్' – ప్రతిఘటనా ఉద్యమానికి మారుపేరు షాహీన్‌బాగ్. పాలకవర్గానికి చెందిన మతంలోకి మారినందువల్ల లేదా స్వచ్ఛందంగా ఆ మతాన్ని అవలంబించి కొన్ని వందల సంవత్సరాలుగా ఈ దేశ సామాజిక వ్యవస్థలో భాగమై ఈ దేశ ఆచారాలు, జీవన శైలిని సంపూర్ణంగా అవగాహన చేసుకున్న ఒక వర్గం తమ సమూహాన్ని కించపరచడం, ఈ దేశం వదిలి వెళ్లిపోయి పక్క దేశంలో తలదాచుకొని కాందిశీకుల లాగా బతకమని బహిరంగంగా ఛీత్కరించడం, ఓ పద్ధతి ప్రకారం రాజకీయ బహిష్కరణకు గురిచేయడం, చివరికి మూకదాడులలో హింసించి చంపేయడం గత అయిదేళ్లుగా మౌనంగా భరించి చివరికి తమ అస్థిత్వము, ములాలు ప్రమాదం అంచుకు నెట్టివేయబడ్డప్పుడు గదిలో బంధించబడిన పిల్లి పులి అయిన రీతిలో రాజ్యాంగ పద్ధతులలో ప్రతిఘటనా ఉద్యమానికి సజీవ శక్తిగా, అనంత ప్రవాహంగా నెలకొన్న పోరాట వేదిక 'షాహీన్‌బాగ్'.

గత 70 ఏళ్లుగా పాకిస్తానీయుల మీద ద్వేషం నింపి, ఇప్పుడు భారతదేశంలోని ముస్లింలనందరిని పాకిస్తానీలని ముద్రవేసి వారిని ఈ దేశంలో రెండవ శ్రేణి పౌరులుగా మార్చే ప్రయత్నంలో భాగంగా, పాలకుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి బతుకునీడ్చే పరిస్థితి కల్పించిన రాజ్యాంగ వ్యతిరేకమైన చట్టాలను మేమొప్పుకోమని తెగించి చెపుతున్న ముస్లిం మహిళల అకుంఠిత దీక్షకు మారు పేరు షాహీన్‌బాగ్. షాహీన్‌బాగ్ ప్రతిఘటనా ప్రదర్శన ప్రారంభమై ఈ వ్యాసం రాసే సమయానికి రెండు నెలలు దాటింది. 2019 డిసెంబర్ 15 నుండి వర్షం పడ్డా, గాలి దుమారం లేచినా, సుడిగుండాలెదురైనా సరే మా దీక్షను కొనసాగిస్తామన్న దృఢ నిశ్చయంతో ముస్లిం మహిళలు, వారికి తోడుగా అన్ని మతాలు, అన్ని కులాల బహుజనులు రాత్రింబవళ్లు షాహీన్‌బాగ్‌లో బైఠాయింపు సమ్మె చేస్తున్నారు. ఆ డిసెంబర్ మాసంలో ఢిల్లీ వీధులు ఎముకలు కొరికే చలిలో వణికిపోయాయి. కాని వారి ప్రతిఘటనా స్వరం ఏమాత్రం చలించలేదు. అక్కడ స్త్రీలు, పురుషులు, ముస్లింలు, ముస్లీమేతరులు గుంపులు గుంపులుగా గుమికూడుతున్నారు. 'జనగనమణ' గీతాలాపనతో ప్రారంభమయ్యే నిరసన కార్యక్రమంలో ప్రతిఘటనా పాటలు పాడతారు. ఉత్తేజపరిచే ఉపన్యాసాలిస్తారు. దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలిస్తారు. రూపమేదైనా రాజ్యాంగబద్ధమైన నిరసననే తెలియజేస్తారు.

కొందరు హడావిడిగా ఇంట్లో పనులు చూసుకుని మళ్లీ రావడానికో, పిల్లల్ని స్కూలుకు పంపించడానికో, స్కూలు నుంచి వచ్చిన పిల్లల అవసరాలు చూసుకోవడానికో, ఆఫీసుకో వెళతారు. ఆ పని అయిపోయిన తర్వాత తిరిగి వస్తారు. తమ దైనందిన పనులు చేసుకుంటూనే ఉద్యమంలో పాల్గొంటున్నారు. వయస్సు పైబడి బక్కచిక్కిన శరీరాలతో కొందరు, నెలల పసికందులను చంకనెత్తుకొని మరికొందరు, అప్పుడప్పుడే నడక నేర్చుకుంటున్న చిట్టి పాపల అరచేతులను తమ చేతుల్లో ఇముడ్చుకొని ఎత్తిన పిడికిళ్లతో నినాదాలను పలికిస్తూ కొందరు, బ్యాక్ ప్యాక్‌లు వేసుకొని కాలేజీ విద్యార్థులు కొంతమంది, సాంఘిక సేవా కార్యక్రమాలలో సతతము మునిగితేలే స్వచ్ఛంద సేవకులు, కళాకారులు, ఒకరేమిటి అన్ని రంగాలకు చెందినవాళ్లు, అన్ని వయసుల వాళ్లు షాహీన్‌బాగ్ ఉద్యమ శిబిరంలో హడావిడిగా తిరుగుతూ, ఉద్యమాన్ని సొంతం చేసుకుంటూ కన్పిస్తారు. కొందరు వీధి నాటకాలు ప్రదర్శిస్తూ ఉంటారు. స్థానిక కవులు ప్రభుత్వాన్ని అభిశంసిస్తూ మైకులో కవిత్వం వినిపిస్తుంటారు. కులాలు, మతాలకతీతంగా అక్కడ ప్రతిఘటనా గొంతుకలతో నిరసన గళాలు వినిపిస్తూ ఉంటారు. వారు కోరుతున్నదల్లా డిసెంబర్‌లో భారత పార్లమెంట్‌లో మూకబలంతో బిజెపి ప్రభుత్వం ఆమోదింపజేసుకున్న అప్రజాస్వామిక, రాజ్యాంగ వ్యతిరేక పౌరసత్వ సవరణ చట్టాన్ని, దానికి సంబంధించిన రెండు ఇతర చట్టాలను వెనక్కు తీసుకోమని. 'భారత పౌరులమైన మేము పౌరసత్వ సవరణ చట్టం, జాతీయ పౌర జాబితా తయారు చేయడంలో ప్రతిపాదించిన మార్పును ఆమోదించం' అని చెవిటి పాలకుల కర్ణభేరీలు ఛిద్రమయ్యేలా నినదించడమే వారి లక్ష్యం. అబ్బురపరిచే విషయమేమిటంటే వారికి నాయకుడెవరూ లేరు. ముస్లిం మహిళలు, పేద మహిళలు అన్నింటా ముందుకొచ్చి స్వచ్ఛందంగా గొంతు విప్పుతున్నారు. ఉద్యమ ఏర్పాట్లు అన్నీ చూసుకుంటున్నారు. ముస్లిం మత ప్రవక్త ఒకతను వచ్చి ఇస్లాం మతానికి సంబంధించి ఏదో ప్రవచనం చెప్పబోతే మహిళలు ఆయన ముందు నుంచి మైకు లాక్కొని 'ఇది మతానికి సంబంధించిన విషయం కాదు, దేశానికి రాజ్యాంగానికి సంబంధించిన విషయం. ఇక్కడ మత ప్రసక్తి లేదు. మత ప్రస్థావన లేకుండా, రాజకీయాలు లేకుండా మీరు ఉద్యమకారునిగా వస్తే మేము ఆదరిస్తాం. ఒక ముల్లాగానో, ఒక మౌల్వీ లాగానో వస్తే మేం తరిమి కొడ్తాం' అని ఛీత్కరించారు. మహిళలు, ఉద్యమకారులు అందరూ కలిసి నిర్ణయాలు తీసుకుంటారు. అందరూ వాటిని అమలు పరుస్తారు. ఏ రాజకీయ పార్టీ వీరికి నాయకత్వం వహించడం లేదు. అందరూ స్వచ్ఛందంగా గొంతు విప్పుతున్నారు. ప్రభుత్వాన్ని, పోలీసులను నిలదీస్తున్నారు.

షాహీన్‌బాగ్ సందర్భం పత్రికల ద్వారా తెలుసుకుంటుంటే నాకు 1960వ దశకంలో మహా ఉత్తేజకరంగా జరిగిన వియత్నాం యుద్ధం గుర్తుకు వస్తున్నది. ఆ పోరాటాన్ని వర్ణిస్తూ ఓ కవి రాసిన తెలుగు అనువాదం సారాంశం ఇక్కడ పేర్కొంటున్నాను. 'అక్కడ మహిళలు ఒక చేత్తో గరిట పట్టుకొని వంట చేస్తూ, మరొక చేత్తో తుపాకి ధరించి ముష్కర అమెరికన్ సైనికులతో పోరాటం చేస్తున్నారు. అక్కడ మహిళా టీచర్లు ఒక చేత్తో చాక్‌పీస్‌తో పిల్లలకు పాఠాలు చెపుతూ, మరొక చేత్తో

తుపాకీ ధరించి పోరాడుతున్నారు. అక్కడి రైతు ఒక చేత్తో నాగలి పట్టుకొని పొలం దున్నుతూ, మరొక చేత్తో తుపాకీ ధరించి శత్రు సైనికులతో భీకర యుద్ధం సాగిస్తున్నాడు...' ఇలా నడుస్తుంది ఆ కవిత. షాహీన్‌బాగ్ లోనూ అంతే. మహిళలు తమ దైనందిన జీవితాలలో తమ విధులు నిర్వర్తిస్తూనే మిగిలిన సమయమంతా పోరాట వేదికపైనే గడుపుతున్నారు. ఆ మహిళలలో చాలా మంది బురఖాల చాటున రక్షిత జీవితాలు గడుపుతూ ఇంతకాలం జీవించిన వాళ్లే. వాళ్లు వీధుల్లోకి వచ్చి పోరాటాలలో పాల్గొనడం చారిత్రాత్మకమే. తమ పిల్లల భవిష్యత్తు భరోసా కోసం వారు వీధుల్లోకి వచ్చారు. స్కూళ్లకు, కాలేజీలకు వెళ్లే పిల్లలు కూడా షాహీన్‌బాగ్ పోరాట వేదికనే తమ ఇల్లుగా భావించుకున్నారు. పాఠశాలల నుండి, కళాశాలల నుండి నేరుగా పుస్తకాలతో అక్కడికే వచ్చి చదువుకొని, హోం వర్క్ చేసుకొని అక్కణ్నుంచే విద్యాలయాలకు వెళుతున్నారు. రోజు లంగర్ (సామూహిక భోజన శాల)తో రెండు పూటలా పంజాబు నుండి సిక్కు రైతులు ట్రక్కులలో వస్తున్నారు. భోజన సదుపాయాలు సమకూరుస్తున్నారు. జలంధర్ నుండి వచ్చిన పర్మిందర్ సింగ్ 'రాజ్యాంగ వ్యతిరేకమైన ఈ చట్టాన్ని మేం కూడా వ్యతిరేకిస్తున్నాం. మా అక్కలకు, చెల్లెల్లకు బాసటగా మేం ఇక్కడికి వచ్చాం' అన్నాడు.

ఢిల్లీలోని జామియా మిలియా ఇస్లామియా విశ్వవిద్యాలయం సమీప ప్రాంతం షాహీన్‌బాగ్. డిసెంబర్ 13 నుండి 15 వరకు జామియా ఇస్లామియా విద్యార్థులపై పోలీసులు చేసిన దుశ్చర్యలు కళ్లారా చూసిన తర్వాత స్థానికులకు విద్వేషపూరితమైన, కుట్రపూరితమైన ఈ చట్టాల వెనుక ప్రభుత్వం ఆంతర్యం అర్థమైంది. ఈ చట్టాలను అడ్డుకోకపోతే రేపు తమ భవిష్యత్తు, తమ పిల్లల భవిష్యత్తు అగమాగమవుతుందని వారికర్థమైంది. మేము భారత పౌరులమేనని నిరూపించుకోవడానికి ఈ దేశంలో పుట్టిన వాళ్లు ముఖ్యంగా ముస్లిం మతస్థులు పడవలసిన అగచాట్లు నిరూపించుకోలేకపోతే వారు అనుభవించబోయే ఘోరాలు వాళ్ల కళ్లముందు కదలాడి ఉంటాయి. 'పోరాడితే పోయేదేముంది... బానిస సంకెళ్లు తప్ప' అన్న స్ఫూర్తితో నడుం బిగించారు.

వారి ఉద్యమమంతా మూడు అంశాల చుట్టూ నిర్మాణం చేసుకుంటూ ఉన్నారు. ఆ మూడు అంశాలు: అహింసనే ఆయుధంగా ధరించమని, అన్ని మతాల మధ్య సామరస్యం నెలకొని భారతదేశం లౌకిక రాజ్యంగా మనగలగాలని ఉద్బోధించిన గాంధేయ సిద్ధాంతాలు, భారతీయులంతా సమానులేనని సమానత్వం పునాదిగా రాజ్యాంగాన్ని ఎత్తిపట్టిన అంబేద్కర్ ఆలోచనా ధోరణి, ప్రపంచ ఉద్యమాల నినాదం 'ఇంక్విలాబ్ జిందాబాద్'. ఈ మూడు అంశాలు కేంద్రంగా పెల్లుబికిన షాహీన్‌బాగ్ ఉద్యమం ఢిల్లీలోని ఖురేజి, తుర్కమన్ గౌట్, జామా మసీద్ లాంటి ఇతర ప్రదేశాలకే కాక, దేశంలోని ఎన్నో ఇతర ప్రాంతాలకు విస్తరించింది. జార్ఖండ్‌లోని వాసీపూర్, రాజస్థాన్‌లోని జైపూర్, ఉత్తరప్రదేశ్‌లో అలహాబాద్, కాన్పూర్, ఇటానా, లక్నో, బీహార్‌లోని పాట్నా, గయా, ముంబాయిలో ఆజాద్ మైదాన్, కోల్‌కత్తాలో పార్క్ సర్కస్ మైదాన్ లాంటి పలుచోట్ల షాహీన్‌బాగ్ మాదిరి బురఖాలు ధరించిన స్త్రీలు రోడ్లమీదకొచ్చి రాత్రింబవళ్లు బైఠాయించి సమ్మె ప్రారంభించారు. అందుకే షాహీన్‌బాగ్ ప్రతిఘటనా ఉద్యమాలకు ఒక ప్రతీకగా రూపొందింది. అన్నీ శాంతియుతంగా నడుస్తున్న ఉద్యమాలే. ఉత్తరప్రదేశ్‌లో మాత్రం పోలీసులు మహిళలతో కర్కశంగా ప్రవర్తిస్తూ, ఉద్యమాన్ని చిన్నాభిన్నం చేసే ప్రయత్నం చేశారు. లక్నోలోని షంటాపూర్‌లో నిరసన దీక్ష చేపట్టిన 60 మందికి పైగా మహిళలపైన మత విద్వేషాలు రెచ్చగొడుతున్నారని కేసు బనాయించారు. వారు కూర్చున్న టెంట్‌ను పీకేశారు. ఆనాడు బ్రిటిష్ పరిపాలకులు గాంధీ తరహా సత్యాగ్రహాన్ని సహించలేదు, నేడు సోకాల్డ్ స్వతంత్ర భారత పరిపాలకులూ సహించడం లేదు. షాహీన్‌బాగ్ శిబిరం దగ్గర ఉద్యమకారులు ఒక గ్రంథాలయం కూడా ప్రారంభించారు. ఎన్నో పుస్తకాలు ప్రదర్శనకు, అక్కడే కూర్చొని చదువుకోవడానికి పెట్టారు కార్యకర్తలు. ఆ గ్రంథాలయం పేరు 'ఫాతిమా షేక్, సావిత్రిబాయి పూలే గ్రంథాలయం'. అక్కడ స్వాతంత్రోద్యమం గురించిన పుస్తకాలు, గాంధీ రచించిన, గాంధీపై రాయబడ్డ పుస్తకాలు. అంబేద్కర్ రచనలు, భారత రాజ్యాంగం వంటి పుస్తకాలు ఎన్నో అందుబాటులో ఉన్నాయి.

ఇది ఇలా ఉంటే హోం మంత్రి అమిత్‌షా పౌరసత్వ సవరణ చట్టాన్ని ఉపసంహరించే ప్రసక్తే లేదని, దీనికి వ్యతిరేకంగా ప్రతిఘటనా శిబిరాలు నిర్వహిస్తున్న వాళ్లు ఎన్ని నాళ్లు సమ్మె చేసినా మేం దిగివచ్చేది లేదని తేల్చి చెప్పాడు. భారతీయ జనతా పార్టీ అధ్యక్షుడు జె.పి. నడ్డా ఇంకా ఒకడుగు ముందుకు వేసి 'ప్రతిఘటిస్తున్న గ్యాంగ్ మాకు ఓటు వేసేవాళ్లు కాదు. ఇలాంటి వాళ్లతో మేము మా సమయాన్ని వృథా చేసుకోం' అని అనాగరికంగా మాట్లాడాడు. షాహీన్‌బాగ్ ప్రతిఘటన వలన ప్రజలు ఇబ్బందులు పడుతున్నారని, రాకపోకలకు అసౌకర్యం కలుగుతున్నదని, వారి శిబిరాన్ని ఎత్తివేయాలని ఆదేశించాలని అభ్యర్థిస్తూ ఒక న్యాయవాది సుప్రీంకోర్టులో ప్రజా ప్రయోజన వ్యాజ్యం ఒకటి దాఖలు చేశాడు. దానికి సమాధానంగా అత్యున్నత న్యాయస్థానం 'దేన్నయినా ప్రతిఘటించే హక్కు ప్రజలకు ఉంటుందని, ఆ హక్కు వలన ఇతరులు ఇబ్బంది పడకూడదని, కొందరి ప్రతిఘటించే హక్కు ఇతరుల హక్కులకు ఆటంకంగా మారకూడదని' వ్యాఖ్యానిస్తూ ఈ సమస్యలను సంప్రదింపుల ద్వారా పరిష్కరించాలని ఆలోచించింది. అందుకుగాను సీనియర్ న్యాయవాదులతో ఒక కమిటీ వేసింది. ఆ కమిటీలో సభ్యులుగా సంజయ్ హెగ్డే, సాధనా రామచంద్రన్ ఉన్నారు. వారికి సహాయకునిగా రిటైరయిన విశ్రాంత ప్రభుత్వ అధికారి వాజాహట్ హబీబుల్లా ఉన్నారు.

వారు ప్రతిష్టంభన తొలగించే ఉద్దేశంతో సుప్రీంకోర్టు ఆర్డరు కాపీతో షాహీన్‌బాగ్ వద్దకు వెళ్లినప్పుడు వారికి వచ్చిన ఏకగ్రీవ సమాధానం: 'పౌరసత్వ సవరణ చట్టం, జాతీయ పౌర జాబితా, జాతీయ పౌరుల రిజిస్టర్‌లను వెనక్కు తీసుకుంటేనే మేం మా ఉద్యమాన్ని మానుకుంటాం. లేదంటే ఏమైనా జరగనీ మా ప్రతిఘటనను కొనసాగిస్తాం'. అక్కడ ఉన్న పత్రికా విలేకరులు అడిగారట 'మిమ్మల్ని అరెస్టు చేస్తారన్న భయం లేదా మీకు' అని. అక్కడే ఉన్న ఓ పండు ముసలి ఓ నవ్వు నవ్వి 'మేము అరెస్టులకు సిద్ధం. మమ్మల్ని నింపడానికి ఈ దేశపు జైళ్లు సరిపోతాయా ఆలోచించుకోండి' అని సమాధానమిచ్చింది.

'సుప్రీంకోర్టు మీ ప్రతిఘటనా హక్కును గౌరవించింది. మీ సమస్యలన్ని వింటాం. మీ బాధలు, మీ భయాలు అన్నీ దేశ అత్యున్నత న్యాయస్థానం ముందుంచుతాం. వాటి పరిష్కారం కోసం మనమంతా కలిసికట్టుగా ఆలోచిద్దాం' అని సాధనా రామచంద్రన్ కమిటీ వారిని అనునయించి ప్రతిఘటనా శిబిరాన్ని మరో చోటుకు మార్చేటట్లు లేదా కొంత కాలానికి వాయిదా వేసుకొనేటట్లు ఒప్పించాలని ప్రయత్నించింది. కానీ, తమపై తుపాకులు ప్రయోగించినా తాము అక్కణ్నుంచి ఒక్క అంగులమైనా కదిలేది లేదని చాలా దృఢంగా, చాలా ప్రశాంతంగా సమాధానమిచ్చారు. 'ప్రజల రాకపోకలకు ఇబ్బంది అనే మాట

# భావ వ్యక్తీకరణ రాజద్రోహమా?

*కేంద్ర ప్రభుత్వం ప్రజల రాజ్యాంగబద్ధమైన భావ వ్యక్తీకరణ హక్కును కూడా అణచివేస్తోందనీ, దీనికి వ్యతిరేకంగా ప్రజలంతా ఐక్యంగా గొంతెత్తి ఉద్యమించాలనీ అంటున్నారు* **అరణ్య**

షార్జిల్ ఇమామ్ జె.ఎన్.యు రీసెర్చ్ స్కాలర్. ఎన్ఆర్సి, సిఎఎలకు వ్యతిరేకంగా నిరసనలు జరుగుతున్న షహీన్‌బాగ్ వేదిక వ్యవస్థాపకులలో ఒకరు. ప్రస్తుతం ఇతన్ని దేశ వ్యతిరేక వ్యాఖ్యలు చేశారని ఆరోపిస్తూ అరెస్టు చేశారు. బీహార్‌లోని జహానాబాద్ జిల్లాకు చెందిన షార్జిల్ ఇమామ్ జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం సెంటర్ ఫర్ హిస్టారికల్ స్టడీస్‌లో పిహెచ్‌డి విద్యార్థి. అకడమిక్‌గా మొదటి నుంచి చాలా ప్రతిభావంతుడైన విద్యార్థి. ఐఐటి ముంబైలో బిటెక్,ఎంటెక్ పూర్తి చేసి జె.ఎన్.యులో ఆధునిక చరిత్రలో ఎంఏ, ఆధునిక భారత చరిత్రలో ఎంఫిల్ చేశాడు. ప్రస్తుతం అదే సబ్జెక్టులో అదే విశ్వవిద్యాలయంలో పిఎచ్.డి చేస్తున్నాడు.

కేంద్ర ప్రభుత్వం అన్యాయంగా దేశ ప్రజలపై రుద్దుతున్న ఎన్ఆర్సి, సిఎఎలకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా నిరసనలు పెల్లుబుకుతున్న నేపథ్యంలో అలీగడ్ ముస్లిం యూనివర్సిటీ విద్యార్థులు ఆందోళన ప్రదర్శనలు చేశారు. శాంతియుతంగా సాగుతున్న ఈ ప్రదర్శనలపై విరుచుకుపడిన పోలీసులు అనుమతి లేకుండా యూనివర్సిటీలోకి ప్రవేశించి లైబ్రరీలో, మెస్‌లో, హాస్టళ్లలో, చివరకు టాయిలెట్లలోకీ చొరబడి విద్యార్థులను తీవ్రంగా కొట్టారు. అమ్మాయిలను లాక్కెళ్లి వారి రహస్యాంగాలపై చేతులు వేస్తూ అసభ్యంగా ప్రవర్తించారు. తీవ్రమైన పోలీస్ హింస దేశం మొత్తాన్ని దిగ్భ్రాంత పరిచింది. ప్రభుత్వ చట్టాన్ని వ్యతిరేకిస్తూ శాంతియుతంగా నిరసన చేపట్టడం ప్రజాస్వామ్య దేశంలో అంత పెద్ద నేరమా? అనే ప్రశ్న దేశ ప్రజలలో చెలరేగింది. ఈ సంఘటనకు సమాధానంగా అలీగడ్ ముస్లిం యూనివర్సిటీ విద్యార్థులు ముఖ్యంగా అమ్మాయిలు బయటకు వచ్చి ఢిల్లీలోని బస్టాప్‌లో సిఎఎ వ్యతిరేక ఆందోళనలు చేపట్టడం ప్రారంభించారు. ఈ ఆందోళనలు దేశ వ్యాప్తంగా ప్రజా ఉద్యమాల పట్ల ఆశను పెంచాయి. దేశంలో ఫాసిస్ట్ బిజెపి ప్రభుత్వాన్ని నిలువరించే భిన్న ఉద్యమాలకు షాహీన్‌బాగ్ దిక్సూచి అయింది.

ఈ షాహీన్‌బాగ్ ఉద్యమ రూపకల్పనలో షార్జిల్ ఇమాం ఒకరు. ఈ ఉద్యమ కమిటీ సమన్వయ సంఘంలో షార్జిల్ ఒకరు. షాహీన్‌బాగ్ ఉద్యమంలో చాలా చురుగ్గా ఉన్నాడు. ఓవైపు ఉద్యమం నడుస్తుంటే దేశవ్యాప్తంగా సిఎఎ ఎన్ఆర్సిలకు వ్యతిరేకంగా ప్రజలకు అవగాహన కల్పించే పనికి వివిధ యూనివర్సిటీల విద్యార్థులు, ప్రొఫెసర్లు, ప్రజా సంఘాల సభ్యులు పూనుకున్నారు. అందులో భాగంగానే ఢిల్లీ, దాని చుట్టుపక్కల ప్రాంతాలలో ప్రసంగిస్తూ వచ్చాడు.

జనవరి మొదట్లో ఆలిఘడ్ యూనివర్సిటీలో షార్జిల్ ఇచ్చిన ఉపన్యాసంలో వివాదాస్పద, దేశ వ్యతిరేక వ్యాఖ్యలున్నాయని ఆరోపిస్తూ ఢిల్లీ పోలీసులు షార్జిల్‌ను బీహార్‌లోని జెహనాబాద్‌లో అరెస్టు చేశారు.

అబద్ధమని, రోడ్డులో కేవలం 100 నుండి 150 మీటర్ల వరకు మాత్రమే మా టెంటు ఆక్రమించిందని, మేం అంబులెన్స్‌లకు, స్కూలు బస్సులకు ఎలాంటి ఆటంకాలు కలిగించకుండా వాటికి దారి ఇస్తున్నామని' డిసెంబర్ 16 నుండి ఉద్యమంలో పాల్గొంటున్న ఓ నడిమి వయస్సు మహిళ వివరించింది. 'దారినంతా మేం ఆక్రమించలేదు. పాదాచారులు, వాహనాలు తిరగడానికి కావల్సినంత జాగా వదిలాం. అడ్డంకులు సృష్టిస్తున్నది పోలీసులే. భద్రత పేరుమీద పోలీసులు ప్రత్యామ్నాయ మార్గాలైన రెండు రోడ్లను మూసేశారు. ఆ రెండు రోడ్లు తెరవండి. ఎవరికీ ఏమీ ఇబ్బంది ఉండదు. మాపై అభియోగం మోపడానికి పోలీసులు చేసిన కుట్రనే ఇది' అని బిల్కిస్ అనే వృద్ధ మహిళ వాదించారు. ఆమె ఆవేదనతో 'మమ్మల్ని దేశ ద్రోహులంటున్నారు వీరు. మేము బ్రిటిష్ వారిని దేశం నుండి తరిమివేస్తున్నప్పుడు ఈ నరేంద్రమోడీ, అమిత్‌షాలు ఎక్కడున్నారు? మీరు ఈ చట్టాలను ఉపసంహరించండి. మేం ఇక్కణ్నుంచి వెంటనే కదులుతాం' అని అన్నారు. ఆమె అలా చెపుతుంటే చుట్టూ గుమిగూడిన వారంతా పెద్దఎత్తున చప్పట్లతో ఆమె మాటలను స్వాగతించారు. ఇంకొక మహిళ కన్నీళ్లు స్రవిస్తుండగా గాద్గదిక స్వరంతో కోర్టు నియమించిన మధ్యవర్తులతో 'మేం రాజ్యాంగాన్ని రక్షించమని, దాని ప్రకారమే నడుచుకొమ్మని కోరుతున్నాం. అందుకే మా ఈ ప్రతిఘటనోద్యమం. రాజ్యాంగాన్ని కాపాడమని మేం అడుగుతూ ఉంటే రాకపోకలకు అసౌకర్యం కలుగుతున్నదని కొందరు విమర్శిస్తున్నారు. అర్ధరాత్రి మేమిక్కడ కూర్చుని చలిలో వణికిపోతున్నాం. మా పిల్లల్ని కూడా మాతోనే ఉంచుకొని వారినీ బాధపెడ్తున్నాం. రాజ్యాంగ బద్ధంగా నడుచుకొమ్మని పాలకులను కోరడానికి మేమీ అసౌకర్యాన్ని భరిస్తున్నాం మేం ఏ రోడ్డుకు, ఎవరి రాకపోకలకు అడ్డంకులు కల్పించలేదు. కేంద్ర ప్రభుత్వమే దేశంలో స్వేచ్ఛా స్వాతంత్రాలకు ప్రతిబంధకంగా తయారైంది'.

ఏది ఏమైనా ముస్లిం మహిళాలోకం ఒక కొత్త ప్రపంచాన్ని ఆవిష్కరించింది. వారు పరదాల చాటు నుండి బయటికి వచ్చి రోడ్ల మీద 'ఆజాదీ' నినాదం ఇచ్చారు. పితృస్వామ్య భావజాలాన్ని సవాలు చేశారు. రాజ్యాంగ బద్ధులుగా మెలగండని పాలకులను హెచ్చరించారు. ఈ విషయంలో తదుపరి మలుపులు ఏ విధంగా ఉంటాయో వేచి చూడవలసిందే.

*(ఈ వ్యాసంలో పేర్కొన్న విషయాలకు ఆధారం న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్, టైమ్స్ ఇండియా, కాలవాన్ పత్రికలు)*

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్)* వీ

అతని పై దేశద్రోహ కేసు పెట్టారు. జామియా మిలియా ఇస్లామియాలో షార్జిల్ చేసిన ప్రసంగాన్ని ఈ సెడిషన్ చార్జ్‌లకు ఆధారంగా ఢిల్లీ పోలీసులు చూపించారు. పైగా ఈ ప్రసంగం ఎన్ఆర్‌సి, సిఎఎ వ్యతిరేక ఆందోళనల్లో భాగంగా ఇచ్చింది కాదని, దీని వెనుక పెద్ద ప్రణాళిక ఉందని ప్రచారం చేస్తూ వచ్చారు. పట్నా దగ్గరి పుల్వారిషరీఫ్‌లో ప్రసంగించిన తర్వాత షార్జిల్ అజ్ఞాతంలోకి వెళ్లాడని, బీహార్, ఢిల్లీ పోలీసులు సంయుక్తంగా అతన్ని అరెస్టు చేశామని చెప్పుకొచ్చారు. నిజానికి షార్జిల్ ఆ సమయంలో తన స్వకుటుంబీకుల స్థలమైన జెహనాబాద్ లోని కాకోకు వెళ్లాడు.

అసలు ఈ వ్యవహారాన్ని అర్థం చేసుకోవాలంటే షార్జిల్ ఇమాం ఇచ్చిన ఉపన్యాసాల గురించి ఒకసారి చూద్దాం. సోషల్ మీడియాలో ప్రసారమైన రెండు వీడియోల ఆధారంగా పోలీసులు వివాదాస్పదమని ప్రస్తావిస్తున్న వాటిలో షార్జిల్ మొదటి ఉపన్యాసం ఆయన జనవరి మొదట్లో అలీఘడ్ విశ్వవిద్యాలయంలో చేసింది. ఇది ఎన్ఆర్‌సి, సిఎఎ లను విమర్శిస్తూ చేసిన ఉపన్యాసం. దీని తాలూకు వీడియో జనవరి17న యూట్యూబ్‌లో ఉంది. ఆరు రోజుల తర్వాత అతనిపై ఈ వీడియో ఆధారంగా సెడిషన్ కేసు పెట్టారు. ఈ ఉపన్యాసంలో షార్జిల్ సిలిగురి, చికెన్స్ నెక్‌లు భారతదేశం నుంచి విడిపోవాలనే ఉద్యమాలు జరగాలని, అప్పుడే పాలకవర్గాలు దిగివచ్చి ప్రజల ఆకాంక్షలు తీరుస్తాయని, అసోంలో ఎన్ఆర్‌సిని ఆపేస్తాయని షార్జిల్ అభిప్రాయం.

సిలిగురి లేదా చికెన్స్ నెక్ అనేది దాదాపు 22 కిలోమీటర్ల ప్రాంతం. పశ్చిమ బెంగాల్‌లో ఈ ప్రాంతం ఈశాన్య రాష్ట్రాలను ఇతర భారతదేశం తో కలుపుతుంది. ఈ సిలిగురి కారిడార్‌కు మరో వైపు నేపాల్, బంగ్లాదేశ్‌లు ఉంటాయి. ఈ ఇరుకైన, చిన్న ప్రాంతం తప్ప ఈశాన్య రాష్ట్రాలను భారతదేశంతో కలిపే మరే ఇతర సంధానం లేకపోవడంతో భౌగోళికంగా ఇది చాలా కీలకమైన, ప్రాధాన్యత కలిగిన ప్రాంతం. చాలాసార్లు మనకు వినిపించే డోక్లాం ప్రాంత వివాదంలో చైనా ఆధిపత్యం చేయాలనుకునేది ఈ చికెన్ నెక్ పైననే. అలాంటి భౌగోళిక ప్రాముఖ్యత కలిగిన ఈ ప్రాంతాన్ని దిగ్బంధిస్తే భారత ప్రభుత్వ దృష్టి అసోంపై పడి అసోం ప్రజలు తీవ్రంగా ఎదుర్కొంటున్న ఎన్ఆర్‌సి, సిఎఎలను ఉపసంహరించుకోవచ్చని ఆ దిశగా ప్రయత్నాలు జరగాలని బహుశా షార్జిల్ అభిప్రాయం కావచ్చు.

అయితే షార్జిల్ ప్రకటించిన ఆ అభిప్రాయం కొందరికి, ముఖ్యంగా ప్రభుత్వానికి తప్పే అనిపించివచ్చు. కానీ ప్రజాస్వామ్య దేశంలో తప్పుడు అభిప్రాయం అయినాసరే, అభిప్రాయాన్ని ప్రకటించే స్వేచ్ఛ ప్రతి పౌరుడికి ఉంటుంది. ఉండాలి కూడా. కానీ ఒక అభిప్రాయం అది తప్పు అయినా సరైనదైనా అసలు అభిప్రాయమే కలిగి ఉండే హక్కే లేదనే ధోరణి నియంతృత్వ ఆధిపత్య ధోరణి అవుతుంది. అందులోనూ ప్రభుత్వం అట్లాంటి ధోరణి కలిగి ఉండడం ప్రజాస్వామ్య మనుగడకే ప్రమాదం. ఫలానా అభిప్రాయం ఉంది కనుక, దాన్ని ప్రకటించాడు కనుక ఒక వ్యక్తిని నిర్బంధిస్తాననే హద్దులు లేని అధికారం ఫాసిస్ట్ పరిపాలనలోనే పాలకులకు చెందినదవుతుంది కానీ ప్రజాస్వామ్యంలో అందుకు అవకాశం లేదు. దేశంలో మెజారిటీ ప్రజలు భావిస్తున్నట్లుగా నరేంద్ర మోడీ ప్రభుత్వం ఇలాంటి ఫాసిస్ట్ పనుల వైపే ఆసక్తి చూపుతున్నదని షార్జిల్ అరెస్టు మరొకసారి నిరూపించింది.

ఇక మరోసారి షార్జిల్ విషయానికి వద్దాం! అలీగడ్ ముస్లిం విశ్వవిద్యాలయంలో ఇచ్చిన ఉపన్యాసంలోని అభిప్రాయాన్నే షార్జిల్ జామియా మిలియా ఇస్లామియాలోనూ ప్రకటించాడు. ఈ ఉపన్యాసాల ఆధారంగా పోలీసులు దాఖలు చేసిన కేసుపై పటియాల హౌస్ కోర్టు షార్జిల్‌ను ఐదు రోజుల పోలీసు రిమాండ్‌కు పంపింది. పనిలో పనిగా ఆయన చేసిన ఈ వ్యాఖ్యల వెనక ఆయనపై పాపులర్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా (పిఎఫ్ఐ) ప్రభావం ఉందని పోలీసులు చెబుతున్నారు. ఈ సంస్థను బిజెపి మొదటి నుంచి ఉగ్రవాద సంస్థ అని ప్రచారం చేసి చివరకు దాన్ని నిషేధం వైపుకు నెట్టింది. ఇప్పుడు ఈ సంస్థతో సంబంధాలు అంటగట్టి షార్జిల్‌పై మరింత ఉచ్చు పెంచుదామనేది పోలీసుల ప్రణాళిక. అందుకే షార్జిల్‌కు సంబంధం లేని పిఎఫ్ఐను ముందుకు తెచ్చారు. అలాగే ఎన్ఆర్‌సి, సిఎఎలకు వ్యతిరేకంగా ఒక కరపత్రం తయారు చేశాడని, అందులో ప్రజలను తప్పుదోవ పట్టించే విషయముందని, దాన్ని మసీదులో పంచాడని ఆరోపించారు. నిజానికి ఆ కరపత్రం రాశాడనడానికి, మసీదుల్లో పంచాడనడానికి ఎలాంటి ఆధారాలు లేవు. ఆధారాలు లేకున్నా తప్పుడు ప్రకటనలు చేస్తూ వచ్చారు. నిజానికి పోలీసులు చూపెడుతున్న ఈ వీడియోలు పూర్తి ప్రసంగ పాఠం ఉన్నవి కావు. కేవలం కొంత భాగమే. ప్రసంగంలోని మొత్తం భాగాన్ని బైటపెట్టకుండా ముందు, వెనకలను కత్తిరించి, కొన్ని వాక్యాలు మాత్రమే చూపించి దాని ఆధారంగా కేసు పెట్టడం ఎంతవరకు సమంజసం? బిజెపి ప్రకారం షార్జిల్ ఒక దేశ వ్యతిరేకి. ఆ పార్టీ కనుసన్నల్లో నడిచే పోలీసు యంత్రాంగం కూడా షార్జిల్‌ను భారత వ్యతిరేకిగా చూస్తున్నది. అందులో భాగంగానే ఈ కేసులు.

అయితే షార్జిల్ ఇమాం ఏ ఒక్క భావజాలానికో సంబంధించిన వాడు కాదని ఆయన ప్రసంగాల ద్వారా తెలుస్తున్నది. సమకాలీనంగా అనేక సమస్యలపైన, ప్రజల బాధలపైన గళమెత్తుతున్నాడు షార్జిల్. ప్రజా సమూహాలను కదిలించే పద్ధతిలో, క్రమంలో లెఫ్ట్ పార్టీల గుత్తాధికారాన్ని షార్జిల్ ప్రశ్నించాడు. మిలిటరీని ఉపయోగించి చరిత్రలో ప్రతిపక్ష గళాలను అణగదొక్కడాన్ని, సాంప్రదాయిక మతవర్గాల అభివృద్ధిని, ఇస్లాం వ్యతిరేక మైనారిటీ వ్యతిరేక ధోరణులను, వలస వ్యతిరేక ఉద్యమాల అణిచివేతను, కార్పొరేట్ శక్తులు సమాజంపై ఆధిపత్యం చేలాయించడం వంటి అనేక అంశాలపైన షార్జిల్ కేంద్రీకరించి తన మాటలను రాజ్యానికి వ్యతిరేకంగా ఎక్కుపెట్టాడు.

జెఎన్‌యు విద్యార్థిగా 2016 నుంచి సెడిషన్ కేసును ఎదుర్కొంటున్న కన్నయ్య కుమార్‌ను కూడా షార్జిల్ విమర్శించాడు. అతని ఆజాదీ నినాదాలను వదిలేసి ప్రజలు ఉద్యమాల వైపు వెళ్లాలని సూచించాడు. అయితే కన్నయ్య కుమార్ 2016 నుంచి ఈరోజు వరకు బిజెపి ఫాసిస్ట్ మతతత్వ పాలనకు వ్యతిరేకంగా దేశమంతటా అలుపులేకుండా తిరుగుతూ ప్రజలను చైతన్య పరుస్తూ వస్తున్నాడు. కానీ షార్జిల్ ఆయననూ విమర్శించాడు. ఇట్లా తనకున్న భావ వ్యక్తీకరణ స్వేచ్ఛను ఉపయోగించుకుని విద్యార్థులను, ప్రజలను సమీకరిస్తూ వస్తున్న షార్జిల్‌పై మోడీ ప్రభుత్వం కక్ష సాధింపు చేపట్టింది. అందుకే అతని రెండు ఉపన్యాసాలను చూపెడుతూ అతన్ని అరెస్టు చేసింది.

2014 నుంచి ఇప్పటివరకూ వందలాది వేలాది మంది ప్రశ్నించిన

# రంజన్ గోగోయ్ తుచ్ఛుడే, మరి మీరేం చేస్తున్నారు మిలార్డ్!

*భాజపా పాలనలో ధ్వంసమైపోతున్న న్యాయవ్యవస్థ గురించి, ప్రత్యేకంగా సుప్రీంకోర్టు గురించి ఆందోళన వ్యక్తం చేస్తున్నారు* **మార్కండేయ కట్జూ**

**మా**జీ భారత ప్రధాన న్యాయమూర్తి దీపక్ మిశ్రా సుప్రీంకోర్టులో కేసుల పరిధులను అప్పగిస్తున్నప్పుడు అక్రమాలకు పాల్పడ్డాడని నలుగురు అత్యంత సీనియర్ న్యాయమూర్తులు నిరసన తెల్పుతూ బహిరంగంగా పత్రికా సమావేశం ఏర్పాటు చేసి మిశ్రాకు వ్యతిరేకంగా మాట్లాడారు. ఆ నలుగురిలో రంజన్ గోగోయ్ కూడ ఉన్నారు.

కాని ఆ రంజన్ గోగోయే (ఆయనను నేను జస్టిస్ అని కూడ పిలవదలచుకోలేదు. లైంగిక అత్యాచారాలకు పాల్పడే ఒక వికృత జీవికి ఆ విశేషణం తగదు) మరింత ఘోరమైన మరెన్నో రకాల అక్రమాలకు పాల్పడ్డాడు. భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం మీద వాస్తవంగా సాగిలపడ్డాడు. మొత్తం అత్యున్నత న్యాయస్థానాన్నే రాజకీయ అధికారవర్గం చేతుల్లో పెట్టాడు. ప్రజల హక్కులను పరిరక్షించే పవిత్ర బాధ్యతను వదిలేశాడు. అటువంటి సమయంలో సుప్రీం కోర్టు న్యాయమూర్తులలో ఒక్కరంటే ఒక్కరు కూడ బహిరంగంగా తమ అసమ్మతి వ్యక్తం చేయలేదు.

గతంలో ఆంతరంగిక భద్రతా చట్టం మీద అన్యాయమైన, సిగ్గుమాలిన తీర్పు (ఎడిఎం జబల్పూర్ వర్సస్ శివకాంత్ శుక్లా) వెలువడినపుడు, కనీసం జస్టిస్ ఎచ్ ఆర్ ఖన్నా అనే ఒకే ఒక్క ధైర్యమైన అసమ్మతి స్వరం వినిపించింది. కాని అంతకన్న సిగ్గుచేటైన అయోధ్య తీర్పు వెలువడి నప్పుడు అది ఏకగ్రీవ తీర్పుగా బైటికి వచ్చింది.

గోగోయ్ ధూర్తుడూ తుచ్ఛుడూ అనే మాట నిజమే. న్యాయ వ్యవస్థ మీద ఒక మచ్చలాంటివాడనే మాట నిజమే. కాని న్యాయ వ్యవస్థలో న్యాయమూర్తులందరూ సమానమే. ప్రధాన న్యాయమూర్తి అయినంత మాత్రాన ఒకరు మిగిలిన వారికన్న ఎక్కువేమీ కాదు.

మరి ఇతర న్యాయమూర్తులు ఈ అవమానకరమైన మనిషి ముందర తమ అంతరాత్మలను ఎందుకు తాకట్టు పెడుతున్నారు? అలా వారు తమ అంతరాత్మలను వంచించుకుంటున్నారనేందుకు ఎన్నెన్నో ఆధారాలున్నాయి గాని మచ్చుకు ఈ ఐదు కేసులు చూడండి:

1) అయోధ్య కేసు విచారించి తీర్పు చెప్పిన బెంచిలో ఐదుగురు సుప్రీం కోర్టు న్యాయమూర్తులున్నారు. వారిలో గోగోయ్ కేంద్ర ప్రభుత్వం ఏమి చెప్పమంటే అదే చెపుతాడని ఎవరైనా ఊహించగలరు.

కాని మిగిలిన నలుగురు న్యాయమూర్తులు అంత ఘోరమైన, దుర్మార్గమైన, అన్యాయమైన తీర్పుకు ఎట్లా అంగీకరించారు?

ఆ నలుగురు న్యాయమూర్తుల అంతరాత్మ ప్రబోధాలు, న్యాయ విచక్షణ ఏమైపోయాయి? లేక ఆ నలుగురూ కూడ తమ అంతరాత్మలనూ, విచక్షణలనూ ఆ వంచకుడూ దుర్మార్గుడూ తుచ్ఛుడూ గోగోయ్‌కి అప్పజెప్పేశారా?

2) అభిజిత్ అయ్యర్ మిత్రా బెయిల్ దరఖాస్తును తిరస్కరిస్తూ, గోగోయ్ "మీకు సురక్షితమైన స్థలం జైలే" అనే చౌకబారు, క్రూరమైన వ్యాఖ్య చేశాడు.

రాజస్థాన్ రాష్ట్ర ప్రభుత్వం వర్సస్ బాల్ చంద్ అనే కేసులో జస్టిస్ కృష్ణ అయ్యర్ ఇచ్చిన సుప్రసిద్ధమైన తీర్పు ప్రకారం న్యాయశాస్త్ర సూత్రంగా స్థిరపడిపోయిన సంప్రదాయం ప్రకారం భారత న్యాయస్థానాలలో బెయిల్ నే సాధారణంగా, జైలును మినహాయింపుగా మాత్రమే చూడాలనే. నిందితులు తప్పించుకుపోతారనో, సాక్ష్యాధారాలను తారుమారు చేస్తారనో, లేక నిందితులు దారుణమైన నేరాలకు ఒడిగట్టి ఉంటేనో తప్ప మిగిలిన అన్ని సందర్భాలలో ఈ సూత్రాన్ని పాటించాలి.

అభిజిత్ చేసిన నేరమల్లా కోణార్క్ ఆలయం గురించి ఒక వ్యంగ్య వ్యాఖ్యను ట్వీట్ చేయడం మాత్రమే. ఆ పని చేసినందుకు ఆయన వెంటనే క్షమాపణ చెప్పాడు కూడ. తప్పనిసరిగా ఇది బెయిల్ ఇవ్వడానికి తగిన కేసే. అయినా ఆ బెయిల్ దరఖాస్తును తిరస్కరించారు.

న్యాయశాస్త్ర సూత్రాలను పాటించక పోవడంలో గోగోయ్ సిద్ధహస్తుడే. కాని ఆ బెంచి మీద ఆయనతో పాటు కూచున్న మరి ఇద్దరు న్యాయమూర్తులకేమైంది? వారిద్దరూ గోగోయ్ తీర్పుకు తమ అసమ్మతి ఎందుకు తెల్పలేదు? ఇప్పటికే స్థిరపడిన న్యాయశాస్త్ర సూత్రాల ప్రకారం ఇది బెయిల్ ఇవ్వదగిన కేసేనని ఎందుకు వాదించలేదు? ఎందుకు గోగోయ్‌ను అనుసరించారు?

నేను అలహాబాద్ హైకోర్టులో ఒక న్యాయమూర్తిగా ఉన్నప్పటి సంగతి

---

ప్రతి ఒక్కరిని నిర్బంధిస్తూ, ఎదిరించిన గౌరీ లంకేష్, పన్సారే, కల్బుర్గి లాంటి వాళ్లను బహిరంగంగా హత్యలు చేయిస్తూ, విశ్వవిద్యాలయాల్లోకి చొరబడి రాడ్లతో అయిషీ ఘోష్ లాంటి వాళ్ల తలలు పగలగొడుతూ, నజీబ్ లాంటి చైతన్యవంతమైన విద్యార్థులను మాయం చేస్తూ, రోహిత్ వేముల లాంటి నిమ్న సామాజిక వర్గాల విద్యార్థులను ఆత్మహత్యలకు పురిగొలుపుతూ నరేంద్ర మోడీ అమిత్ షాల నాయకత్వంలో దేశంలో ఫాసిస్ట్ పాలన కొనసాగుతున్నది.

అయితే చరిత్ర ఇలాంటి ఎన్నో పాలనలను మట్టిగరిపించిన పోరాటాలను రికార్డు చేసిందనే వాస్తవాన్ని పదేపదే మననం చేసుకుంటూ ఈ ఫాసిస్ట్ పాలనకు వ్యతిరేకంగా తిరిగి ఆ దిశగా ప్రజా ఉద్యమాలు కొనసాగాలని ఆశిద్దాం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

ఒకటి గుర్తొస్తున్నది. అప్పుడు నేను ఒక సీనియర్ న్యాయమూర్తితో పాటు ఒక డివిజన్ బెంచిలో ఉన్నాను. మేమిద్దరమూ కలిసి విన్న కేసుల్లో ఆయన నన్ను సంప్రదించకుండానే తీర్పులు ఇవ్వడం మొదలుపెట్టాడు. అలా ఆయన రెండు మూడు కేసుల్లో తీర్పులు ఇచ్చిన తర్వాత అది నాకు అంగీకారం కాదని చెప్పేశాను. ఆ బెంచి మీద నేను కూడ ఆయనతో సమానమైన న్యాయమూర్తినేనని, ఏ ఆదేశం ఇవ్వదలచుకున్నా నన్ను సంప్రదించ వలసిందేనని చెప్పేశాను. అలా సంప్రదించకుండా ఉత్తర్వులు ఇస్తే వాటి మీద నేను సంతకం చేయనన్నాను. గోగోయ్‌తో బెంచి మీద కూచున్న న్యాయమూర్తులు ఇట్లా ఎందుకు చెప్పలేకపోయారు?

3) జస్టిస్ అకిల్ అబుల్హమీద్ కురేషి విషయంలో సుప్రీం కోర్టు కొల్లీజియంలోని మిగిలిన నలుగురు సభ్యులు గోగోయ్ మాటను ఎందుకు అంగీకరించారు? భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం చెప్పినట్టు చేసిన గోగోయ్‌కి ఎందుకు లొంగిపోయారు. జస్టిస్ కురేషి ముస్లిం గనుక ఆయన మధ్యప్రదేశ్ హైకోర్టు వంటి పెద్ద హైకోర్టుకు ప్రధాన న్యాయమూర్తి కాగూడదని, అందుకు బదులు త్రిపుర హైకోర్టు వంటి చిన్న హైకోర్టుకు బదిలీ చేస్తే సరిపోతుందని కేంద్ర ప్రభుత్వం భావించింది.

ప్రభుత్వం ఏమి చెపితే దానికి గోగోయ్ అంగీకరించడంలో ఆశ్చర్యం లేదు. కాని మిగిలిన న్యాయమూర్తులు ఎందుకు అంగీకరించినట్టు? వారి అంతరాత్మలకు ఏమయింది?

4) జస్టిస్ ప్రదీప్ నందరాజోగ్ విషయంలో జరిగిన అక్రమ పద్ధతి అందరికీ తెలుసు.

ఆయనకు సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా పదోన్నతి ఇవ్వాలని ఐదుగురు న్యాయమూర్తుల సుప్రీంకోర్టు కొల్లీజియం ఏకగ్రీవంగా సిఫారసు చేసింది. ఆ సిఫారసు మీద ఐదుగురు న్యాయమూర్తులూ సంతకం చేశారని, ఆ కొల్లీజియంలో అప్పుడు సభ్యుడుగా ఉండిన జస్టిస్ లోకూర్ నాకు చెప్పారు. కాని గోగోయ్ దగ్గరివాడైన జస్టిస్ వాల్మీకి మెహతాకూ జస్టిస్ నందరాజోగ్‌కూ పడదు గనుక, మెహతా కోరికపై గోగోయ్ ఆ సిఫారసు లేఖను ప్రభుత్వానికి పంపకుండా తన జేబులో పెట్టుకుని కూచున్నాడు. జస్టిస్ లోకూర్ పదవీ విరమణ జరిగాక, తన చెప్పుచేతల్లో ఉండే కొల్లీజియం ఏర్పాటయ్యాక పాత సిఫారసు లేఖను ఉపసంహరించుకునేలా చేశాడు.

5) గోగోయ్ నాయకత్వంలోని సుప్రీం కోర్టు బెంచి సిబిఐ డైరెక్టర్ ఆలోక్ వర్మ విషయంలో ఎంత అక్రమంగా వ్యవహరించిందో అందరికీ తెలుసు. అయితే ఆ బెంచి మీద ఉన్న న్యాయమూర్తులలో గోగోయ్ ఒక్కడే లేడు. న్యాయాన్ని అంత నగ్నంగా ధ్వంసం చేస్తుంటే మిగిలిన న్యాయమూర్తులు ఏం చేస్తున్నారు?

ద్రౌపది వస్త్రాపహరణ సమయంలో భీష్మాచార్యుడి గొంతు మూగవోయినట్టుగా వారందరి గళాలూ ఎందుకు మూగవోయాయి?

6) గోగోయ్ తనపై లైంగిక వేధింపులు జరిపాడని ఆరోపించిన ఒక మహిళా ఉద్యోగి కేసులో అప్పటికి ప్రధాన న్యాయమూర్తి అయిన గోగోయ్ తాను నియమించిన ముగ్గురు న్యాయమూర్తుల బెంచిలో తనను తాను నియమించుకున్నాడు.

ఆ తర్వాత ఆ విచారణ నుంచి తాను ఉపసంహరించుకుంటానని ఒక నాటకం ఆడాడు. అలా ఆయన ఉపసంహరణను ఆమోదిస్తే ఆ బెంచి రద్దయిపోవలసింది. గోగోయ్ సభ్యుడుగా ఉండని మరొక బెంచికి ఈ కేసు బదిలీ అయి ఉండేది.

మరి గోగోయ్ ఉపసంహరించుకుంటానని చెప్పి కూడ అదే బెంచి మీద కూచుని విచారణలో పాల్గొంటూ ఉంటే ఆ విచిత్రమైన, అసాధారణమైన ప్రవర్తనను మిగిలిన ఇద్దరు న్యాయమూర్తులూ ఎందుకు అంగీకరించారు?

ఇటువంటి దిగ్భ్రాంతికరమైన ఉదాహరణలు మరెన్నో ఇవ్వవచ్చు. నిస్సందేహంగా గోగోయ్ ఖల్ నాయకుడే. కాని మిగిలిన సుప్రీం కోర్టు న్యాయమూర్తులు సుప్రీంకోర్టు వస్త్రాపహరణ జరుగుతుంటే, భీష్మాచార్యులు వ్యవహరించినట్టుగా ఎందుకు వ్యవహరించారు?

వారు కూడ సమానంగా అపరాధులు కారా? ప్రధాన న్యాయమూర్తి దీపక్ మిశ్రా విషయంలో జరిపినట్టుగా ఆ మిగిలిన న్యాయ మూర్తులందరూ గోగోయ్ అక్రమాల గురించి ఒక బహిరంగ పత్రికా సమావేశం ఎందుకు నిర్వహించలేకపోయారు?

ఈ గంభీరమైన ప్రశ్నలకు భారత ప్రజానీకానికి జవాబులు చెప్పవలసి ఉంది. అలా చెప్పలేకపోతే, భారత న్యాయవ్యవస్థలో వారి నమ్మకం, ఇప్పటికే చాలవరకు బలహీనమై పోయిన నమ్మకం, పూర్తిగా రద్దయిపోతుంది.

*(జస్టిస్ మార్కండేయ్ కట్జూ సుప్రీం కోర్టు మాజీ న్యాయమూర్తి, ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా మాజీ అధ్యక్షుడు)*

*(http://punjabtoday.in/punjabtodayin/opinion.php?comment&entry_id=1580812401&title=ranjan-gogoi-was-a-rogue-and-rascal-but-what-were-you-doing-my-lords)* వీ

**రచయితలకు సూచన :** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.*

# భీమా కోరేగాం కేసు కొత్త మలుపులు

***భీమా కోరేగాం - ఎల్గార్ పరిషత్ కేసును నేషనల్ ఇన్వెస్టిగేటింగ్ ఏజెన్సీకి అప్పగించడంలో ఇమిడి ఉన్న అమిత్ షా - ఆర్ఎస్ఎస్‌ల కుట్రను వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

నిందితుల మీద ఇరవై నెలలుగా ఎడతెగకుండా నిర్బంధం కొనసాగుతున్న భీమా కోరేగాం – ఎల్గార్ పరిషత్ కేసు అనే అబద్ధపు కేసు భారత పాలకవర్గాల అన్యాయానికీ, అక్రమాలకూ, చట్టాతీత ప్రవర్తనకూ, దుర్మార్గానికీ ప్రతీక. ఈ దేశ పాలకవర్గాలు ప్రజా మేధావుల మీద ఎంత క్రూరత్వాన్ని ప్రదర్శించగలవో చూపే ఒక నమూనా కేసు. ఆ కేసులో ఈ ఇరవై నెలలలో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్, దాని ప్రభావంలో పనిచేసే పోలీసు అధికారులు, ప్రభుత్వాధికారులు, న్యాయవ్యవస్థ ఎన్నెన్ని అక్రమాలకు, చట్టాతీత ప్రవర్తనలకు పాల్పడ్డారో వివరించడానికి పూనుకుంటే ఉద్గ్రంథమే అవుతుంది. ఆ పాత కథలన్నీ అలా ఉంచి, నవంబర్ నుంచి ఈ కేసు తిరుగుతున్న మలుపులు, పాలకుల కుట్రలు చూస్తే పాలకవర్గ దుర్మార్గం పట్ల అసహ్యం కలుగుతుంది.

2019 అక్టోబర్ లో మహారాష్ట్ర శాసనసభ ఎన్నికలు జరిగే సమయానికి భారతీయ జనతా పార్టీ – శివసేన కూటమి అధికారంలో ఉండింది. ఆ రెండు పార్టీలూ హిందుత్వ రాజకీయాలను సమర్థించేవే అయినప్పటికీ, కలిసి ప్రభుత్వాన్ని స్థాపించినప్పటికీ అంతకు ముందరి ఐదు సంవత్సరాలలో రెండు పార్టీల మధ్య విభేదాలు ఎన్నోసార్లు బైటపడ్డాయి. రెండు పార్టీలూ హిందుత్వ రాజకీయాలనే పాటించినప్పటికీ, మహారాష్ట్ర తన సొంత ప్రాంతమని, అక్కడ తనకు మరొక పోటీదారు ఉండగూడదని శివసేన భావిస్తుంది. దశాబ్దాలుగా తన నియోజకవర్గంగా ఉన్న మహారాష్ట్రలో భాజపా చొరబాటు దానికి కంటగింపుగా ఉండింది. అలా రెండు పార్టీలూ ఒకదానితో ఒకటి పోటీపడి చివరికి ప్రభుత్వంలో కలిసి ఉన్నప్పటికీ ఎడమొగం పెడమొగంగానే కొనసాగాయి.

2019 ఎన్నికల్లో విడివిడిగా పోటీ చేసిన రెండు పార్టీల్లో భారతీయ జనతా పార్టీకి 105 స్థానాలు దక్కినప్పటికీ 288 స్థానాల శాసనసభలో ప్రభుత్వం స్థాపించడానికి సరిపోయినన్ని స్థానాలు రాలేదు. శివసేన 56 స్థానాలు సాధించి భారతీయ జనతా పార్టీతో చేతులు కలిపితే గతంలో లాగనే ప్రభుత్వం స్థాపించగలిగినప్పటికీ ముఖ్యమంత్రి పదవి మీద పట్టు పట్టి భాజపా నుంచి దూరమైంది. అనేక నాటకాలు, శాసనసభ్యుల కొనుగోలు, బెదిరింపు, బుజ్జగింపు ప్రయత్నాలు అన్నీ పూర్తయి చివరికి నవంబర్ 30న శివసేన, నేషనలిస్ట్ కాంగ్రెస్ పార్టీ (54 స్థానాలు), కాంగ్రెస్ (44 స్థానాలు) కలిసి మహా వికాస్ అఘాది అనే కూటమిగా ఏకమై ప్రభుత్వాన్ని ఏర్పరచాయి.

ఈ కూటమి ఎంతకాలం అధికారంలో ఉండగలుగుతుంది, ఈ ప్రభుత్వాన్ని కూల్చడానికి, శివసేనను మళ్లీ చేరదీయడానికి భారతీయ జనతా పార్టీ ఎన్ని బుజ్జగింపులకు, బెదిరింపులకు, కుట్రలకు పాల్పడుతుంది, శివసేన ఎన్నాళ్లు భాజపాకూ, హిందుత్వ రాజకీయాలకూ దూరంగా ఉండగలుగుతుంది అనే ప్రశ్నలు ఎలా ఉన్నా, భీమా కోరేగాం కేసుకు సంబంధించి ఈ రెండు నెలల్లో ఈ కూటమి ప్రభుత్వం కింద ఆసక్తికరమైన పరిణామాలు జరిగాయి.

కొంచెం వెనక్కి వెళ్లి చూస్తే, భారతీయ జనతా పార్టీ మినహా మహారాష్ట్రలో మిగిలిన అన్ని పార్టీలూ భీమా కోరేగాం కేసును వ్యతిరేకించినవే. 2018 జనవరి 1న భీమా కోరేగాం హింసాకాండ జరగగానే పుణె రూరల్ పోలీసులు పుణె మునిసిపల్ కార్పొరేషన్ డిప్యూటీ మేయర్ సిద్ధార్థ్ ధెండే నాయకత్వాన పది మంది సభ్యుల నిజనిర్ధారణ కమిటీని నియమించారు. సిద్ధార్థ్ ధెండే అప్పటి ప్రభుత్వంలో భాగస్వామి అయిన రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా (అఠావాలె) నాయకుడు, భారతీయ జనతా పార్టీ టికెట్ మీదనే డిప్యూటీ మేయర్ అయినవాడు. కాని ఆ నిజనిర్ధారణ కమిటీ నివేదికలో హింసాకాండకు బాధ్యులు మాజీ ఆర్ఎస్ఎస్ కార్యకర్త, హిందూ జనజాగరణ్ సమితి స్థాపకుడు శంభాజీ భిడే, శివ జాగర్ ప్రతిష్ఠాన్ స్థాపకుడు మిలింద్ ఎక్బోటె అని నిర్ధారించారు. ఈ ఇద్దరు ప్రధాన బాధ్యులలో శంభాజీ భిడేను ప్రధాని నరేంద్ర మోడీ బహిరంగంగా గురూజీ అని సంబోధించాడు. అందువల్ల ఈ హింసాకాండ కేసును అసలు నేరస్తుల నుంచి తప్పించి ఇతరుల మీద పెట్టాలని భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం భావించింది.

అసలు భీమా కోరేగాం కేసు విషయంలో అప్పుడు ప్రభుత్వంలో భాగం పంచుకుంటున్న శివసేన, రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా (అఠావాలె) తో సహా, ప్రధాన ప్రతిపక్షాలుగా ఉండిన కాంగ్రెస్, నేషనలిస్ట్ కాంగ్రెస్ పార్టీ (ఎన్‌సిపి) కూడ అనుమానాలు వ్యక్తం చేశాయి. అసలు నేరస్తుల మీద కేసు పెట్టలేదని, తప్పుడు సాక్ష్యాలు సృష్టించి, సంబంధం లేని వారి మీద కేసు పెట్టారని, అభూతకల్పనలతో కేసు తయారు చేశారని ఆయా పార్టీలు అప్పుడే వ్యాఖ్యానించాయి. అలాగే దళిత సంక్షేమ సంస్థ రాష్ట్ర సేవా దళ్ కూడ ఈ కేసు ఒక కాషాయ కుట్ర అని ప్రకటించింది.

అలాగే ఆ కేసు అనేక మలుపులు తిరిగి జూన్ 6న ప్రధానమంత్రిపై హత్యాప్రయత్నం కేసుగా మారినప్పుడు అప్పటికి ప్రభుత్వంలోనే ఉండిన శివసేన ఆ ఆరోపణను హాస్యాస్పదం అని కొట్టివేసింది. కేసు అబద్ధం అని అర్థం వచ్చేలా మాట్లాడింది. అప్పటికి ప్రధాన ప్రతిపక్షాలైన కాంగ్రెస్, నేషనలిస్ట్ కాంగ్రెస్ పార్టీ రెండూ కూడ ఆ కేసును అబద్ధపు కేసుగా, ప్రభుత్వపు కక్ష సాధింపుగా అభివర్ణించాయి.

ఈ నేపథ్యం వల్ల, అప్పుడు ఈ కేసును వ్యతిరేకించిన మూడు

పార్టీలూ ఇప్పుడు అధికారానికి రావడంతో ఈ కేసు గురించి పునరాలోచన జరుగుతుందని చాల మంది ఆశించారు. కొత్త ప్రభుత్వం అటువంటి పునరాలోచన సాగించాలని మహారాష్ట్ర పౌరసమాజంలో ఎందరో సూచించడం ప్రారంభించారు. నవంబర్ 30న ముఖ్యమంత్రిగా శివసేనకు చెందిన ఉద్ధవ్ ఠాక్రే ప్రమాణ స్వీకారం చేయగా, ఆ మర్నాడే డిసెంబర్ 1న ఎన్‌సిపి నాయకుడు జితేంద్ర అవ్హద్, సమాజ్‌వాద్ పార్టీ నాయకుడు అబు ఆజ్మీ, రాష్ట్రీయ జనతాదళ్ నాయకుడు మనోజ్ ఝూడు, సిపిఐ నాయకుడు డి రాజా ముఖ్యమంత్రిని కలిసి ఈ కేసును సమీక్షించాలని, అప్పటికి ఏడాదికి పైగా నిర్బంధంలో ఉన్న ప్రజా మేధావులను విడుదల చేయాలని కోరారు.

ఒకవైపు మహారాష్ట్ర పౌరసమాజం, ప్రతిపక్ష పార్టీలు, కొత్తగా అధికారంలోకి వచ్చిన పార్టీలు ఈ కేసు గురించి పునరాలోచించమని కోరుతుండగా, ఈ కేసు దర్యాప్తు అధికారి అయిన ఎసిపి శివాజీ పవార్, పుణె జిల్లా ప్రభుత్వ న్యాయవాది ఉజ్వలా పవార్ మాత్రం మరింత కసితో కేసును నడిపించడం మొదలుపెట్టారు. ఈ శివాజీ పవార్ ఒక ఐపిఎస్ అధికారిగా కన్న ఎక్కువగా ఆర్ఎస్ఎస్ కార్యకర్తగా పని చేస్తున్నాడని మహారాష్ట్రలో ఎన్నో పత్రికలు ఇదివరకే ఆధారాలు చూపాయి. వరవరరావు దగ్గర జప్తు చేసిన హార్డ్‌డిస్క్‌ను తాము తెరవలేకపోయామని, అందువల్ల దాంట్లో ఏమున్నదో తెలుసుకోవడం కోసం అమెరికన్ దర్యాప్తు సంస్థ ఎఫ్‌బిఐ కి పంపనున్నామని దర్యాప్తు అధికారి న్యాయస్థానానికి తెలియజేశాడు. ఇది ఎంత హాస్యాస్పదమైన విషయమంటే, వరవరరావు దగ్గరి నుంచి తీసుకుపోయిన హార్డ్ డిస్క్‌లో ఉన్న సమాచారం అంటూ గత చార్జిషీట్‌లో కొంత సమాచారం ఇచ్చారు. హార్డ్ డిస్క్ తెరవలేకపోతే ఆ సమాచారం ఎక్కడి నుంచి తెచ్చారు? తీసుకుపోయినది ఒకటే హార్డ్‌డిస్క్ అని పంచనామా నివేదిక చెపుతున్నప్పుడు, దానిలోని సమాచారాన్ని ఇప్పటికే చార్జిషీట్‌లో ప్రకటించినప్పుడు, మరొక "తెరుచుకోని హార్డ్ డిస్క్"ను ఎక్కడి నుంచి సృష్టించారు? ఇంత స్పష్టంగా కనబడుతున్న పచ్చి అబద్ధాన్ని కూడ న్యాయమూర్తి చూడలేకపోయారు. దాని మీద వాదనలు, ప్రతివాదనలు పేరుతో కొంత కాలం గడిపారు. నిందితుల జైలు జీవితం మరింత పెంచారు. పోలీసులు, న్యాయస్థానం, ప్రభుత్వం, వెనుక ఉన్న ఆర్ఎస్ఎస్ ఆడుతున్న, ఆడిస్తున్న నాటకం ఇది. అసలు కేసే లేదని, అన్నీ అబద్ధాలేనని, ఎన్నాళ్లపాటు విచారణ జరిపినా తామేమీ రుజువు చేయలేమని వారికి తెలుసు. కాని, విచారణ పేరుతో ఏళ్లకు ఏళ్లు వీరిని నిర్బంధంలో ఉంచి, వారి కలాలకూ గళాలకూ సంకెళ్లు విధించడమే ఆర్ఎస్ఎస్ సాధించదలచిన లక్ష్యం.

అలా ప్రతిపక్ష పార్టీలన్నీ ముఖ్యమంత్రికి విజ్ఞాపనలు చేస్తుండగానే, డిసెంబర్ 13 నాటికి ఎన్‌సిపి నాయకుడు శరద్ పవార్ మరింత సమాచారం సమీకరించుకుని ఈ కేసు ఎట్లా బూటకమో, పోలీసులు చెపుతున్న సాక్ష్యాధారాలు ఎట్లా కూటసృష్టో బహిరంగంగా మాట్లాడడం, పత్రికా సమావేశాల్లో వివరించడం ప్రారంభించారు. రవీంద్ర కదమ్, శివాజీ పవార్ అనే ఇద్దరు ఆర్ఎస్ఎస్‌కు చెందిన ఐపిఎస్ అధికారులు ఈ కేసులో అనేక తప్పుడు సాక్ష్యాలు సృష్టించారని, అబద్ధపు కేసు బనాయించారని, తమ అధికారాన్ని దుర్వినియోగం చేశారని పుణెలో జరిగిన బహిరంగ సభలో శరద్ పవార్ ఆరోపించారు. "నాకే అధికారం ఉంటే ఎల్గార్ పరిషద్ కేసులో అధికార దుర్వినియోగం చేసినందుకు ఆ పోలీసు అధికారిని సస్పెండ్ చేసి ఉండేవాణ్ని" అని కూడ అన్నారు. ఈ కేసు విషయంలో జరిగిన అక్రమాలను, తప్పుడు సాక్ష్యాలు సృష్టించిన పోలీసు అధికారులు చూపిన అత్యుత్సాహాన్ని విచారించేందుకు ఒక ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని నియమించాలని కూడ శరద్ పవార్ ప్రభుత్వాన్ని కోరారు. వెంటనే మాజీ ముఖ్యమంత్రి, భారతీయ జనతా పార్టీ నాయకుడు దేవేంద్ర ఫడ్నవీస్ రంగంలోకి దిగి, అటువంటి ప్రత్యేక దర్యాప్తు పోలీసు అధికారుల మానసిక స్థైర్యాన్ని దెబ్బతీస్తుందని, ప్రత్యేక దర్యాప్తుకు ఆదేశించగూడదని ముఖ్యమంత్రిని కోరారు. అంటే పోలీసుల మానసిక స్థైర్యాన్ని దెబ్బతీసే నిజాలను ఇన్నాళ్లూ దాచిపెట్టడం జరిగిందన్నమాట. ఆ నిజాలు ఎప్పటికీ బైటికి రాగూడదన్న మాట.

ఈలోగా జనవరి రెండో వారంలో మంత్రివర్గ విస్తరణ, శాఖల కేటాయింపు జరిగి, హోం శాఖ మంత్రిగా ఎన్‌సిపికి చెందిన అనిల్ దేశముఖ్ బాధ్యతలు చేపట్టారు. పాత భాజపా ప్రభుత్వంలో అసమ్మతి తెల్పిన వారందరినీ అర్బన్ నక్సల్ అని ముద్రవేసి తప్పుడు కేసుల్లో ఇరికించారనీ, ఇప్పుడు ఆ కేసులను సమీక్షిస్తామనీ, అవసరమనుకుంటే జడ్జి లోయా అనుమానాస్పద మృతి కేసును కూడ తిరగదోడుతామనీ, తమ పార్టీ నాయకుడు శరద్ పవార్ కోరినట్టుగా మాజీ న్యాయమూర్తి నాయకత్వంలో ఒక ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని నియమించే విషయం ఆలోచిస్తామనీ హోం మంత్రి పదవి చేపట్టగానే అనిల్ దేశ ముఖ్ అన్నారు. భీమా కోరేగాం కేసు గురించి సీనియర్ పోలీసు అధికారులతో సమావేశమై అన్ని వివరాలూ తెలుసుకుంటానని అన్నారు.

చివరికి జనవరి 23న భీమా కోరేగాం – ఎల్గార్ పరిషద్ కేసులపై సమీక్ష జరపడానికి మహారాష్ట్ర హోం మంత్రి నిర్ణయించారు. ఎన్‌సిపి అడిగినట్టుగా ఈ కేసులో పుణె పోలీసు అధికారులు చేసిన అక్రమాలపై, సేకరించిన అబద్ధపు సాక్ష్యాలపై ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని నియమించడమా, కేసును ఉపసంహరించడమా, కనీసం పందొమ్మిది నెలలుగా, పధిహేను నెలలుగా బెయిల్ కూడ లేకుండా పుణె జైల్లో మగ్గిపోతున్న ప్రజా మేధావులకు బెయిల్ ఇచ్చి విడుదల చేయడమా వంటి అనేకఅంశాలు చర్చకు రానున్నాయని ఊహాగానాలు వెలువడ్డాయి. జనవరి 23 ఉదయం గంటో గంటన్నరో ఆ ఇద్దరు పోలీసు అధికారులతో హోంమంత్రి సమావేశం జరిగింది. మరొకసారి సమావేశం జరిగిన తర్వాత నిర్ణయం జరుగుతుందని వార్త బైటికి వచ్చింది.

కాని కొన్ని గంటల్లోనే భీమా కోరేగాం – ఎల్గార్ పరిషత్ కేసును నేషనల్ ఇన్వెస్టిగేటింగ్ ఏజెన్సీ (ఎన్ఐఎ) తన అధీనంలోకి తీసుకోనుందని ఢిల్లీ నుంచి కేంద్ర హోం మంత్రిత్వ శాఖ ప్రకటించింది. ఎన్ఐఎ నేరుగా కేంద్ర హోం మంత్రి పర్యవేక్షణలో, అమిత్ షా కనుసన్నల్లో నడిచే సంస్థ. ఆర్ఎస్ఎస్ తరఫున పనిచేస్తున్న ఐపిఎస్ అధికారుల వ్యవహారం మీద విధారణ జరపడానికి రాష్ట్ర ప్రభుత్వం ఒకటి రెండు అడుగులు కదపగానే ఆర్ఎస్ఎస్ నాయకుడి చేతిలో ఉన్న కేంద్ర హోం మంత్రిత్వ శాఖ రంగంలోకి దిగిందంటే ఈ కేసులో ఆర్ఎస్ఎస్‌కు ఎంత ఆసక్తి ఉన్నదో స్పష్టమవుతున్నది.

అయితే ఈ ఎన్ఐఎకు బదిలీ అనేది అంత సులభమైన వ్యవహారమేమీ

కాదు. అసలు భారత రాజ్యాంగం ప్రకారం శాంతి భద్రతలు, హోం శాఖ రాష్ట్ర జాబితాలో ఉన్నాయి. ఆ విషయాలలో రాష్ట్ర ప్రభుత్వానికే అన్ని అధికారాలుంటాయి. కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం దేశసమాఖ్య స్వభావానికే భంగకరం. కాని యుపిఎ పాలనా కాలంలో చిదంబరం హోం మంత్రిగా 2008లో కొన్ని ప్రత్యేక చట్టాల పరిధిలో వివిధ రాష్ట్రాలలో జరిగే నేరాల దర్యాప్తును సమన్వయం చేయడానికనే పేరుతో నేషనల్ ఇన్వెస్టిగేషన్ ఏజెన్సీ చట్టాన్ని తీసుకు వచ్చారు. జయలలిత వంటి కొందరు ముఖ్యమంత్రులు అప్పుడే ఈ చట్టాన్ని వ్యతిరేకించి ఇది రాష్ట్ర ప్రభుత్వాల హక్కులను కొల్లగొడుతుందనీ, సమాఖ్య స్ఫూర్తికి భంగకరమని వాదించారు గాని కేంద్ర చట్టానిదే పై చేయి అయింది. ఈ చట్టం చట్టబద్ధతను సవాల్ చేస్తూ చత్తీస్ గఢ్ రాష్ట్రప్రభుత్వం వేసిన కేసు ఒకటి ప్రస్తుతం సుప్రీం కోర్టు ముందు ఉంది. చట్టపరంగా, సాంకేతికంగా కూడ ఈ చట్టంతో సమస్యలున్నాయి. అప్పటిదాకా రాష్ట్ర ప్రభుత్వ అధికారం కింద సాగిన దర్యాప్తుకు ఏమవుతుంది? విచారణకూ, విచారణ క్రమంలో రాష్ట్ర ప్రభుత్వ అధికారులు చేసిన వాదనలకూ, నిందితుల తరఫున జరిగిన ప్రతివాదనలకూ ఏమవుతుంది? ఎన్ఐఎ కొన్ని కోర్టులను డిజిగ్నేట్ చేస్తుంది గాని ఆ న్యాయస్థానాలు రాష్ట్ర ప్రభుత్వ అధీనంలో, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులైన న్యాయమూర్తులతో నడవవలసిందే. ఈ చిక్కుముడులన్నీ దాటినా ఎన్ఐఎ దర్యాప్తు సంస్థే తప్ప విచారణ సంస్థ కాదు. ఏదైనా కేసును అదే మొదటి నుంచీ దర్యాప్తు చేస్తే ఫరవాలేదు గాని, రెండు సంవత్సరాలు మరొక సంస్థ దర్యాప్తు చేసిన తర్వాత అది చేయగలిగిందేమిటి?

భీమా కోరేగాం కేసు విషయమే చూస్తే అప్పటివరకూ రెండు సంవత్సరాల పాటు సాగిన దర్యాప్తునూ, దాఖలు చేసిన చార్జిషీట్లనూ, అప్పటికే ప్రారంభమైన విచారణనూ పక్కనపెట్టి, అప్పటిదాకా నిందితులు అనుభవించిన నిర్బంధం సంగతే ఎత్తకుండా రెడ్డొచ్చె మొదలాడెనన్నట్టుగా ఈ ఎన్ఐఎ విచారణ సాగవలసి ఉంటుంది.

ఈ కేసును ఎన్ఐఎ తీసుకుంటున్నదని జనవరి 24న ప్రకటన వెలువడింది. మామూలు పద్ధతిలో భీమా కోరేగాం కేసు వాయిదా జనవరి 27న పుణె కోర్టులో ఉండింది. అప్పటికే ఎన్ఐఎ బదిలీ గురించి పత్రికల్లో వార్తలు వచ్చాయి గాని తమకేమీ సమాచారం లేదని ఆరోజు కోర్టులో ప్రభుత్వ న్యాయవాది అన్నారు. మరొకవైపు ఆరోజునే ముంబాయిలో ఎన్ఐఎ ఒక కొత్త ఎఫ్ఐఆర్ నమోదు చేసింది. పాత భీమా కోరేగాం కేసులో ఉన్నట్టుగా 23 మంది నిందితుల పేర్లు కాకుండా కేవలం పదకొండు మంది నిందితుల పేర్లు (జైలులో ఉన్న తొమ్మిది మంది, ఆనంద్ తేల్తుంబ్డే, గౌతమ్ నవ్లాఖా) మాత్రమే రాసింది. పాత కేసులోని ఆరోపణలు, సెక్షన్లు దాదాపు అట్లాగే ఉంచి, కొత్త ఎఫ్ఐఆర్‌లో విచిత్రంగా రాజద్రోహ ఆరోపణ మాత్రం తీసేశారు.

ఈ పరిణామాలు జరుగుతుండగానే, 2017 డిసెంబర్ 31న ఎల్గార్ పరిషద్ సభను నిర్వహించిన మాజీ సుప్రీం కోర్టు న్యాయమూర్తి పి బి సావంత్, మాజీ హైకోర్టు న్యాయమూర్తి కోల్సె పాటిల్ ఇలా ఎన్ఐఎ స్వాధీనం చేసుకోవడం చట్టవ్యతిరేకమని, అక్రమమని, ఈ విషయమై తాము సుప్రీం కోర్టుకు వెళతామని ప్రకటించారు.

పుణె కోర్టులో రాష్ట్ర ప్రభుత్వ న్యాయవాది తనకు ఈ బదిలీ సంగతి తెలియదని అన్నందువల్ల కావచ్చు, జనవరి 30న స్వయంగా ఎన్ఐఎ న్యాయవాది వచ్చి ఆ కేసును తమకు బదిలీ చేయమని పుణె కోర్టులో ఒక దరఖాస్తు ఇచ్చారు. దాని మీద మరుసటి వాయిదా ఫిబ్రవరి 3న కూడ తనకు ఏ ఆదేశమూ లేదని, తాను ఏమీ చెప్పలేనని, సమయం కావాలని ప్రభుత్వ న్యాయవాది కోరారు. ఫిబ్రవరి 5న ఇటువంటి బదిలీ ఏకపక్ష నిర్ణయమని, అది అవసరమైతే కేంద్ర ప్రభుత్వం తమతో మాట్లాడి ఉండవలసిందని ముఖ్యమంత్రి ఉద్ధవ్ ఠాక్రే కూడ అన్నారు. ఫిబ్రవరి 6న, 7న పుణె కోర్టులో ఈ బదిలీ గురించి వాదనలు జరిగాయి. కేసును తమ స్వాధీనం చేయడం ఎందుకు అవసరమో ఎన్ఐఎ తరఫు న్యాయవాది వాదించగా, ఎన్ఐఎ కు ఇవ్వగూడదని ప్రభుత్వ న్యాయవాది వాదించారు. ఎన్ఐఎ కు ఇవ్వడం రాజకీయ దురుద్దేశపూరితమే తప్ప త్వరిత విచారణకు ఉపయోగపడదని నిందితుల తరఫు న్యాయవాదులు వాదించారు. మూడు పక్షాల వాదనలూ విన్న తర్వాత తీర్పు ఫిబ్రవరి 14న చెపుతానని న్యాయమూర్తి వాయిదా వేశారు.

ఇంత నాటకం జరిగి, చివరికి రసాభాస అయినట్టుగా తీర్పుకు రెండు రోజుల ముందు, మహారాష్ట్ర ప్రభుత్వం తన వాదనను తానే వదులుకుని, తలకిందుల ఆసనం వేసి, ఎన్ఐఎ కు కేసును అప్పగించాలని నిర్ణయం తీసుకుంది. నాలుగు రోజుల ముందు తన న్యాయవాది చేసిన వాదనలు, స్వయంగా తానే పత్రికల వారితో చెప్పిన వాదనలు వదులుకుని ముఖ్యమంత్రి శీర్షాసనం వేశాడు. ఇక రెండు రోజుల తర్వాత పుణె న్యాయమూర్తికి తీర్పు చెప్పడానికి ఏమీ లేకపోయింది.

ఈ తలకిందుల నిర్ణయం వెలువడిన వెంటనే శరద్ పవార్ ఖండించారు. ఆ తర్వాత మూడు రోజులకు కూడ, కేసును ఎన్ఐఎ కు బదిలీ చేసినప్పటికీ రాష్ట్ర ప్రభుత్వం తన పోలీసు అధికారులు చేసిన అక్రమాల మీద దర్యాప్తుకు ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని నియమించే అవకాశం ఉంటుందని అన్నారు. అది జరుగుతుందా లేదా తెలియదు గాని ఫిబ్రవరి 28న నిందితులందరినీ ముంబాయిలో ఎన్ఐఎ ప్రత్యేక కోర్టులో హాజరుపరిచి ఎన్ఐఎ ఆధ్వర్యంలో కేసు విచారణ మళ్లీ మొదలుపెడతారు.

మొదట ఇద్దరు ఆర్ఎస్ఎస్ నాయకుల నాయకత్వంలో దళితుల మీద జరిగిన హింసాకాండ కేసును వారి మీద పెట్టలేదు. వారి మీద ఆ కేసు పెట్టకుండా ఉండడానికి ఆ హింసాకాండతో సంబంధంలేని ప్రజామేధావుల మీద పెట్టి వేధించడం ప్రారంభించారు. ఇరవై నెలల పాటు వాయిదాల మీద వాయిదాలు వేస్తూ, కనీసం బెయిల్ కూడ ఇవ్వకుండా నిరాకరిస్తూ వారి గొంతులను నొక్కివేశారు. చివరికి ప్రభుత్వం మారి, కేసు పునర్విచారణకు వచ్చి, విడుదల సాధ్యమవుతుందేమోనని ఆశలు చిగురించగా, ఆ ఆశలను వమ్ము చేయడానికి హంతక కేంద్ర హోం మంత్రి చేతుల్లోకి ఆ కేసును మార్చారు. 2018 జనవరి 1న ఆర్ఎస్ఎస్ నాయకుల మీద పెట్టవలసిన కేసును తప్పించడం నుంచి, 2020 ఫిబ్రవరి 13న ఆర్ఎస్ఎస్ నాయకుడి ఆధ్వర్యంలోని మంత్రిత్వ శాఖకు మార్చడం దాకా ఇదంతా ఆర్ఎస్ఎస్ కుట్ర. ప్రజా మేధావుల మీద, ప్రజా ఉద్యమాల మీద, ప్రజల మీద ఆర్ఎస్ఎస్ హంతక, విద్వేష, హింసా రాజకీయాల అమలుకు ఈ కేసు ఒక ఉదాహరణ.

*(రచయిత వీక్షణం సంపాదకుడు)* వీ

# బోడో శాంతి ఒప్పంద పరిణామాలు

*బిజెపి పాలనపై బోడోలలో ఉన్న వ్యతిరేకతను నామమాత్రంగానైనా తొలగించడానికి, వారి స్వతంత్ర ప్రతిపత్తి ఆకాంక్షను చల్లార్చడానికి నరేంద్ర మోడీ, అమిత్ షా కొత్త ఆర్థిక వరాల వలను విసురుతున్నారని అంటున్నారు* **ఎం.కె. కుమార్**

అస్సాంలోని కోక్రాజార్‌లో జరిగిన ర్యాలీలో ప్రసంగించిన ప్రధానమంత్రి మోడీ బోడో ప్రాంతాలకు రు.1500 కోట్ల ప్యాకేజీని ప్రకటించారు. ఈ ప్రాంతంలో అభివృద్ధి పనులను నిర్వహించడానికి, మౌలిక సదుపాయాలు, ఉపాధి అవకాశాలను పెంచడానికి బోడో శాంతి ఒప్పందం 2020 జరిగింది. ఈ ప్రాంతాలకు కేంద్ర ప్రభుత్వం నుండి ప్యాకేజీ ఇవ్వబడుతుంది. చారిత్రాత్మక బోడో ఒప్పందంపై ప్రధాని నరేంద్ర మోడీ సంతకం చేసినందుకు ప్రజలు సంబరాలు జరుపుకున్నారని వార్తలు వచ్చాయి. కోక్రాజార్‌లో జరిగిన కార్యక్రమానికి ప్రధానిని స్వాగతించడానికి కోక్రాజార్ పట్టణంలో సుమారు 70,000 మట్టి దీపాలను వెలిగించారని వార్తా సంస్థలు ప్రచారం చేశాయి.

గత ఏడాది సిఎఎ నిరసనల తరువాత ప్రధాని మోడీ అస్సాంలో చేసిన మొదటి పర్యటన ఇది. 2019 డిసెంబర్‌లో గౌహతిలో శిఖరాగ్ర సమావేశం జరగాల్సి ఉంది. నిరసనల కారణంగా జపాన్‌కు చెందిన షింజో అబేతో గతంలో తన శిఖరాగ్ర సమావేశాన్ని రద్దు చేసుకున్నారు. 2020 జనవరిలో జరిగిన ఖేలో ఇండియా యూత్ గేమ్స్ ప్రారంభ కార్యక్రమంలో కూడా ప్రధాని పాల్గొనలేదు. అస్సాంలోని మిలిటెంట్ గ్రూపులలో ఒకటైన నేషనల్ డెమొక్రటిక్ ఫ్రంట్ ఆఫ్ బోడోలాండ్ (ఎన్‌డిఎఫ్‌బి) తో కేంద్ర ప్రభుత్వం 2020 జనవరి 2న చారిత్రాత్మక బోడో శాంతి ఒప్పందంపై సంతకం చేసింది.

బోడో రాష్ట్రాన్ని కోరుతూ చాలాకాలంగా ఆందోళన చేస్తున్న ఆల్ బోడో స్టూడెంట్స్ యూనియన్ (ఎబిఎస్‌యు) కూడా ఈ ఒప్పందంపై సంతకం చేసింది. బోడో ఒప్పందం ప్రత్యేక బోడోలాండ్ రాష్ట్రం కోరుకోకుండా గిరిజన ప్రాంతాలకు రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలను అందిస్తుంది. త్రైపాక్షిక ఒప్పందంపై అస్సాం ముఖ్యమంత్రి సర్బానంద సోనోవాల్, ఎన్‌డిఎఫ్‌బికి చెందిన ప్రధాన నాయకత్వం, ఎబిఎస్‌యు సంయుక్త కార్యదర్శి సత్యేంద్ర గార్గ్, హోం వ్యవహారాల మంత్రిత్వ శాఖ, అస్సాం ముఖ్య కార్యదర్శి కుమార్ సంజయ్ కృష్ణ సంతకం చేశారు.

ఈ ఒప్పందం అస్సాం ప్రజలతో పాటు బోడో తెగకు మంచి భవిష్యత్తును నిర్ధారిస్తుందని కేంద్ర హోం మంత్రి అమిత్‌షా అన్నారు. 1,550 బోడో సభ్యులు 130 ఆయుధాలతో 2020 లో లొంగిపోతారని ప్రధాని మోడీ చెప్పారు. అన్ని వాగ్దానాలు సమయానుసారంగా నెరవేరుతాయని ఆయన ప్రతినిధులందరికీ భరోసా ఇచ్చారు. ఈ ఒప్పందం తరువాత బోడో గిరిజనులకు రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలు లభిస్తాయి. ఈ ఒప్పందం సమాజానికి కొన్ని రాజకీయ హక్కులు, కొన్ని ఆర్థిక ప్యాకేజీలను అందిస్తుంది. ఈ ఒప్పందం బోడో భాష, సాంస్కృతిక, ప్రాంతీయ భద్రతకు హామీ ఇస్తుంది.

27 బోడో తెగలతో భారత ప్రభుత్వం ఇప్పటివరకు మూడు సంవత్సరాలుగా మూడు ఒప్పందాలు కుదుర్చుకుంది. అస్సాం ప్రభుత్వం, ఉగ్రవాద గ్రూపుల మధ్య అనేక ఘర్షణలు జరిగాయి. వందలాది మంది ప్రాణాలు కోల్పోయారు. ఆల్ బోడో స్టూడెంట్స్ యూనియన్ (ఎబిఎస్‌యు), భారత ప్రభుత్వం 1993లో మొదటి ఒప్పందంపై సంతకం చేశాయి. ఈ ఒప్పందం ఫలితంగా కొన్ని రాజకీయ అధికారాలతో బోడోలాండ్ అటానమస్ కౌన్సిల్ ఏర్పడింది. రెండవ బోడో ఒప్పందం 2003లో భారత ప్రభుత్వం, ఉగ్రవాద సంస్థ బోడో లిబరేషన్ టైగర్స్ మధ్య జరిగింది. రెండవ ఒప్పందం ఫలితంగా ఉదాల్‌గురి, చిరాంగ్, బాస్కా, కొక్రాజార్ అనే నాలుగు జిల్లాలతో బోడోలాండ్ టెరిటోరియల్ కౌన్సిల్ (బిటిసి) ఏర్పడింది. ఈ ప్రాంతాలను సాధారణంగా బోడోలాండ్ టెరిటోరియల్ ఏరియా డిస్ట్రిక్ట్స్ అంటారు. బోడో తెగల విద్య, ఉద్యానవన, అడవులు వంటి సమస్యలను చూసేందుకు బోడోలాండ్ టెరిటోరియల్ కౌన్సిల్ (బిటిసి) ను ఏర్పాటు చేశారు. అయితే, పోలీసులు, సాధారణ పరిపాలన, ఆదాయాన్ని మాత్రం అస్సాం ప్రభుత్వం నియంత్రిస్తుంది. భారత రాజ్యాంగంలోని 6వ షెడ్యూల్ కింద బిటిసి స్థాపించబడింది.

బోడో బ్రహ్మపుత్ర నది లోయ ఉత్తర భాగంలో స్థిరపడిన అస్సాంకు చెందిన అతిపెద్ద తెగ. ఈ గిరిజనులు తమను అస్సాం స్థానికులుగా పేర్కొన్నారు. ఒక అంచనా ప్రకారం, బోడో తెగ అస్సాం జనాభాలో 28 శాతం ఉంది. బోడో తెగ అస్సాంలో తమ భూమిని ఇతర సంస్కృతులు, వర్గాలు వేర్వేరు గుర్తింపులతో ఆక్రమించాయని ఆందోళన చేస్తున్నారు. 1966లో బోడో గిరిజనులు ప్లెయిన్స్ ట్రైబల్ కౌన్సిల్ ఆఫ్ అస్సాం (పిటిసిఎ) ను ఏర్పాటు చేసి ప్రత్యేక కేంద్ర భూభాగం ఉదయచల్‌ను డిమాండ్ చేశారు. బోడో ఉద్యమం 1980ల తరువాత నిర్బంధాన్ని ఎక్కువ ఎదుర్కొంది.

ఈ ఉద్యమం మూడు సమూహాలుగా విభజించబడింది. మొదటి సమూహం నేషనల్ డెమొక్రటిక్ ఫ్రంట్ ఆఫ్ బోడోలాండ్ (ఎన్‌డిఎఫ్‌బి). ఇది తనకోసం ప్రత్యేక రాష్ట్రం కావాలని డిమాండ్ చేస్తోంది. రెండవ సమూహం బోడో లిబరేషన్ టైగర్ (బిఎల్‌టి). ఇది ఎక్కువ స్వయం ప్రతిపత్తిని కోరుతోంది. ఇది బోడోయేతర సమూహాలను లక్ష్యంగా చేసుకుంది. మూడవ సమూహం ఆల్ బోడో స్టూడెంట్స్ యూనియన్ (ఎబిఎస్‌యు). వీళ్లు ఎక్కువ రాజకీయ అధికారాలు, రాష్ట్ర పరిపాలనలో తమ వాటా ఉండాలని అంటారు. అలాగే తమ అదుపులోనే అధికార

వర్గం ఉండాలని కోరుకుంటున్నారు.

ఈ ప్రాంతంలో బోరోస్ లేదా బోడోస్ లేదా కాచారిస్, ఇతర వలసదారులు నివసించేవారు. 1826లో మొదటి ఆంగ్లో-బర్మీస్ యుద్ధంలో విజయం సాధించిన తరువాత బ్రిటిష్ వారు యాండాబో ఒప్పందం ద్వారా ఈ ప్రాంతంపై నియంత్రణ సాధించారు. ఈ యుద్ధం ప్రధానంగా బ్రిటిష్, బర్మీస్ సామ్రాజ్యాల మధ్య ఈశాన్య భారతదేశపు నియంత్రణ కోసం జరిగింది. బ్రిటిష్ రాజ్ కాలంలో బ్రిటిష్ వారు దీనిని కాచారి ద్వార్స్, కచారి మైదానాలు, కాచారి దేశం అని పిలిచేవారు. బ్రహ్మపుత్ర లోయలోని బోడో ప్రజలు ఆర్యన్, షాన్ ఆక్రమణదారులు, స్థిరనివాసుల ఆధిపత్యంలో ఇబ్బందులను ఎదుర్కున్నారు. దిగువ అస్సాం, ఉత్తర బెంగాల్‌లోని వివిధ ప్రాంతాలను పరిపాలించిన కోచ్‌జాతి వారు ఇప్పుడు క్రమంగా పాక్షిక హిందూ మతం కలిగిన ఆదిమ కులంగా మారారు. కోచ్ సామ్రాజ్యపు రాజకుటుంబం వారు, కోచ్ కులానికి చెందిన ఆదివాసి సభ్యులు బోడో భాష మాట్లాడేవారని చారిత్రకంగా నిరూపించబడింది.

ఈశాన్య భారతదేశంలోని ఇతర ప్రాంతాలతో పాటు, ఈ ప్రాంతంలో ప్రాంతీయ ఆకాంక్ష 1980లలో ఒక ఉద్వేగమైన మలుపు తిరిగింది. ఈ ప్రాంతం కొండలతో నిండి ఉండడం, దాని సంక్లిష్ట సామాజిక స్వభావం, దేశంలోని ఇతర ప్రాంతాలతో పోలిస్తే దాని వెనుకబాటుతనం అన్నీ స్వయం ప్రతిపత్తి డిమాండ్‌ను ముందుకు తీసుకెళ్లాయి. స్థానికులైన వీరి మీద స్థానికేతరుల పెత్తనాన్ని, దోపిడీని నిరసిస్తూ పెద్దఎత్తున ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తి కోసం ఉద్యమాలు చేశారు. దీనిని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వేర్పాటు ఉద్యమాలని, ఉద్యమకారులపై పెద్ద ఎత్తున హింసను ప్రయోగించి అణచడానికి చూశాయి. ఈ ప్రాంతం భారతదేశంలోని ఈశాన్య ప్రాంతానికి ప్రవేశ ద్వారం.

ఇక్కడ ప్రధాన విద్యార్థి సంస్థలలో ఒకటైన ఆల్ బోడో స్టూడెంట్స్ యూనియన్, నేషనల్ డెమోక్రటిక్ ఫ్రంట్ ఆఫ్ బోరోలాండ్ – ప్రోగ్రెసివ్, నేషనల్ డెమోక్రటిక్ ఫ్రంట్ ఆఫ్ బోరోలాండ్ – డి.ఆర్ మూడు డజన్లకు పైగా బోడో సంఘాలు, పార్టీలు బోరోలాండ్ ఉద్యమం కోసం పనిచేస్తున్నాయి. వీరందరూ పీపుల్స్ జాయింట్ యాక్షన్ కమిటీని ఏర్పాటు చేసుకున్నారు. వీరు భారత ప్రభుత్వం నుండి ప్రత్యేక రాష్ట్రం (ఇండియన్ యూనియన్ లోపల)ను కలిగి ఉండాలని కోరుతున్నారు. గణనీయమైన బోడో జనాభాను కోక్రాజార్, చిరాంగ్, బక్సా, ఉదల్‌గురి, సోనిత్‌పూర్, లఖింపూర్, అస్సాంలోని ధేమాజీలోని ఏడు జిల్లాలు కల్గివున్నాయి. ఈ ప్రాంతాల్లో బోడో ఉద్యమం తీవ్రస్థాయిలో ఉంటుంది. బోడో తిరుగుబాటు సమూహాలు సార్వభౌమ రాజ్యం (పూర్తి స్వాతంత్ర్యం) గా వారి ప్రాంతాన్ని ప్రకటించుకున్నాయి.

బోడోలాండ్ ఉద్యమం మిజోరాంలోని మిజో నేషనల్ ఫ్రంట్ తరహా మిలిటెంట్ ఉద్యమం. ఎందుకంటే వారి పోరాటంలో అనేక గుణాత్మక మార్పులు జరుగుతున్నాయి. పోరాటం ద్వారా ప్రత్యేక అధికారాలతో పూర్తి స్థాయి రాష్ట్ర హోదా వారికి లభించినట్టుగా వారు భావిస్తున్నారు. రెండు వర్గాల మధ్య ఆధిపత్యపోరు ప్రజలను చాలా ఇబ్బందుల పాలు చేస్తుందని మేధావులు భావిస్తారు. నిజానికి ఏ పోరాటమైనా విశాల ప్రజానీకం మద్దతు లేకుండా విజయం సాధించదు. 1993లో ఒక ఒప్పందం జరిగింది. భారత రాజ్యాంగం ఆరవ షెడ్యూల్ ప్రకారం బోడోలాండ్ అటానమస్ కౌన్సిల్ చేత నిర్వహించబడుతున్న 8,795 కిమీ 2 విస్తీర్ణంలో ఏర్పడిన స్వయంప్రతిపత్తి పరిపాలనా విభాగంగా మారింది. శాంతి ఒప్పందం తరువాత, బోడోలాండ్ టెరిటోరియల్ కౌన్సిల్ 2003లో ఏర్పడింది. ఆర్థిక, విద్య, భూ హక్కుల పరిరక్షణ, భాషా ఆకాంక్ష, సంస్కృతి, బోడోస్ జాతి గుర్తింపు లాంటి అంశాలకు ఈ ఒప్పదంలో హామి ఇవ్వబడింది. అన్నింటికంటే వారు ఆశించింది బోడోలాండ్ ప్రాంతంలోని ప్రజలకు మౌలిక సదుపాయాల అభివృద్ధిని వేగవంతం చేయాలని. కౌన్సిల్‌లోని 12 మంది సభ్యులను తాత్కాలికంగా ఏర్పాటు చేయడం ద్వారా 2003 డిసెంబర్ 7న కౌన్సిల్ పనిచేయడం మొదలైంది.

2005 మే 13న కౌన్సిల్ ఎన్నికలు జరిగాయి. నవంబర్ 2005లో జరిగిన ఉప ఎన్నిక తరువాత, బోడోలాండ్ టెరిటోరియల్ ఏరియా జిల్లాల్లో అభివృద్ధి పనులను చూసేందుకు 40 మంది సభ్యుల శాసన మండలిని ఏర్పాటు చేశారు. మిగిలిన ఆరుగురు సభ్యులను అస్సాం గవర్నర్ ప్రాతినిధ్యం వహించని సంఘాల నుండి నామినేట్ చేశారు. కౌన్సిల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యుడిగా పిలువబడే బిటిసి ప్రాంతంలోని అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న కౌన్సిల్‌లో మొత్తం 46 మంది సభ్యులు ఉన్నారు. బోడోలాండ్ ప్రాంతంలో పరిపాలనా ప్రయోజనం కోసం నాలుగు జిల్లాలను ఏర్పర్చుకున్నారు. వీటిని 10 సివిల్ సబ్ డివిజన్లు, 40 డెవలప్‌మెంట్ బ్లాక్‌లుగా విభజించారు.

తాజా పరిణామాలు అస్సాంలో చోటుచేసుకోవడానికి రాజకీయ కారణాలు ఉన్నాయి. బోడో ఉద్యమం వారి ప్రాంత అభివృద్ధి కొరకు రాజీ ధోరణిని అవలంభిస్తోంది. మరోవైపు ఎన్ఆర్‌సి గణాంకాల వల్ల అస్సాంలో 19.5 లక్షల మంది ఎటువంటి గుర్తింపు లేకుండా ఉన్నారు. వాళ్లల్లో 14 లక్షల మంది హిందువులు. ఎన్ఆర్‌సి హిందువులకు ఆగ్రహం తెప్పించింది. వారంతా శరణార్థుల శిబిరంలో ఉండి కష్టాలు పడుతున్నారు. ఇది దేశవ్యాప్త నిరసనలకు దారితీసి, ఏకంగా సిఎఎ, ఎన్ఆర్‌సిల రద్దు ఉద్యమంగా మారింది.

ట్రిపుల్ తలాక్, బాబ్రీ మసీదు స్థల మార్పు లాంటి అంశాలతో భారతీయ ముస్లింలు అభద్రతా భావంతో నలిగిపోతున్నారు. ఎప్పుడూ రాని విధంగా లక్షల మంది ముస్లింలు వీధుల్లోకి వచ్చి మోడీకి వ్యతిరేకంగా మాట్లాడుతున్నారు. మరోవైపు మోడీ ప్రభవం తగ్గిపోతున్నది. అందువల్ల అస్సాంలో కొంతవరకన్నా బిజెపి వ్యతిరేక ధోరణిని తగ్గించాలని అమిత్‌షా, మోడీ భావించారు. అందుకే బోడోలతో ఒప్పందం చేసుకుని, ప్యాకేజీ ఇచ్చారు. అందువల్లే అస్సాం గడ్డ మీద మోడీ కాలు మోపగలిగారు.

నిరంకుశ పరిపాలనను ప్రజల మీద రుద్దితే అవాంతరాలు ఎదురు కాక తప్పదు. ఢిల్లీ ఎన్నికల్లో బిజెపి ఓడిపోవడానికి వారి ఏకపక్ష ప్రజా వ్యతిరేక పరిపాలనా విధానాలే ప్రధాన కారణంగా ఉన్నాయి. ప్రజలు మౌలిక సౌకర్యాలను అడుగుతున్నారు. మతపరమైన పాలనను అడగడం లేదు. బిజెపి భారతదేశ ప్రజల అభివృద్ధి కోసం పనిచేయాలి. హిందూ అగ్రవర్ణ కార్పొరేట్లకు ప్రయోజనం చేకూర్చే విధానాలను మానుకోవాలి.

*(రచయిత పౌరహక్కుల సంఘం సభ్యులు)* వీ

# వ్యవసాయ వైవిధ్యంతోనే ఆహార భద్రత సాధ్యం

*అధిక దిగుబడి పేరుతో హైబ్రిడ్ పంటల వైపు వెళ్లకుండా దేశీయ వంగడాలను అభివృద్ధి చేసి సాగుచేయడం వల్ల పోషకాలు విరివిగా ఉండి భారతదేశ ఆహార, ఆరోగ్య భద్రతకు తోడ్పడతాయని అంటున్నారు* **వి. వరదరాజు**

**భా**రతదేశంలో ఆకలి మంటలు చల్లారలేదని ప్రపంచ ఆకలి సూచి చెబుతున్నది. అర్హతగల 117 దేశాల అధ్యయనంలో ఇండియాది 102వ స్థానం. ఇది దేశ ప్రగతిని తెలిపే ముంజేతి కంకణం. వయస్సు, బరువు ఆధారంగా నిర్ణయించిన శక్తి జనకాలు (కేలరీలు), మాంసకృత్తులు (ప్రోటీన్లు), సూక్ష్మ పోషకాలు (మైక్రో న్యూట్రియంట్స్) తగు పాళ్లలో శరీరానికి లభించకపోవడమే 'ఆకలి' అని నిపుణులు చెబుతారు. దీన్నే పోషకాహార లోపమని కూడా అంటారు. దేశంలోని ప్రతి 10 మంది పిల్లలో నలుగురు పోషకాహార లోపంతో బాధపడుతున్నారు. అంటే దాదాపుగా 40 శాతం మంది పిల్లలను తీవ్ర పోషకాహార లోపం వేదిస్తున్నది. ఇదే లోపం స్త్రీలను ఎనిమియాకు గురయ్యేలా చేస్తున్నది. 15 – 49 మధ్య వయస్సు స్త్రీలలో సగం మందికి రక్తలేమి ఉన్నదని ఆరోగ్య సర్వేలు తెలుపుతున్నాయి.

మానవ వనరుల శాఖ దేశంలోని అన్ని బడుల్లో పోషకాహార తోటల పెంపకానికి ఇటీవల మార్గదర్శకాలు విడుదల చేసింది. విద్యార్థులతో 'ఇకో క్లబ్బులు' ప్రారంభించి, స్థానిక వాతావరణం, నేలకు అనువైన కూరగాయలు, పండ్లు పెంపకం చేయమంది. అవి మధ్యాహ్నం భోజనానికి ఉపయోగపడడంతో పాటుగా మరెన్నో లాభాలు చేకూర్చగలవంది. విద్యార్థులు కలసికట్టుగా పనిచేయడం, పరిసరాల పై అవగాహన, పరిరక్షణ, విషయ వివరణ వంటి జీవితాంతం పనికొచ్చే నైపుణ్యాలు అబ్బుతాయని పేర్కొంది. ఇకో క్లబ్బు ద్వారా వచ్చిన అనుభవం ఇంటి దగ్గర కూడా కూరగాయలు, పళ్ల పెంపకం చేసేలా చేస్తుందంది.

వ్యవసాయ వైవిధ్యం అంటే వైవిధ్యం కల పంటలు, పలు రకాలు సాగుచేయడం. వాటిని వృద్ధి పరచుకోవడం. క్షీణిస్తున్న భూసారాన్ని వ్యవసాయ వైవిధ్యం సహజ మార్గంలో పెంపొందిస్తుంది. ఇది ఆహార భద్రత, పోషకాహార లభ్యత కలిగిస్తుంది. ప్రజారోగ్యానికి భరోసానిస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా 2 లక్షల 50 వేల వృక్ష జాతులను శాస్త్రవేత్తలు గుర్తించారు. దాదాపు 5 ఏడు వేల రకాలు పండించే వారని చరిత్ర చెబుతోంది. నేడు ప్రపంచ వ్యవసాయానికి 30 రకాలే ఆధారం. ప్రపంచ జనాభాకు దినసరి ఆహారంలో సగం కేలరీలను అందిస్తున్నవి వరి, గోదుమ, జొన్నలే. వివిధ పంటలు, పశు సంపద అభివృద్ధి కోసం జన్యు వైవిధ్యంగల పంటలు, పశువులు వీటిపై ఆధారపడిన మిత్ర వన్య జీవులే మూలాధారం. సుసంపన్నమైన జన్యు నిధి లేకుండా వేలాది రకాల పంటలు, పశు జాతులను మనం కలిగుండలేం. పలురకాల వరి, వంకాయలు, నిమ్మ, అరటి, దోస జాతులకు ఇండియా సహజ ఆవాసం.

ప్రపంచ ప్రాముఖ్య వ్యవసాయ వారసత్వ విధానాలు 37 ఉన్నాయి. కాశ్మీర్ కుంకుమ పువ్వు, కోరాపుట్ సంప్రదాయ వ్యవసాయం, కుట్టు నాడు సముద్ర దిగువ భాగపు వ్యవసాయం భారతదేశ ప్రత్యేకం. భారతదేశంలో 811 వ్యవసాయ వంగడాలు, 902 వీటి మిత్ర వన్య జీవులను శాస్త్రవేత్తలు గుర్తించారు. ఇక్కడ పశు గణ జన్యు సంపద కూడా ఎక్కువే. పశువుల్లో 42, గేదల్లో 15, గొర్రెల్లో 34, మేకల్లో 43, కోళ్లు 19 రకాలు ఉన్నాయి.

నుడుల్స్, బిస్కెట్లు, సేమియా, పాయసం, పరోటాలు, అరిసెలు, చలిమిడి, పులిహోర, పలావ్, పులగం, పొంగలి, రవ్వ దోస, ఉప్మా ఇలా వందల రకాలు వరి, గోదుమలుతో ఆహార పదార్థాలు చేసుకుంటాం. తింటాం. ఇవన్నీ వరి, గోదుమలకు ఉప్పు, కారం, నూనె, చక్కెర, మసాలాలను వండే వంటకాన్ని బట్టి అవసరమైన వాటిని చేర్చి చేసినవే ఎక్కువ. వినియోగంలో ఉన్న పప్పులు, కాయగూరల సంఖ్య కూడా తక్కువే. నాగరికతతో పాటు తినే రుచుల సంఖ్య చాలా పెరిగింది. కాని ఆహారంలో పోషకాల సంగతి వదిలేశాం. కూరగాయల సంచిలోకి వివిధ రకాల కూరగాయలు, గింజలు, పళ్లు, దుంపలు తదితర సహజ దినుసులు చేరితేనే మనకు పోషకాహారం అందుతుంది. పోషకాల కోసం కృత్రిమంగా బలపరచిన ఆహారం, విటమిన్ టాబ్లెట్స్‌పై ఆధారపడే అవసరం తగ్గుతుంది.

మనందరిలో సహజ పోషకాహారంపై అవగాహన పెరగాలి. మునగ పోషకాల గని. అందుబాటులో ఉండేది. కాని మునగ కాయలనే అందరం ఎక్కువగా తింటాం. కారణం బజార్లో ఇవే దొరుకుతాయి. ఆహారపు అలవాట్లపై మార్కెట్ ప్రభావం తక్కువేమీ కాదు. మునగాకులో పోషకాలు ఎక్కువగా లభిస్తాయి. ఈ ఆకులో కేరట్లో ఉండే విటమిన్ 'ఏ' కన్నా 7 రెట్లు అధికం. ఏ విటమిన్ కంటి చూపు మెరుగు పరుస్తుంది. కమలా పండులో దొరికే 'సి' విటమిన్ కన్నా 4 రెట్లు ఎక్కువ. సి విటమిన్ యాంటీ ఆక్సిడెంట్. ఇది ఫ్రీరాడికల్స్ అదుపు చేస్తుంది. పెరుగులో లభించే మాంసకృత్తులు కంటే ఎక్కువ ఉంటాయి. కండర పోషణకు మాంసకృత్తులు అవసరం. మునగ చెట్టును సులభంగా పెరడులో పెంచుకోవచ్చు. వివిధ కూరగాయలు గూర్చి మన అవగాహన పెంచేందుకు మీడియా తన వంతు సహాయం చేయాలి.

జాతీయ జీవ వైవిధ్య సంస్థ దేశ వ్యాప్తంగా వ్యవసాయ వైవిధ్యం విస్తరణకు పలు సిఫారసులు చేసింది. వ్యవసాయ వైవిధ్యం అంటే దేశీయ పంటలను, పశు పక్షాదులను పర్యావరణ హితకరంగా వృద్ధి చేయడం. సరళ పర్యావరణ భాషలో చెప్పాలంటే దేశ జన్యు సంపదను కాపాడుకోవడం.

# ఇయు కూటమికి బ్రిటన్ వీడ్కోలు

***బ్రిటన్ పాలకుల పట్ల ప్రజల్లో ఏర్పడిన అసమ్మతిని, పాలనా వైఫల్యాలను కప్పిపుచ్చుకోవడానికి ఇయు కూటమి నుండి వైదొలగడమే పరిష్కారంగా చూపుతూ తప్పుదోవ పట్టిస్తున్నారని అంటున్నారు సంతోష్***

ఎట్టకేలకు బ్రిటన్ కోరిక నెరవేరింది. ఇయు పార్లమెంట్‌లో భావోద్వేగాల నడుమ వాడివేడి చర్చల అనంతరం జనవరి 31న 621-49 ఓట్ల తేడాతో సభ్యులు బ్రెగ్జిట్‌కు అంగీకారం తెలిపారు. ఇయు సంప్రదాయ పాటతో బ్రిటన్‌కు వీడ్కోలు పలుకుతూ దాదాపు 50 ఏండ్ల పాటు సాగిన తమ స్నేహాన్ని స్మరించుకున్నారు. ఇయు నుంచి బ్రిటన్ వైదొలిగిన తర్వాత ఏం చేయాలనే అంశంపై జాన్సన్ త్వరలో విధానపరమైన నిర్ణయం తీసుకునే అవకాశముంది. 47 ఏళ్లు ఇయులో సభ్యదేశంగా కొనసాగిన బ్రిటన్ ఇక నుంచి స్వతంత్ర రాజ్యంగా కొనసాగనుంది. యూరోపియన్ యూనియన్ (ఇయు)తో గత 47 ఏళ్లుగా సాగుతున్న అనుబంధాన్ని జనవరి 31 అర్ధరాత్రి 11 గంటలకు బ్రిటన్ తెంచుకుని బయటికి వచ్చేసింది. అదే రాత్రి బ్రస్సెల్స్‌లోని ఇయు ప్రధాన కార్యాలయం వద్ద బ్రిటన్ జెండాను తొలగించారు. ఇయు పార్లమెంట్ సభ్యులు మొత్తం 751 కాగా అందులో బ్రిటన్‌కు చెందిన 73 మంది సభ్యత్వాన్ని రద్దు చేశారు. నాలుగేళ్లుగా బ్రిటన్‌లో రాజకీయ సంక్షోభంగా మారిన బ్రెగ్జిట్ వివాదానికి తెరపడింది. బ్రెగ్జిట్ మరో కొత్త శకానికి నాంది అని ఈ సందర్భంగా ప్రధాని బోరిస్ జాన్సన్ ప్రకటించారు. ఆయన ప్రత్యేకంగా విడుదల చేసిన వీడియోలో 'చీకట్లు తొలగిపోతున్న వేళ ఘనమైన మన జాతి కొత్త పాత్ర ఆవిష్కృతం కానుంది. ప్రతి ప్రాంత వాసుల కలలు సాకారం కానున్నాయి. బ్రెగ్జిట్ కేవలం న్యాయపరమైన చర్య కాదు. జాతి పరివర్తన, పునరుత్తేజం పొందే క్షణం' అని పేర్కొన్నారు. 'ఇయు నుంచి విడిపోవడంతో మన విధానాలను స్వేచ్ఛగా అమలు చేసే అవకాశం వచ్చిందని, భారత్ సహా 13 దేశాలతో వాణిజ్య సంబంధాలు బలోపేతం చేసుకుంటాం' అని అన్నారు. దేశ చరిత్రలో ఇది గొప్ప ఘటన అని బ్రెగ్జిట్ అనుకూల నేత నిగెల్ ఫరాజ్ వ్యాఖ్యానించారు.

బ్రెగ్జిట్‌ను విద్యావేత్తలు, నిపుణులు అంగీకరించడానికి సిద్ధంగాలేరు. భవిష్యత్‌ను పునర్నిర్మించుకోవడంలో ఎన్నో కష్టనష్టాలను వారు ఊహిస్తున్నారు. 'బ్రెగ్జిట్ డే విచారకరమైన రోజు, ఈ రోజుతో ఒక శకం ముగియనుంది, ఏమి జరుగుతుందో తెలియని భవిష్యత్తులోకి వెళ్తున్నాం' అని బ్రిటన్ సామాజిక మేధావులు ఆందోళన చెందుతున్నారు. ఎన్ని లోటు పాట్లున్న ఇయుతోనే ముందుకు సాగితే బాగుండేదని వారు భావిస్తున్నారు. ఇప్పుడు ప్రజలను అనిశ్చితి వెంటాడుతున్నది. ' బ్రిటన్ ఏమి చేస్తుంది, ఇప్పుడేమి జరుగుతుంది, ఇక్కడనుండి ఎక్కడికి వెళ్లాలి' వంటి ప్రశ్నలు రాజకీయ, సామాజిక వర్గాల్లో చర్చనీయాంశం అయ్యాయి. ఎందుకంటే, బ్రెగ్జిట్ తదుపరి భవిష్యత్ బాట ఏమిటో రూపొందించకుండా ప్రధాని జాన్సన్ తన మితవాద కార్పొరేట్ వర్గాలను సంతృప్తిపరచడానికే మొండిగా ముందుకెళ్లారనే విమర్శలు వస్తున్నాయి. బ్రిటన్ పాలకులు తమపాలన వైఫల్యాల్ని ఇయు వైఫల్యంగా ప్రజలను నమ్మించడంతో సఫలమయ్యారు. సహజంగానే, ప్రజలు మితవాద శక్తుల వలలో చిక్కారు. మొత్తం పరిస్థితులు గందరగోళంగా మారాయి.

---

తేనెటీగలు, సీతాకోక చిలుకలు, మరి కొన్ని కీటకాలు పంటల పరపరాగ సంపర్కానికి తోడ్పడతాయి. అలాగే పంటలను ఆశించే చీడ పురుగులను అదుపు చేసే కీటకాలను ప్రకృతి అందిస్తుంది. వీటిని వ్యవసాయ మిత్ర జీవులనవచ్చు. ఇవన్నీ పంటల దిగుబడిని పెంచడానికి సహకరిస్తాయి. వ్యవసాయ మిత్ర జీవుల రక్షణ అవసరాన్ని, అందుకు అవసరమైన సహజ చర్యలను తెలిపింది.

బయో విలేజ్ కాన్సెప్ట్ సూచించింది. ఒక గ్రామాన్ని యూనిట్‌గా తీసుకోవాలి. గ్రామంలోకి హైబ్రిడ్ వంగడాలు ప్రవేశించక ముందరి కాలంలో ఏఏ పంటలు సాగు చేసేవారో వాటినన్నిటిని పర్యావరణ హితకరంగా పండించడం బయో విలేజ్ లక్ష్యం. దేశీయ కోళ్లు, పక్షులు, పశువులను పెంచే వారికి ప్రోత్సాహకాలు ఇవ్వడం, సంప్రదాయ వ్యవసాయ విధానాల డాక్యుమెంటీకరణ, జన్యు సంపదను పటిష్ట పరచడానికి దేశ వ్యాప్తంగా జీవ వైవిధ్య కమిటీలను ఏర్పరచడం వంటి ముఖ్యమైన సూచనలు చేసింది.

అధిక దిగుబడుల కోసం హైబ్రీడ్ వంగడాలపై ఆధారపడ్డాం. కాని దేశీయ వంగడాలను భద్రపరచడం అశ్రద్ధ చేశాం. ఇదే దేశ జన్యు వనరులకు అపార నష్టం కలిగించింది. పాలు, మాంసం, గుడ్లు అధిక ఉత్పత్తి కోసం పంటల దిగుబడులకు అనుసరించిన విధానాన్నే అనుసరించడం వలన దేశీయ జంతు వనరులు క్షీణించాయి. హైబ్రీడ్ పంటల ప్రోత్సాహం, ప్రజా పంపిణీ వ్యవస్థ, మధ్యాహ్న భోజన పథకం, ఇలా ఆహార భద్రత కోసం లక్ష్యించిన పథకాలు చాలా ఉన్నాయి. ఇవేవి ఆశించిన ఫలితాలు ఇవ్వలేదు. ఆహార వినియోగం, పంటలు వేసే పద్ధతిలో మార్పులు రావాలి. జిహ్వా చాపల్యాన్ని అదుపులో ఉంచుకోవాలి. అశ్రద్ధ చేసిన దేశీయ వరి, కూరగాయలు, తదితర పంటలు పండించాలి. ఏ రుతువులో పంటలను ఆ రుతువులోనే పండించాలి. పోషకాలు ఆవిరి కాకుండా వంటలు చేసుకోవాలి. ఇవి భారతదేశ ఆహార భద్రతకు, జన్యు వనరుల సంరక్షణకు సోపానాలు. వీ

*(రచయిత హెర్బలిస్ట్)*

**బ్రెగ్జిట్ ఎందుకు?**

బ్రిటన్ ఎందుకు 'బ్రెగ్జిట్' అవుదామనుకుంది. యూరోపియన్ యూనియన్ దేశాల మధ్య వాణిజ్యం నిర్వహణకే గాక, విదేశాలతో వాణిజ్యానికి సంబంధించి స్థూల మార్గదర్శకాలను కూడా ఇయు ఆర్థిక కూటమి నిర్ణయించేది. దీంతో స్వతంత్ర రాజ్యాలకు వాణిజ్య స్వేచ్ఛ బహుపరిమితమైంది. బయటకు వస్తేనే స్వతంత్ర నిర్ణయాధికారాలతో బ్రిటన్‌కు మంచి భవిష్యత్ ఉంటుందని యు.కె. ప్రభుత్వం భావిస్తున్నది. బ్రిటన్ పాలకులు అనుసరించిన ప్రపంచీకరణ విధానాలు ప్రజల్లో అసమానతలు పెంచాయి. ప్రజా వ్యతిరేక రాజకీయార్థిక విధానాల వల్ల నిరుద్యోగం పెరిగింది. సంక్షేమానికి కోత పడింది. సబ్సిడీల కోతలు, ప్రాంతీయ నిర్లక్ష్యం, వాస్తవ వేతనాల తగ్గుదల, ఉద్యోగ అభద్రత, కార్మికుల వలసలు, సంపదలో తీవ్రమైన అసమానతలపై ప్రజల్లో పెరిగిపోయిన అసమ్మతి బ్రెగ్జిట్‌కి దారితీసింది. అన్ని అనారోగ్యాలకు ఇదే సర్వరోగ నివారిణిగా రాజకీయ నాయకులు దీనిని చూపించారు. పాలకుల పట్ల ప్రజల్లో పెరిగిన అసమ్మతిని పక్కదారి పట్టించేందుకే బ్రెగ్జిట్ నినాదాన్ని తెచ్చారు. ఇయులో ఉండడమే ప్రజలెదుర్కొంటున్న సమస్యలకు కారణమని ప్రజల్లో జాతీయ ఉన్మాదాన్ని రెచ్చగొట్టారు.

యూరోపియన్ యూనియన్‌లో సభ్య దేశంగా కొనసాగడం వల్ల బ్రిటన్‌కు పొరుగు దేశాల నుంచి వలసలు పెరిగిపోతున్నాయని, సొంత దేశంలోని ప్రజలకు అన్ని రంగాల్లోనూ అవకాశాలు తగ్గిపోతున్నాయని ఊదరగొట్టారు. బ్రిటన్ జనాభాలో దాదాపు 21.5 లక్షల మంది ఇతర దేశాల నుంచి వలస వచ్చిన వారేనని గణాంకాలు చూపారు. వీరే నిరుద్యోగానికి కారణమని ప్రజలను నమ్మించారు. దేశ ఆర్థిక వృద్ధి రేటు పడిపోవడం, బ్రిటన్‌లో పుట్టి పెరిగిన వారికి ఉపాధి అవకాశాలు తగ్గిపోవడం, ఉద్యోగుల వేతనాల వృద్ధిలోనూ స్తబ్దత నెలకొంది. ఈ కారణాలన్నింటి దృష్ట్యా ఇయు బంధనాల నుంచి బయటపడడమే శ్రేయస్కరమని మెజారిటీ బ్రిటిష్ పౌరులను ఒప్పించగలిగారు. అందువల్లనే 'బ్రెగ్జిట్'కు ఆర్థికంగా వెనుకబడిన వర్గాల వారి మద్దతు లభించింది. ఈ నేపథ్యంలో ఇయు నుంచి బయటికి వచ్చేసి స్వతంత్ర దేశంగా కొనసాగాలనేది బ్రిటన్ ప్రజల యోచనగా మారింది.

**నాలుగేళ్ల బ్రెగ్జిట్ రాద్ధాంతం**

యూరోపియన్ యూనియన్ నుంచి బ్రిటన్ బయటికి వచ్చేయాలని అనుకున్నప్పుడు దీనిపై ప్రజాభిప్రాయం 2016 జూన్‌లోనే అనుకూలంగా తీర్పు చెప్పింది. అయినా బ్రెగ్జిట్‌కి నాలుగేళ్లు పట్టింది. దీనికి కారణం.. దీనికి సంబంధించిన ఒప్పందం ఖరారు అయ్యే విషయంలో మూడుసార్లు బ్రెగ్జిట్ బిల్లు అక్కడి చట్టసభల ముందుకు వచ్చినా.. ఆమోదయోగ్యమైన ఒప్పందం కుదరక వీగిపోయింది. ఈ క్రమంలో నాటి ప్రధాని థెరిసా మే ప్రధాని పదవికి 2019 జూలై 24న రాజీనామా సైతం చేయాల్సి వచ్చింది. బోరిస్ జాన్సన్ పార్టీ నాయకుడిగా ఎన్నికై అనంతరం ప్రధాని పదవిని చేపట్టారు. 2019 అక్టోబర్ 3న బ్రిటన్ ప్రభుత్వం కొత్త బ్రెగ్జిట్ ప్రణాళికను ఇయుకి పంపింది. అక్టోబర్ 28న ఇయు బ్రెగ్జిట్ గడువును జనవరి 31 వరకూ పొడిగించింది. బ్రిటన్‌లో 2019 డిసెంబర్ 12న ఎన్నికలను నిర్వహించేందుకు అక్టోబర్ 29న హౌస్ ఆఫ్ కామన్స్ ఆమోదించింది. ఈ ఎన్నికల్లో బోరిస్ జాన్సన్ నేతృత్వంలోని కన్సర్వేటివ్ పార్టీ ఘన విజయం సాధించింది. దాంతో అంతకుముందు పలుమార్లు ఓటమి పొందిన బ్రెగ్జిట్ ఒప్పందాన్ని బోరిస్ జాన్సన్ 2020 జనవరి 23న అతికష్టం మీద బ్రెగ్జిట్ బిల్లును పార్లమెంట్‌లో ఆమోదింపజేసుకోగలిగారు. రాణీ ఎలిజబెత్ 2 సంతకం చేయడంతో అది చట్టమైంది. దీంతో ఐదు దశాబ్దాలు ఇయు బంధానికి బ్రిటన్ స్వస్తి పలికినట్లయింది.

**ఒకవైపు సంబరాలు – మరోవైపు నిరసనలు**

బ్రెగ్జిట్ సానుకూలవాదులు బ్రిటన్ చరిత్రలో ఈ ఘట్టాన్ని 'నవశకం'గా అభివర్ణిస్తూ లండన్‌లోని పార్లమెంట్ స్క్వేర్ వద్ద ఆ రాత్రి కొవ్వొత్తులు వెలిగించి, సంగీత ఆలాపనలతో వేడుక చేసుకున్నారు. ఈ నిష్క్రమణ యుకెకు కొత్త, ఉజ్జ్వల భవిష్యత్ తెస్తుందని వారి ఆశాభావం. మరోవైపు ఇయులో కొనసాగేందుకు నిర్ణయించుకున్న స్కాట్‌ల్యాండ్ ఇయుకు అనుకూలంగా వేడుకలు నిర్వహించుకుంది. మరోసారి బ్రెగ్జిట్‌పై రెఫరెండం పెట్టాలని డిమాండ్ చేసింది. స్కాట్‌ల్యాండ్ మంత్రి నికోలా స్టర్జన్ తన ట్విట్టర్‌లో యూరోపియన్ యూనియన్ జెండాను చూపిస్తూ తమ దేశం ఐరోపాకూటమి గుండెల్లోనే భద్రంగా ఉంటూ స్వతంత్ర దేశంగా వ్యవహరిస్తుందన్నారు. ఒకప్పుడు బ్రెగ్జిట్‌కు మద్దతిచ్చిన మరోమంత్రి మార్క్ డ్రేక్‌ఫోర్డ్ మాట్లాడుతూ వేల్స్ కూడా యూరోపియన్ దేశంగానే కొనసాగుతుందన్నారు. ఇయులో కొనసాగేందుకు నిర్ణయించిన ఉత్తర ఐర్లాండ్ నేతలు బ్రెగ్జిట్ పట్ల తీవ్ర నిరసన వ్యక్తం చేశారు. స్కాట్లాండ్, ఉత్తర ఐర్లాండ్, లండన్‌లో మెజారిటీ ప్రజలు, యువతలో అత్యధికులు బ్రెగ్జిట్‌కు వ్యతిరేకంగా ఉన్నారు.

యురోపియన్ యూనియన్ నుంచి బ్రిటన్ విడిపోవడాన్నే ఇన్నాళ్లూ 'బ్రెగ్జిట్‌గా అభివర్ణిస్తూ వచ్చారు. బ్రిటన్‌లో ప్రముఖ దినపత్రిక 'ది గార్డియన్'... దీన్ని విషాదకరమైన జాతీయ తప్పిదంగా పేర్కొంది. "చిన్న సందేహమేమంటే... బోరిస్ మితవాద కార్పొరేట్ శక్తులు ఇచ్చిన లక్ష్యంతో హడావుడిగా బ్రెగ్జిట్‌కు వెళ్లారు. దేశం కోసం ఎలాంటి క్రమబద్ధ యంత్రాంగాన్ని ఏర్పాటు చేయకుండానే ఆయన ఈ పనికి పూనుకున్నారు. ఆయన ప్రజల ప్రయోజనాలను కూడా విస్మరించారు" అని గార్డియన్ అభిప్రాయపడింది. బ్రెగ్జిట్ వలన పెనంమీద (ఇయు) నుండి పొయ్యి(ట్రంప్)లోకి యుకె పడినట్లయిందని ది ప్రింట్ ఆన్‌లైన్ పత్రిక ఒక కార్టూన్‌ను ప్రచురించింది. ఈ కార్టూన్‌ను ది టైమ్స్ పత్రికలో ప్రముఖ కార్టునిస్టు పీటర్ బ్రూక్స్ వేశాడు. కన్సర్వేటివ్ ప్రధాని జాన్సన్ అసలైన రహస్య ఎజెండా బ్రిటన్‌లో నూతన మిలిటరీ వ్యవస్థను నెలకొల్పడం, వాణిజ్య యుద్ధం, కార్పొరేట్ల దోపిడీలకై కార్మికులను అణగదొక్కటానికేనని ప్రపంచ సోషలిస్టు వెబ్‌సైట్ వ్యాఖ్యానించింది.

'బ్రెగ్జిట్' అనంతరం బ్రిటన్ ప్రధాని బోరిస్ జాన్సన్ దేశ ప్రజలకు ఒక వీడియో సందేశం పంపారు. అందులో ఈ తాజా పరిణామాన్ని 'నవశకానికి నాంది'గా ఆయన అభివర్ణించారు. దేశంలో పెను మార్పులకు, దేశ పునరుజ్జీవానికి, దేశ అభివృద్ధికి 'బ్రెగ్జిట్ ఎంతగానో ఉపయోగపడుతుందని ఆయన చెప్పుకొచ్చారు. ఇన్నేళ్ల చరిత్రలో 'బ్రెగ్జిట్‌కు గుర్తుగా 50 పెన్స్‌ల కొత్త నాణాన్ని విడుదల చేశారు. ఇవి ఫిబ్రవరి 1

నుంచే చలామణిలోకి వచ్చేశాయి. ఇప్పటివరకూ ఇయు సభ్య దేశాల పౌరులు యుకెలోకి స్వేచ్ఛగా ప్రవేశించేవారు. అయితే ఇకమీదట యూరప్‌లోని ఇతర దేశాల పౌరులు యుకెలోకి రావాలంటే ప్రత్యేక నిబంధనలు ఉంటాయి. పౌరుల పాస్‌పోర్ట్ రంగు కూడా మారనుంది. ఇప్పటివరకు గోధుమ రంగులో ఉన్న ఈ పాస్‌పోర్టులు తిరిగి నీలిరంగులోకి మారనున్నాయి.

## బ్రెగ్జిట్ తదనంతర బ్రిటన్

ప్రపంచానికే ఆదర్శంగా ఐదు దశాబ్దాల క్రితం బహుళపక్ష సహకారం చట్రంలో ఏర్పడిన యూరోపియన్ యూనియన్ ఆర్థిక, రాజకీయ కూటమి నుంచి సంపద్వంతమైన బ్రిటన్ వంటి పెద్ద భాగస్వామి నిష్క్రమించటం ఆ కూటమికి ఇష్టం లేకపోయినా చేయగలిగింది ఏమి లేదు. అయితే పెనవేసుకున్న ఆర్థికబంధం, స్వేచ్ఛగా పౌరుల సంచారం, స్థిరనివాసం వంటి విషయాల్లో పరిష్కరించుకోవలసిన సమస్యలనేకం ఉన్నాయి. అయితే ఈ సంవత్సరం డిసెంబర్ 31 వరకు పరివర్తనాకాలం ఉంది. ఈ కాలంలో ఇయు సింగిల్ మార్కెట్లో బ్రిటన్ పాల్గొంటుంది. ఇయు చట్టం దానికీ వర్తిస్తుంది. ఇయు అంతర్జాతీయ ఒప్పందాలకూ అది కట్టుబడి ఉంటుంది.

అయితే యూనియన్ నుంచి వైదొలగడం ద్వారా యుకె అంతకు ముందు యూరోపియన్ యూనియన్‌తో కుదుర్చుకున్న అనేక అంతర్జాతీయ ఒప్పందాల నుంచి ఆటోమేటిక్‌గా వైదొలిగినట్లవుతుంది. వాణిజ్యం, విమానయానం, మత్స్యవ్యాపారం, పౌర అణుశక్తి సహకారం వంటి అనేక ఒప్పందాలు వాటిలో ఉన్నాయి.

వాతావరణ మార్పు నుంచి సైబర్ నేరాల వరకు, తీవ్రవాదం, అసమానతలు, వలసలు వంటి అంతర్జాతీయ సమస్యలపై కలిసికట్టుగా పనిచేయాల్సిన అవసరముందని, అందువల్ల బ్రిటన్‌తో సహకారం తప్పనిసరి అవుతుందని ఇయు ఆశాభావం వ్యక్తం చేసింది. ఇయులో మిగిలిన 27 దేశాలు కలిసికట్టుగా కొనసాగుతాయని, వాణిజ్యం, పెట్టుబడులు, వాతావరణంలో మార్పులు, డిజిటల్, భద్రత, తీవ్రవాదం, మానవహక్కులు, ప్రజాస్వామ్యం, రక్షణ, విదేశాంగ విధానాలతో ఒక్కటిగా ముందుకు సాగుతాయని భావిస్తున్నది. బ్రిటన్ వైదొలిగిన నేపథ్యంలో మరికొన్ని దేశాలు అదే ఆలోచనలో ఉన్నాయన్న నేపథ్యంలో ఇయు ఈ ఉద్ఘాటనలు చేసింది. ఏమైనా, ఇయు ఇప్పటికీ అతిపెద్ద సింగిల్ మార్కెట్. ఇందులో జనాభా 45 కోట్లు, వ్యాపారాలు 2 కోట్లకు పైగా జరుగుతుంది. ఇయు నుంచి బ్రిటన్ వైదొలగడం వల్ల కొత్త ద్వైపాక్షిక వాణిజ్య ఒప్పందాలు కుదుర్చుకోవాల్సి ఉంటుంది. యుకె సంపన్న దేశమేగాని సంక్షోభరహిత దేశం కాదు.

## ఇయు– బ్రిటన్‌ల మధ్య అప్పుడే పొగలు–సెగలు

ఫిబ్రవరి 3న బోరిస్ జాన్సన్ గ్రీన్‌వీచ్‌లోని ఓల్డ్ రాయల్ నేవల్ కాలేజ్ ఏర్పాటు చేసిన 18వ శతాబ్దపు చిత్రలేఖనాల ఎగ్జిబిషన్‌లో మాట్లాడుతూ ఇయు సమాఖ్య నిబంధనలకు కట్టుబడాల్సిన అవసరం లేదన్నారు. స్వేచ్ఛా వాణిజ్యం పేరిట మార్కెట్ పోటీ నిబంధనలు, సబ్సిడీలు, సాంఘిక భద్రత, పర్యావరణం వంటి అనేక అంశాలతో ఇయు నిబంధనలతో ఏకీభవించవలసిన అవసరం యుకెకు లేదని అవసరమైతే మా నిబంధనలనే ఇయు పాటించవలసి ఉంటుందని ప్రధాని జాన్సన్ అహంభావంతో ప్రసంగించాడు. జీరో టారీఫ్‌లు, జీరో కోటాలు ఇయు కావాలంటుంది. కానీ మాకు సమ్మతమైతేనే ఆమోదిస్తామని లేదంటే స్వేచ్ఛా పోటీ మార్కెట్టుకే ఇయు కట్టుబడి ఉండాలని బోరిస్ అంటున్నారు. దీనికి స్పందనగా "మీకు ఇష్టం లేదని తప్పును మాపై తోసేయకూడదు, మేము మొదటి ప్రాధాన్యతను మా బ్లాక్ పౌరులకు, యూనియన్‌కు, ఇయు వాణిజ్య లావాదేవీలకు ఇస్తామని, లేకుంటే ఇప్పటికీ 'నో డీల్'పై పునపరీక్షిస్తామని, అప్పుడు తలెత్తే సమస్యలకు యుకె బాధ్యత వహించవల్సి వస్తుందని బ్రెగ్జిట్ ఫ్రెంచ్ ఆర్థికవేత్త మైఖెల్ బార్నియర్ ఒక ప్రెస్ మీట్‌లో అన్నాడు. స్వేచ్ఛా మార్కెట్టులో సముద్ర జలాల్లోని చేపల వేటకు కూడా వర్తిస్తుందని చెప్పాడు. 'న్యాయపర స్పర్థలు ఏర్పడినప్పుడు యూరోపియన్ కోర్టుకే తుది తీర్పు చెప్పే అవకాశం ఒప్పందంలో పొందుపర్చి ఉందని ఈ సందర్భంగా బార్నియర్ వ్యాఖ్యానించాడు. జాన్సన్ మాత్రం భవిష్యత్తులో ఇయుతో కెనడాకు ఉన్న వాణిజ్య ఒప్పందాల వలే యుకెతో కూడా ఉండాలనే వాదనను ప్రారంభించాడు.

## బ్రెగ్జిట్ సమస్యలకు పరిష్కారం అవుతుందా?

ఇయు నుంచి బయటికొచ్చేస్తే అంతా బాగవుతుందా? అయితే ఇయు నుంచి బ్రిటన్ 'బ్రెగ్జిట్ అయినంత మాత్రాన ఆ దేశంలో ఇప్పటికిప్పుడు జరిగే పెద్ద మార్పులేమీ ఉండవు. సాంకేతికంగా పూర్తిస్థాయిలో 'బ్రెగ్జిట్'కు మరో 11 నెలల సమయం పడుతుంది. దీనినే 'ట్రాన్సిషన్ పీరియడ్'గా వ్యవహరిస్తున్నారు. ఈ సమయం ముగిసే వరకు ఇయు నిబంధనలను బ్రిటన్ పాటించాల్సి ఉంటుంది. సమాఖ్య బడ్జెట్‌కు కూడా తన వంతు సహకారాన్ని అందించాల్సి ఉంటుంది. అయితే ఇకమీదట జరిగే ఇయు సదస్సుల్లో మాత్రం బ్రిటన్ పాల్గొనదు. ఇప్పటివరకు ఇయు సభ్యదేశాలతో కుదిరిన ఒప్పందాలను బ్రిటన్ రద్దు చేసుకోవడమో లేక మళ్లీ ఒప్పందం కుదుర్చుకోవడమో చేయాల్సి ఉంటుంది. దీనికి సుదీర్ఘ చర్చలు, మంతనాలు జరపాల్సి ఉంటుంది.

ఇకపై బ్రిటన్ ఇతర దేశాలతో నిర్వహించిన సంబంధాలనే యూరోపియన్ యూనియన్‌తో కొత్త వాణిజ్య ఒప్పందాలు, కొత్త దౌత్య సంబంధాలు నెలకొల్పుకుంటుంది. ఎగుమతి, దిగుమతుల విధానం, స్వేచ్ఛావాణిజ్య ఒప్పందాలతో పాటు కుప్పకూలిన బ్రిటన్ కరెన్సీని పరిపుష్టం చేసుకునేందుకు ఇప్పుడు బోరిస్ అమలు చేసే వ్యూహాలే కీలకం అవుతాయి. బ్రెగ్జిట్ అనిశ్చిత పరిస్థితుల కారణంగా పెట్టుబడులు మందగించాయి. ఎగుమతులు క్షీణించాయి. బ్రెగ్జిట్‌పై స్పష్టత రాకపోవడమే ఇందుకు కారణం. ఎట్టకేలకు 47 ఏళ్ల తర్వాత బ్రిటన్ యూరోపియన్ యూనియన్ నుంచి వైదొలగడంతో ఇక స్వతంత్ర ఆర్థిక వ్యవస్థతో పాటు స్వతంత్ర విధానాలతో ప్రపంచ దేశాలతో ముందుకు పోవాల్సి ఉంటుంది. అయితే ఈ ట్రాన్సిషన్ పీరియడ్‌లో ఇయు సభ్యదేశాలతో బ్రిటన్ స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందం కుదుర్చుకోవచ్చు. అయితే అవి ఈ ట్రాన్సిషన్ పీరియడ్ ముగిసిన తరువాత నుంచే అమలులోకి వస్తాయి.

**అమెరికా ఏజెంటుగా బ్రిటన్ మారనుందా?**

ప్రధాని జాన్సన్ వ్యూహాత్మకంగా యూరప్ దేశాలతో వైరానికి దిగుతున్నాడనిపిస్తుంది. రానున్న కాలంలో దేశంలోని ఆర్థిక సంక్షోభాలకు ఇయు దేశాలే కారణమని తన ఎన్నికల హామీలను అందుకే అమలు చేయలేకపోతున్నానని ఆయన అనవచ్చు. తన క్యాబినెట్ మీటింగ్‌లో అన్ని మంత్రిత్వ శాఖలకు ఇప్పటికే 5 శాతం ఖర్చులు తగ్గించాలని ఆదేశించాడు.

ఇవన్నీ కార్మికుల సాంఘిక కోతలకు సంబంధించినవే. ఇయుతో వాణిజ్య యుద్ధాన్ని ప్రకటిస్తూనే అమెరికాతో తనకున్న మైత్రితో మిలిటరీ రంగంలో దూకుడుగా వెళ్లి కార్పొరేట్లకు లాభాలు సృష్టించే దిశగా సన్నాహాలు చేస్తున్నాడు. ఇయు దేశాలు అమెరికాకు వాణిజ్యం లోనూ గట్టిగా పోటీనిస్తున్నాయి.

యూరోపియన్ యూనియన్, బ్రిటన్ మధ్య వాణిజ్య ఒప్పందం ప్రశ్నార్థకంగా మారనుంది. బ్రిటన్ ప్రధాని బోరిస్ జాన్సన్ స్వేచ్ఛాయుత వాణిజ్య ఒప్పందానికి తాము సిద్ధంగా ఉన్నామని ఓ పక్క చెబుతూనే మరోపక్క సమాఖ్య నిబంధనలను అమలు చేయాలనే ఆలోచన తనకు లేదని చెప్పారు. దీనిపై స్పందిస్తూ తమకు ప్రయోజనం లేని ఒప్పందం కంటే పొత్తు లేకుండా ఉండటమే మేలని ఇయు తేల్చిచెప్పింది. ఈ నేపథ్యంలో రానున్న కాలంలో ఇయు యుకె మధ్య సంబంధాలపై నీలినీడలు కమ్ముకున్నాయి.

బ్రెగ్జిట్ నిబంధనల ప్రకారం మరో 11 నెలల్లో బ్రిటన్ ఇయుతో వాణిజ్య ఒప్పందాలను కుదుర్చుకోవాల్సి ఉంది. అయితే కీలక అంశాలపై ఏకాభిప్రాయానికి రావాల్సిన సందర్భంలో ఎలాంటి ఒప్పందాలు లేకుండానే ఇరు ప్రాంతాలు విడిపోయే అవకాశాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. వస్తు, సేవలపై ఎలాంటి సుంకాలు విధించని కెనడా తరహా వాణిజ్య ఒప్పందాన్ని ఇయుతో కుదుర్చుకోవాలని బ్రిటన్ యోచిస్తున్నది.

ఒకవేళ ఈ విధానం సాధ్యం కాకపోతే సుంకాలు అధికంగా ఉండే ఆస్ట్రేలియా తరహా విధానాన్ని అవలంబిస్తామని హెచ్చరిస్తోంది. అయితే పర్యావరణం, కార్మిక హక్కులు, ఆరోగ్యం, రక్షణ ప్రమాణాలు వంటి తమ నిబంధనలకు బ్రిటన్ అంగీకరిస్తేనే ఒప్పందం సాధ్యమవుతుందని ఇయు చెబుతోంది. ఈ నేపథ్యంలోనే హక్కులు, బాధ్యతల మధ్య సమతూకం ఉండాలని ఇయు కమిషన్ అధ్యక్షుడు ఉర్సులా వాన్ తెలిపారు.

వాణిజ్య ఒప్పందాలు చేసుకునేందుకు అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, కెనడా, జపాన్ దేశాలు తమ తొలి ప్రాధాన్యాలుగా బోరిస్ వివరించారు. ప్రపంచంలోని అన్ని ప్రధాన దేశాలతో ఏకకాలంలో చర్చలు జరపడానికి బ్రిటన్ అంతర్జాతీయ వాణిజ్య శాఖ సిద్ధంగా ఉందని స్పష్టం చేశారు. ఇప్పుడు అమెరికా చెంతకు చేరి యుకెను మిలిటరీ రాజ్యంగా తయారు చేసుకొనే అవకాశాలు మెండుగా ఉన్నాయి.

అమెరికాతో కలిసి ఒకప్పటి రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంగా ఎదుగాలని కాంక్షిస్తుంది. ఇక వాణిజ్య యుద్ధాలు, మిలిటరీ ఆధిపత్యం ద్వారా అభివృద్ధి చెందుతున్న ప్రవర్ధిత వర్ధమాన దేశాలపై ఒప్పందాల పేరిట అజమాయిషీ. పెత్తనం చెలాయించాలని బోరిస్ జాన్సన్ ఉవ్విళ్లూరుతున్నాడు.

బ్రిటన్ పునర్నిర్మాణం, పునరాకృతి క్రమంలో ఎదురయ్యే సవాళ్లు అత్యంత కఠినంగా ఉంటాయి. బ్రిటన్ తీవ్రమైన ఆర్థిక సంక్షోభంలో చిక్కుకుంది. అంతర్గత సమస్యలు తీవ్రంగానే ఉన్నాయి. బ్రిటన్‌కు తక్షణం పరిష్కారం సులభం కాని సమస్య రిపబ్లిక్ ఐర్లాండుతో ఉన్న కస్టమ్స్ సరిహద్దు సమస్య. ఐర్లాండు ద్వారా ఫ్రీ ట్రేడ్ లబ్ది పొందకుండా బోర్డరును కస్టమ్స్ చెకింగులతో కట్టుదిట్టం చేయడంలో ఎంతవరకు ఆచరణ సాధ్యమో వేచి చూడాల్సిన అంశమే. సరిహద్దుతో పాటుగా సముద్ర జలాల్లో కూడా గస్తీ ఏర్పాట్లు చేసుకోవడం అంత సులభతరం కాదు. ఐర్లాండు/ఉత్తర ఐర్లాండు దేశాలు విలీనం కావాలని కోరుకునే సమయంలో సరిహద్దుల పేర విడదీయటమేమిటని అక్కడి ప్రజలు ప్రశ్నిస్తున్నారు.

బ్రెగ్జిట్ అంటే కేవలం నినాదం కాదు... ఇది పాలనా విధాన ప్రక్రియ అనే విషయాన్ని బోరిస్ తప్పనిసరిగా గమనంలో ఉంచుకోవాలి. బోరిస్ జాతీయ పునరుద్ధరణకు బ్రెగ్జిట్ దారితీస్తుందని అంటున్నారు. అయితే, బ్రిటన్‌కు ఒంటరితనం నుంచి స్వేచ్ఛ లభించదని ఇయు నాయకులు హెచ్చరిస్తున్నారు.

యూరోపియన్ యూనియన్ నుంచి బయటకు వచ్చినప్పటికీ దాంతో విదేశీ వ్యవహారాలు, ఆర్థిక సంబంధాలు కొనసాగించక తప్పదు. మరోవైపు బ్రిటన్‌లో బోరిస్ జాన్సన్, భారత్‌లో నరేంద్ర మోడీది మితవాద ప్రభుత్వాలే పైన పెద్దన్న ట్రంప్ అవకాశాలకు కాచుకుని చూస్తున్నాడు కాబట్టి ఈ మూడు దేశాల మధ్య బంధాలు బలపడవచ్చు.

మరోవైపు ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు చేపట్టడం, మరిన్ని సంస్కరణలు ద్రవ్య పెట్టుబడికి అనుకూలంగా చేపట్టే అవకాశాలు బోరిస్ ధోరణిలో స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఫలితంగా శ్రామికులకు వేతనాలు, సౌకర్యాలు కోతపెట్టే పొదుపు విధానాల వల్ల సామాన్య ప్రజలకు వనగూరే మేలు ఏమీ ఉండదు.

మరోవైపు చైనా, రష్యాలకు వ్యతిరేకంగా బ్రిటన్‌ను కేంద్రంగా చేసుకొని అమెరికా విదేశాంగ విధానం రూపొందనుంది. గత కొంతకాలంగా జర్మనీ, ఫ్రాన్స్ దేశాలు రష్యాతో సన్నిహితంగా ఉంటున్నాయి. ఈ నేపథ్యంలో బోరిస్ జాన్సన్ అమెరికా ఏజెంట్‌గా వ్యవహరించే అవకాశాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి.

ఏమైనా భవిష్యత్తు ప్రపంచ భౌగోళిక రాజకీయాల్లో అమెరికా యుకెలు ఒక ఫ్రంటుగా, ఇయు దేశాలు ఒక సమాఖ్యగా, చైనా రష్యాలు ఒక కూటమిగా కదిలే సూచనలు కనబడుతున్నాయి. ఇరాన్, రష్యా, చైనా దేశాలపై ఇయు దేశాలకు ఉన్న మెతక ధోరణికి యుకెను అడ్డుపెట్టుకొని గందరగోళం సృష్టించాలని అమెరికా భావిస్తున్నది. బ్రిటన్‌లో ఏమవుతుందోనని "చాలామంది ఆందోళన, దిగులు పడుతున్నారు. అయితే, ఇది (ఈ పరిణామం) బ్రిటన్ స్వతంత్ర ఆలోచనా, చర్యల శక్తిని తిరిగి తీసుకువస్తుందని" బోరిస్ అంటున్నారు.

ఇక్కడ గుర్తించవలసిన అంశమేమంటే, ఎలా దేశంలో ప్రజానుకూల మార్పులు తేస్తారో తెల్పడం లేదు. అలాగే ఇందుకు ఎలాంటి కాలపరిమితిని ప్రకటించలేదు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# అప్రజాస్వామిక నిర్బంధాన్ని ప్రశ్నిద్దాం!

***ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో ఎన్నో నిర్బంధాలను, అణచివేతలను ఎదుర్కొన్న ప్రజలు ఇప్పుడు రాష్ట్రం ఏర్పడిన తరువాత కూడా మరింత నిర్బంధాన్ని ఎదుర్కొంటున్నారనీ, ఈ అణచివేతకు వ్యతిరేకంగా కలిసికట్టుగా పోరాడాలనీ అంటున్నారు*** **తక్కళ్ళపెల్లి సూరి**

ఉద్యమాల ఊపిరిగడ్డ, తిరుగుబాటు పోరాటాల తల్లివేరు, విప్లవోద్యమాల జీవగడ్డ, రాజరికాన్ని, దోపిడిని, పీడనను ఎదిరించి నిలబడి, కలబడి ప్రశ్నించే తెలంగాణ, నేడు నిర్బంధాలతో, అక్రమ అరెస్టులతో, అర్బన్ నక్సల్స్ అనే పైశాచిక సామ్రాజ్యవాద ప్రచారంతో, మానవ హక్కులను, ప్రజాస్వామిక హక్కులను, రాజ్యాంగ మౌలిక విలువల్ని ధ్వంసం చేసే రాజకీయ ప్రక్రియ ప్రయోగ కేంద్రంలా మార్చాలని పాలకులు భావించడం విచారకరం.

నాటి ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో అనేక శక్తులను, వ్యక్తులను, సంస్థలను, సమన్వయం పేరుతో, ఐక్య ఉద్యమ పోరాటాల పేరుతో, సకల జనులను ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో పాల్గొనేలా ఉద్ధృత ఉపన్యాసాలిచ్చిన నాయకులు, నేడు పాలకులై, ప్రజలవైపు నిల్చిన కలాలపై, గళాలపై నిర్బంధాన్ని తీవ్రతరం చేస్తున్నారు. కాని అనేక ఉద్యమ రూపాలను రూపొందించుకున్న విద్యార్థిలోకం, ప్రాణ పతిష్ట కార్యదీక్షతో, 1400 మందికి పైగా, లేత యవ్వన, నూనూగు మీసాల ప్రాయాన్ని, అమరత్వానికి సిద్ధమవ్వడం, ఇక్కడి మట్టి త్యాగాలను గుర్తుకు తెస్తుంది. నాడు విద్యార్థులు బంగారు భవిష్యత్‌వైపు, ఉద్యోగాలవైపు, సౌకర్యవంతమైన కుటుంబ జీవనాలవైపు, పరుగెత్తకుండా, తమ అమూల్య ప్రాణాల దేహాలను అగ్నికి ఆహుతి చేసి, నాటి ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి ఉపయోగపడే దివిటీగా మార్చారు.

విద్యార్థులు తమ రక్తంతో, తమ త్యాగంతో, అమరుల ఆశయాలతో, ఉద్యమ కెరటాలై పోరాడి ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని సాధించారు, నాటి ఉద్యమ పార్టీకి పాలనను అందించారు. తెలంగాణ సమాజం మొత్తంగా స్వేచ్ఛ, స్వతంత్రాలు స్వపరిపాలనలో ఉంటాయని మానవ హక్కుల ఉల్లంగణ జరుగదని, రాజ్యాంగ విలువల ధ్వంసం జరుగదని, రాజకీయ దోపిడి అసాధ్యమని, భావ ప్రకటన హక్కులకు భంగం కలగదని, అక్రమ నిర్బంధాలు ఉండవని, బూటకపు ఎన్‌కౌంటర్స్‌కు చోటేలేదని గాఢంగా విశ్వసించింది. కాని అందుకు పూర్తి విరుద్ధంగా నేడు ప్రత్యేక తెలంగాణ రాష్ట్రంలో పరిస్థితులు రూపుదిద్దుకున్నాయి.

2014, జూన్ 02న భారతదేశ 29వ రాష్ట్రంగా అవతరించిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం, కేవలం ఆరు సంవత్సరాలు కూడ పూర్తిగా నిండకుండానే, ప్రజా హక్కులపై, ప్రజా పోరాటాలపై, త్యాగాలపై, సభలపై, సమావేశాలపై, ప్రజా కలాలపై, గళాలపై, సంఘాలపై, ప్రజాస్వామిక వాదులపై, మేధావులపై, విద్యార్థులపై, నిర్బంధ దాడిని ప్రత్యక్షంగానే కొనసాగించుటకు సిద్ధమవ్వడం, తెలంగాణ సమాజం పూర్తిగా ఆశ్చర్యానికి గురైన అంశంగా చెప్పుకోవాలి. కంచే చేను మేసినట్లు మన పాలన యంత్రాంగం, మన పాలకులు, మళ్లీ తెలంగాణను కల్లోల ప్రాంతంగా మార్చదలుచుకున్న కుట్రను మనం అర్థం చేసుకోవాలి.

అందులో భాగంగానే 2020, జనవరి 18న ఉదయం పాలకవర్గ రక్షక దళాలు, కవి, విమర్శకుడు, విరసం నూతన కార్యదర్శి, నడుస్తున్న తెలంగాణ పత్రిక సంపాదకులు, ఉస్మానియా యూనివర్సిటిలో అధ్యాపకులు ప్రొ. చింతకింది కాశీంని అరెస్టు చేసాయి.

కాశీం పాలకపక్ష కుట్రలను, తన కలంతో, గళంతో, ధైర్యంగా బహిర్గతం చేసారు, చేస్తూనే ఉన్నారు. ప్రజా చైతన్యం కొరకు, ప్రజా కంఠక రాజకీయాల, ధిక్కార ధైర్యస్వరంగా మారి పాలకులను, పాలన రీతులను ప్రశ్నిస్తూ, తన రచనల ద్వారా నిర్భయంగా నిలదీస్తూ, ప్రజల హక్కుల నినాదమై, ఉద్యమాల ఉత్పత్తి కేంద్రమైన ఉస్మానియా యూనివర్సిటీలో తెలుగు అధ్యపకులుగా పాఠాలు బోధిస్తున్నారు. విరసం సంస్థకు కట్టుబడిన రాజకీయ చైతన్యం మేరకు, ప్రజల పక్షాన, ప్రజాస్వామిక విలువల పక్షాన, ప్రజా సంబంధ ఉద్యమాల పక్షాన, నిరంతరం చైతన్యమవుతూ, నిలబడుతూనే ఉన్నారు. అందుకు నిర్బంధం కాశీంపై ఉక్కు పాదమై జడలు విప్పింది.

శ్రీశ్రీ లాంటి అగ్రశ్రేణి తెలుగు సాహిత్య కవిలాంటి వారు విరసం అధ్యక్షులుగా కొనసాగిన చరిత్ర విరసంకు ఉంది. కాశీం విరసంకు మొదటి వాడుకాదు, చివరివాడు కాదు, అయిన కాశీంను నిర్బంధం ఎందుకు వరించింది?

రాజకీయ ప్రతిపక్షాలను, పాలకపక్ష పత్రికలను, మేధావులను, ఆలోచన పరులను, ఉద్యమకారులను, కవులను, కళాకారులను అమాంతంగా మింగి కక్కేసి, ఆ అధికార లాలాజల రుచి మరిగించి, మురిపిస్తూ పాలన గూర్చి ఆలోచించని గొప్ప దౌర్భాగ్యాన్ని వరంలా పాలకవర్గం ప్రసాదించింది. కాని కాశీం అందుకు భిన్నంగా, పాలకులకు, రాజ్యానికి ఎదురు నిలబడి ప్రశ్నించినందుకే నిర్బంధం అతన్ని ఆక్రమించుకుంది.

మన దేశ రాజకీయ వ్యవస్థలో ప్రజలను మోసం చేసేవారు, అన్యాయం చేసేవారు, దోపిడి చేసేవారు, పచ్చి మోసపూరిత అబద్ధాలు చెప్పేవారు, పాలక నాయకులై ప్రజాస్వామ్యాన్ని హేళనచేస్తుంటే, ప్రజల పక్షాన, న్యాయం పక్షాన, రాజ్యాంగ హక్కుల పక్షాన, ప్రజా ఆకాంక్ష నిజాయితీ ఉద్యమాల పక్షాన నిలబడ్డవారు, ధైర్యంగా నిజం మాట్లాడినవారు, ప్రజల సంక్షేమంకై నిస్వార్థంగా ప్రాణత్యాగం చేసేవారు, ప్రజా జీవితాలకు అంకితమైనవారు మాత్రం విచిత్రంగా నిర్భందాలకు, బెదిరింపులకు, అరెస్టులకు, గురవుతూ జైళ్లకు వెళ్లుతున్నారు. ముఖ్యంగా

# డిసెంబ్రిస్ట్ సైనిక తిరుగుబాటు పరిణామాలు - 5

***జారిజం మీద 1825 డిసెంబర్‌లో జరిగిన తిరుగుబాటు రెండు వందల సంవత్సరాల తర్వాత కూడా ప్రభావం చూపుతున్నదంటున్నారు* ఎన్.వి.ఎస్. నాగభూషణ్**

*(...గత సంచిక తరువాయి భాగం)*

**7) నెపోలియన్‌తో చేసిన యుద్ధాలు**

నెపోలియన్ రష్యాతో జట్టుకట్టిన రోజులు వేళ్లతో లెక్కించదగినవి మాత్రమేనని చెప్పాలి. 'టిల్సిట్ సంధి' – 1808 తిరిగి పునరుద్ధరించి నప్పుడు రెండు వైపుల వారినీ సంతృప్తి పరచలేకపోయింది ఎక్కువ కాలం పాటు. రష్యన్లు ఈ సంధిని బలవంతంగా అంగీకరించడానికి కారణం వారు యుద్ధంలో ఓటమి చెందడమే. దాంతో పాటు, నెపోలియన్ ఐరోపా ఖండంపై సాగిస్తున్న ఆధిక్యతను అవమానంగా భావించసాగారు. నెపోలియన్‌కు రష్యా ప్రయోజనాల మీద ఏమాత్రం ఆసక్తి లేదు. ప్రత్యేకించి రష్యాను ఖండంలోని ఇతర దేశాలతో, ముఖ్యంగా దాని మిత్ర దేశమైన ఇంగ్లాండుతో వాణిజ్యం చేయనియ్యకుండా చేసిన దిగ్బంధంతో అది చాలా నష్టపోయింది. దీంతో రష్యా ఎగుమతులు నిలిచిపోవడమూ, దేశంలోని శక్తివంతమైన భూస్వామ్య వర్గం తీవ్రంగా నష్టపోవడమూ జరిగింది. ఫలితంగా రష్యన్ సైన్యం ఎదురు తిరిగి ఫ్రెంచివారి చేతుల్లో చిక్కిపోవడాన్నుంచి పగతీర్చుకోవడం కోసం ఆత్రుతపడసాగింది. కారణం దానికి దాదాపు గత శతాబ్ది కాలం నుంచీ ఓటమి అన్నదే లేదు. కానీ నెపోలియన్ భయంకరమైన ఫ్రెంచి విప్లవం నుండి రావడం వల్ల, అతడు ఒక విలక్షణతృత్వంతో కనబడుతూ, ఒక అసంతోషకరమైన మిత్రుడిగా ఉన్నాడు. ఇటు నెపోలియన్‌కూ, అతడి సేనలకు కూడా – వారి దృష్టి నుండి చూసినప్పుడు రష్యా ఏమాత్రం నమ్మదగిన భాగస్వామిగా లేదు. అంతేగాక అది (రష్యా), ఐరోపా ఖండంపై తన (ఫ్రాన్సు) ఆధిక్యానికి ఒక పెద్ద అడ్డంకిగా కూడా కనపడింది.

విశాల యూరప్ ఖండంలో ఒక చివర (ఫ్రాన్సు), మరో చివర రష్యాలు గొప్ప శక్తి సంపన్నమైన రాజ్యాలు. ఈ కారణంగా ఈ దిగ్గజాలు ఢీకొట్టకుండా ఆపడం ఎవరివల్లా కుదిరే పనికాదు. ఇలా ఫ్రాన్సుతో రష్యా సంధి అనుమానాస్పదంగా మారిన సమయంలో అకస్మాత్తుగా సెయింట్ పీటర్స్ బర్గ్ సాయం సమావేశాల్లో ఒక పుకారు వ్యాపించి, అందరు శ్రోతల వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. రాబోయే తుఫాను నుంచి చక్రవర్తి బలహీనుడైనందున, తనను తాను రక్షించుకోలేడని కొన్ని పుకార్లయితే అతణ్ని దించేయాలనీ కూడా! ఈ విషయాలన్నీ అలెగ్జాండర్ గమనిస్తూనే ఉన్నందున అతడు ఈసారి ఎలాంటి వైరుధ్యాలకూ తావివ్వకుండా, తన జాతి గౌరవాన్ని కాపాడుకోవాలన్న దృఢ దీక్షతో ఉన్నాడు. దీనర్థం, యుద్ధాన్ని దాని అంతం దాకా కొనసాగించాలనీ, ఎలాంటి రాజీలకూ తావివ్వరాదని!

ముందుగా అవసరమైన దౌత్య, సైనిక సన్నాహాలు కానిచ్చిన

---

రాజ్యం మేధావులపై, కవులపై, ప్రజా సంఘాలపై, ప్రజాపక్ష పత్రికపై, విద్యార్థులపై, వివిధ హక్కుల నాయకులపై దాడి చేస్తుందంటే, రాజ్యం ప్రజలపై, ఏదో ద్రోహపూరిత కుట్రను రచిస్తుందని అర్థం.

రాజ్యం మేధావులను వేధిస్తుందంటే రాజ్యం ఏదో ప్రజావ్యతిరేక కుంభకోణంకై తహతహ లాడుతుందని అర్థం చేసుకోవాలి. ప్రొ. సాయిబాబా, వరవరరావు లాంటి వామపక్ష భావజాల మేధావులను, మెంచు రమేశ్, నలమాల కృష్ణ వంటి ప్రజాఫ్రంట్ నాయకులను, అనురాధ, రవిశర్మ వంటి హిందు మతోన్మాద వ్యతిరేక వేదక నాయకులను, దేవేంద్ర, శిల్ప, స్వప్న, రేణుక వంటి చైతన్య మహిళా సంఘ బాధ్యులను, మద్దిలేటి, సందీప్, నాగన్న, బలరాం, నాగరాజు, భరత్ వంటి తెలంగాణ విద్యార్థి వేదిక నాయకులను అరెస్టుల పేరుతో భయభ్రాంతులకు గురిచేసి వారిని అర్బన్ నక్సల్స్ అనే దుష్ప్రచారంతో, వారి సాంఘిక, సామాజిక, రాజ్యాంగభరిత హక్కులను భంగపరిచినట్లు గానే భావించాలి. మావోయిస్టు ఎజెండాను, రాష్ట్రంలో అమలు చేస్తామనే పాలకులు, పాలక యంత్రాంగం, జన జీవన స్రవంతిలో జీవిస్తున్న రాజ్యాంగబద్ధ హక్కుల నేతలను, మావోయిస్టులతో సంబంధాలున్నాయని తప్పుడు కేసులు బనాయించడం, తెలంగాణలో ప్రజాస్వామిక విలువల ధ్వంసంగానే పరిగణించాలి. తెలంగాణ స్వరాష్ట్రంలో దేశంలోనే అగ్రస్థాయిలో మానవ హక్కుల ఉల్లంఘన, రాజ్యాంగ హక్కుల అణిచివేత శరవేగంగా కొనసాగుతున్నా మేధావులు, బుద్ధి జీవులు, కవులు, రచయితలు, మౌనంగా ఉండటం తీవ్ర నేరంగానే గుర్తించాలి.

ఇప్పుడు కూడ తెలంగాణ సమాజంవైపు నిలబడనివారు, ప్రభుత్వ పాలన విధాన వికృతిని ప్రశ్నించనివారు, ఇంకా భ్రమాజనిత తెలంగాణ యాస వాగ్దానంలోనే అభివృద్ధి ఉందనుకునేవారు, భవిష్యత్ తరాల దృష్టిలో ఖచ్చితంగా ద్రోహులుగానే మిగులుతారు. భౌగోళిక తెలంగాణలో ప్రజల బతుకులు మారవని, విద్యార్థుల, నిరుద్యోగుల, కార్మికులు, కర్షకుల జీవన విధానంలో మార్పురాదని, ప్రజాస్వామిక తెలంగాణలో మాత్రమే ప్రజలకు కష్టాలుండవని ప్రజా ఉద్యమాల స్ఫూర్తితో అప్రజాస్వామిక నిర్బంధాలన్నీ ఈ భౌగోళిక తెలంగాణలో ప్రజాస్వామిక తెలంగాణగా మార్చే మరో ఉద్యమ పునాదులవుతాయని ధైర్యంగా ప్రశ్నించే గొంతులవుదాం.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

నెపోలియన్ 1812 జూన్‌లో రష్యా దురాక్రమణకు పూనుకున్నాడు. జూన్ 24న ఫ్రెంచి గ్రాండ్ ఆర్మీ నీమెన్ నదిని దాటి, రష్యా గుండెల్లోకి చొచ్చుకు వెళ్లేందుకు గాను 'విల్నా-వితెబ్స్-స్మోలెన్స్క్' రేఖ వెంట మార్చి చేసుకుంటూ రాసాగింది. స్మోలెన్స్క్ వద్ద జరిగిన యుద్ధంలో రష్యా, పెక్కు నష్టాలతో, చుట్టుముట్టబడిన శత్రువుల నుండి తప్పించుకోవడానికి గత్యంతరం లేక, రాత్రికి రాత్రి స్మోలెన్స్క్ పట్టణం నుండి నిష్క్రమించాల్సి వచ్చింది. రష్యన్ సైన్యం ఈ ఉపసంహరణ వల్ల అలెగ్జాండర్ నాయకత్వం పట్ల వ్యాపించిన వ్యతిరేకత తీవ్రత వలన అలెగ్జాండర్‌కు వేరే ప్రత్యామ్నాయం కనిపించక, తనకు అంతగా ఇష్టం లేకపోయినప్పటికీ సెయింట్ పీటర్స్ బర్గ్ నగరంలో ప్రజానురక్తిగల ప్రసిద్ధ 'సెయింట్ పీటర్స్ బర్గ్ మిలీషియా' కమాండర్‌గా ఉన్న 'మిహాయిల్ కుటుజోవ్'ని రష్యన్ సర్వ న్యాయాధిపతిగా నియమించవలసి వచ్చింది.

అరవై ఏడు సంవత్సరాల వయస్సు కలిగిన అనుభవజ్ఞుడైన కుటుజోవ్ తన వ్యూహాత్మకమైన ఎత్తుగడలను పన్ని, సైన్యాన్ని ఉపసంహరిస్తూ, ఒక పెద్ద యుద్ధంలో అతణ్ని గట్టిగా నిలువరించడం కోసం తొలుత సాగే చిన్న యుద్ధాల్లో సునాయాస విజయాలు లభించేట్లు నెపోలియన్‌ను భ్రమల్లో ముంచుతూ, అతడికి మొదటి విజయాలకు గాను సంబరాలు జరుపుకునే అవకాశాలు కల్పించాడు. చివరకు కుటుజోవ్ ఆశించిన ఆ పెద్ద యుద్ధం నెపోలియన్‌కు గట్టి ఎదురు దెబ్బ తగిలేట్లు చేసేదైన యుద్ధం 1812 సెప్టెంబర్ 7న 'బొరోడినో' యుద్ధంగా భవిష్యత్తులో ప్రసిద్ధికెక్కనున్న యుద్ధం, బొరోడినో గ్రామం వద్ద జరిగింది. ఈ గ్రామం మాస్కో నగరానికి కేవలం 75 మైళ్ల దూరంలోనే జరిగింది. ఈ అతిపెద్ద యుద్ధంలో చెప్పుకోదగినన్ని నష్టాలు ఉభయ పక్షాలకూ జరగడం గమనార్హం. తాను అక్కడి నుండి ఉపసంహరించుకుని వెనక్కు తగ్గినప్పటికీ, సర్వ సైన్యాధిపతి కుటుజోవ్ తనకే విజయం దక్కినట్లు ప్రకటించుకోవడం విశేషం! కానీ నెపోలియన్ దాన్ని అంగీకరించలేదు, అది వేరే సంగతి. అతడు విజయ గర్వంతోనే ఉత్సాహంగా మాస్కో నగరం వైపు పురోగమించాడు.

అయితే నెపోలియన్ మాస్కో నగరంలోకి ప్రవేశించినప్పుడు అప్పటి వరకూ అతడిలో ఉన్న ఉత్సాహం కాస్తా మారిపోయి ఆలోచనల్లో పడిపోయాడు. అతడి మోహం మ్లానమై తనమీద తనకే నమ్మకం నశించి పోయింది. కారణం అతడు నగర ప్రవేశం జరిపేసరికి, మాస్కో నగరంలో ఒక పెద్ద మంట వ్యాపించింది. అంతకీ ఆ మంట వేసింది ఎవరో కాదు, ఆ నగర గవర్నరైన కౌంట్ 'థియోడోర్ రొస్తోప్చిన్' చేతనే అని చాలా మంది నమ్మకం. ఆ మంటకు చాలా వరకు నగరం తగలబడిపోయిన స్థితిలో మాస్కో నగరాన్ని ఆ గవర్నర్ ఖాళీ చేసి వెళ్లగా, విధిలేని స్థితిలో శీతాకాలం ప్రవేశించడంతో తగలబడిపోయి శిథిలమైన నగరంలోకి ప్రవేశించాడు నెపోలియన్. అయినప్పటికీ అతడిలో ఆశ పూర్తిగా చావలేదు. ఇంకా అతడు భ్రమల్లోనే ఉన్నాడు. తనకు విజయం అందినట్లేనని అతడు ఆశల్లోనే ఉన్నాడు. తనతో రాజీ సంప్రదింపుల కోసం సెయింట్ పీటర్స్ బర్గ్ నుంచీ రాయబారం వస్తుందని అతడు ఆశతో ఎదరుచూడసాగాడు. కానీ అతడి ఆశ నెరవేరలేదు. దాంతో అతడు తాను సాలెగూడులో చిక్కుకున్నట్లు అర్థమైంది. రష్యన్ భయంకర శీతాకాలపు దెబ్బకు నెపోలియన్ సైనికులు తట్టుకోలేని స్థితిలో, ఫ్రాన్స్ నుండి అంత లోతట్టుకు సప్లైలు అందలేని స్థితిలో జబ్బుపడ్డ సైన్యంతో, చిరిగిపోయిన దుస్తులతో, ఇక అక్కడే ఉంటే చుట్టుముట్టబడి అడకత్తెరలో చిక్కుకున్నట్లేనని అర్థమైన నెపోలియన్, ప్రాణ భయంతో మాస్కో నుంచి ఉపసంహరించుకుని, అమిత వేగంతో, ఏమీ సాధించకుండానే శిథిలమైన సైన్యాన్ని తీసుకుని పడమటి వైపు, తమ స్వదేశం వైపు, తాము ఎటు నుంచైతే రష్యాలోకి విజయ గర్వంతో ప్రవేశించారో అదే దారిన పారిపోవడం మొదలు పెట్టారు. రష్యాలోకి 6 లక్షల 90 వేల సైన్యంతో దురాక్రమణకు రాగా, ఇప్పుడు కేవలం 90,000 సైన్యం మాత్రమే మిగిలి ఉంది.

సెయింట్ పీటర్స్ బర్గ్‌లో నెపోలియన్ మాస్కో నగరాన్ని వదిలేసి పారిపోతున్న వార్తను తెలుపుతూ, నగర కోట నుండి భారీ ఫిరంగుల్ని విజయసూచకంగా పేల్చారు. కానీ ఆ నగరం ఈ విజయాన్ని తమకందించిన తమ వీరుల్ని రెండు సంవత్సరాల తర్వాత వారంతా నెపోలియన్ వెన్నంటి వెళ్లి రెండు సంవత్సరాల తర్వాత తిరిగొచ్చే దాకా చూడలేకపోయింది. ఇక ఈ మహా విజయంతో దక్కిన అవకాశం వల్ల తాను యూరప్ స్వాతంత్ర్యాన్ని సాధించిపెట్టిన వానిగా కనిపించడం కోసం అలెగ్జాండర్ 1 ప్రతిజ్ఞ చేశాడు నెపోలియన్ అంతాన్ని చూస్తానని! 1814 మార్చి 31 నాడు దాదాపు వంద సంవత్సరాల తర్వాత సెయింట్ పీటర్స్ బర్గ్ నగరాన్ని నిర్మించడమూ, సంస్కరణలను అత్యంత పట్టుదలతో మొదటు పెట్టడమూ పీటర్ ది గ్రేట్ చేసిన తర్వాత, ఇప్పుడు అలెగ్జాండర్ తన శ్వేతాశ్వాన్ని అధిరోహించి, పారిస్‌లో ప్రసిద్ధి కెక్కిన వీరుల పథమైన 'ఛాంప్స్ - ఎలైసీస్' రాజమార్గంపై ముందుకు మార్చి చేసుకుంటూ వెళ్లాడు. (నెపోలియన్ బోన పార్టీ విప్లవ విజయం సాధించాక, పారిస్ నగరంలోని ఈ మార్గాన్ని తన వీర విజయానికి చిహ్నంగా, అమర వీరులకు నివాళులర్పించే పేర నిర్మించాడు. ఇప్పుడు ఈ అవెన్యూ నుండి అలెగ్జాండర్ ముందుకు వెళ్లాడన్నమాట. నెపోలియన్ సేనల్ని తరుముతూ - రచ). అతడిని అనుసరిస్తూ మార్చింగ్ చేసుకుంటూ వచ్చిన సైనికాధికారులంతా సెయింట్ పీటర్స్ బర్గ్‌లోని ప్రభు వర్గం సంతానమే. ఒక శతాబ్దానికి ముందు సంస్కరణలు చేయకుండా, మధ్య యుగాల సంస్కృతిలో ఉన్న రష్యా కనీసం బాల్టిక్ సముద్రంపై కూడా ఆధిక్యాన్ని చూపలేకపోయింది.

ఇదంతా యూరప్‌కు తెలుసు. ఇప్పుడలాంటి రష్యా యూరప్‌ను రక్షించినదిగానే గాక, యూరప్‌లో అత్యంత శక్తివంతమైన సభ్యదేశం! అలాంటి స్థితిని సాధించడానికి శతాబ్దం పాటు కృషి జరిగింది - ఆధునికత కోసం కొత్త ఆలోచనలతో దాన్ని మొదలెట్టిన పీటర్ ది గ్రేట్ (సంస్కరణల ముసుగులో యూరపియన్ సంస్కృతిపై వెర్రి వ్యామోహంతో అతడు బలవంతంగా రుద్దిన వెర్రి నాగరికత కోసం ప్రజలపై జరిపిన తీవ్ర అణచివేతకు అతని కుటుంబ సభ్యులు కూడా కొందరు బలికావడం ఆ సంస్కరణల కనిపించని రెండో వేపు - రచ), దానికి కేవలం ఒక చిహ్నంగా నిలిచిపోయిన సెయింట్ పీటర్స్ బర్గ్ నగరం. రష్యా ఈ విజయం - ఒక ముసుగు లాగా - ఏమాత్రం సరిదిద్దలేని లోపాలను, అలాగే ఇతరులను ప్రలోభపరిచేలా ఉండే నమ్మకాలను కలిగి, రష్యా (సామాజిక స్థితి) పద్ధతి, పునాది పరంగా చాలా బలంగా ఉన్నదని భ్రమింపజేస్తుంది. కానీ ఈ పద్ధతి తిరిగి దాడులకు గురైంది.

### 8) వియన్నా కాంగ్రెస్ అనంతర ఘటనలు - ఉదారవాదానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటాలు

ఓటమి తర్వాత లొంగిపోయిన నెపోలియన్, 1814లో గెలుపొందిన

వారూ ఇద్దరూ కలిసి 1814 సెప్టెంబర్ 8న ఒక కాంగ్రెస్‌ను సమావేశపరిచారు. ఆ కాంగ్రెస్‌లో చర్చల తర్వాత, నెపోలియన్ తనకు విధించబడిన ప్రవాసం నుండి తప్పించుకొని తిరిగి ఫ్రాన్సుపై అధికారాన్ని కైవశం చేసుకోగలిగాడు. వంద రోజుల పాటు మాత్రమే, 1815 మార్చి నుండి జూలై దాకా. అప్పుడు నెపోలియన్‌కు చిట్ట చివరి ఓటమి 'వాటర్లూ'లో సంభవించింది.

వియన్నా కాంగ్రెస్‌లో పాల్గొన్నవారి లక్ష్యం, యూరప్‌లో సుదీర్ఘ కాలం పాటు శాంతి నెలకొన్నది, అందుకు ప్రాతిపదికగా యూరప్‌లోని ప్రధాన శక్తుల బల బలాలు సరిసమానంగా ఉండేట్టు చూడడమే ననుకున్నారు. యూరప్‌ని యథాతథంగా ఉంచడానికి విరుద్ధంగా, ప్రమాదకరంగా ముంచుకొస్తున్న విప్లవ భావాన్ని సంప్రదాయిక మార్గంలోనే ఎదుర్కొవాలనుకున్నారు. ఈ కాంగ్రెస్ వల్ల తక్షణం ఫలితం ఏమంటే, 'పవిత్ర కూటమి' నిరంకుశాధికారులు గల రష్యా, ఆస్ట్రియా, ప్రష్యాల కలయిక ఏర్పడడం! ఈ కూటమి గురించిన సంతకాలు జరిగిన తేదీ 26-9-1815. ఈ పవిత్ర కూటమికి న్యాయకత్వం వహించే అవకాశం ఆస్ట్రియన్ ఛాన్సలర్ అయిన రాకుమారుడు క్లెమెన్స్‌వోన్ మెట్టనిక్‌కు వచ్చింది. ఈ కూటమి జాగ్రత్తగా ఆలోచించి, ప్రజాస్వామ్యానికీ, విప్లవానికీ, రిపబ్లికనిజం, సెక్యులరిజంకు వ్యతిరేకంగా ఒక కోటలాగా పోరాడాలని నిర్ణయించుకున్నాయి. ఈ మూడు దేశాలూ విప్లవ భావాలకు వ్యతిరేకంగా తమ దేశాలు అంకిత భావంతో పోరాడుతూ, వాటిని అడ్డుకోవాలని ప్రణాళికలు వేసుకున్నాయి. ఆస్ట్రియా ఛాన్సలర్ మెటర్నిక్ భావాలు త్వరగానే రష్యాను చుట్టు ముట్టాయి. అలెగ్జాండర్ హేతువాద ఉదార భావాలు నెపోలియనిక్ యుద్ధాలకు బాధ్యత వహించవలసి వచ్చినందువల్ల, మొత్తం రష్యా అంతా నష్టపోవడం జరిగింది. దాంతో ఉదారవాద వ్యతిరేక భావాల వెల్లువ రష్యన్ రాజకీయ, ఆర్థిక జీవితంలో తీవ్ర స్థాయికి చేరింది. యువతరంలో ఉదార భావాలు ప్రమాద ఘంటికలు మోగించగా, వృద్ధతరం పాశ్చాత్య దేశాల నుండి వచ్చే ప్రమాదకర భావాలపై యుద్ధాన్ని ప్రకటించింది. పాత రష్యాను బలపరుస్తూ మూడు స్తంభాలుగా నిలిచిన సాంప్రదాయిక భావాలూ, నిరంకుశాధికారమూ, దేశభక్తీ - ఈ మూడింటితో సాంప్రదాయిక వాదులు తమ పతాకాన్ని జాకొబిన్ భావాలకు వ్యతిరేకంగా ఎత్తిపట్టారు. దేశంలో జరిగే రాజకీయ, సాంఘిక, మత కార్యకలాపాలలో ప్రతిదాన్నీ అనుమానిస్తూ అలెగ్జాండర్ అన్ని సొసైటీలనూ నిషేధించాడు. పూర్తిగా, కేవలం తాను మద్దతు ఇచ్చే వాటి కార్యకలాపాలను తప్ప.

అలెగ్జాండర్1 తన పాలనాకాలం ద్వితీయార్థం అంతా సంప్రదాయక రాజకీయ విధానాలనే అనుసరించాడు. అంటే దీనర్థం ఈ కాలం తీవ్ర అణచివేతలతో కూడి ఉన్నదని. జనరల్ అలెక్సిస్ అరక్షీవ్ తన క్రూర విధానాల రుద్దుడుతో ఉదార వ్యతిరేక, పూర్తి చీకటి అధ్యాయానికి ఒక ప్రతీకగా నిలుస్తూ అలెగ్జాండర్ మంత్రి మండలిలో ముఖ్య పాత్ర వహించాడు. ఇతడు స్పెరాన్స్కీ స్థానాన్ని భర్తీచేస్తూ, యుద్ధ మంత్రిగా, క్రమంగా ప్రధాన మంత్రిగా ఎదిగాడు. ఇటు సాహిత్య రంగంలో అయితే అడ్మిరల్ అలెగ్జాండర్ షిష్కోవ్, కీంట్ రొస్తోప్చిన్‌లు రష్యన్ సాహిత్యం మీద అనభిలణీయమైన విదేశీ ప్రభావం కనబడకుండా సలహాలు ఇస్తుండేవాళ్లు. ఈ కాలమంతా బహిరంగ చర్చలలో, ఏకవ్యక్తి నిరంకుశాధికారాన్నీ, జాతిత్వాన్నీ బలపరచడమే ప్రధాన వాదనగా జరిగేది.

అలెగ్జాండర్ పాలనా కాలం ద్వితీయార్థంలో కనిపించే మరో ముఖ్యాంశం ఏమంటే, మత సంబంధమైన, ఆత్మల పరమైన కార్యకలాపాలు, రాజకీయ ప్రతిక్రియలతో కూడి ఉండేది. ఈ విషయంలో హోలిసినోడ్ అధిపతియైన రాకుమారుడు ఎ.గొలిత్సిన్ ఈ కాలపు చీకటి అధ్యాయానికి గురువని చెప్పాలి. మొదట హోలిసినోడ్ అధిపతిగా ఉండి, ఆపై విద్యా మంత్రియైన ఈ గొలిత్సిన్ జాతీయ విద్యా విధానానికి పెద్ద పెట్టున తూట్లు పొడిచాడు. ఆ అతి చీకటి అధ్యాయంతో కూడిన యూనివర్సిటీల చరిత్రలో రెండు పేర్లు జతకలిసి కనిపిస్తాయి - 1) మిహాయిల్ మాగ్నిత్స్కీ, 2) ద్మిత్రీ రునిచ్‌లు. ఈ ద్వితీయార్థ కాలంలోనే సెన్సార్‌షిప్ నిబంధనలు మరింతగా పెరిగిపోయి లక్ష్య రహితంగా, వ్యక్తిగతంగా మారింది. అంటే తమ ఇష్టమైతే అనుమతి, లేకుంటే నిరాకరణ అన్నమాట! ఈ సమయంలో రాజకీయ, కళా సంబంధమైన రెండు రకాల రచనలు అత్యధికంగా సెన్సార్‌షిప్‌కు గురై బాధించబడ్డాయి. జర్నలిస్టులంతా ప్రభుత్వ విధానాలను అనుసరించి రాయాలని కోరబడ్డారు. ప్రభుత్వ పాలనా చర్యలకు సంబంధించిన విషయాలకే మొదటి ప్రచురణ అనుమతులు లభించసాగాయి. ఈ చీకటి కాలంలో పలు తాత్విక, సాహిత్య రచనలు నిషేధించబడి, పలు పత్రికలు మూతపడ్డాయి.

**9) 1812 నాటి పిల్లలు**

సెయింట్ పీటర్స్ బర్గ్ యువతరం అలెగ్జాండర్ యుద్ధ చర్యలతో జతగూడి, నెపోలియన్ యుద్ధాల్లో పాల్గొనడంలో భాగంగా యూరప్ సైనిక చర్యలలో పాల్గొంటూ మామూలు మిలటరీ అధికారులుగా ఆ ప్రాంతాలకు వెళ్లినవారు, ఇంటికి తిరిగి వచ్చింది మాత్రం ఉదారవాద రాజకీయ ఆలోచనలతో నిండిపోయిన ఉద్వేగాలతోటి! ఈ తరానికి సంబంధించిన యువతరం అంతా యురపిన్ చరిత్రనూ, ఆలోచనల ద్వారా భావాలను ఏర్పరచుకోవడాన్నీ, ఆ భాషల, దేశాల గురించి తెలుసుకుంటూ ఉన్నత విద్యావంతులుగా పరిణతి చెందారు.

సెయింట్ పీటర్స్ బర్గ్‌లో నెపోలియన్ మాస్కో నగరాన్ని వదిలేసి పారిపోతున్న వార్తను తెలుపుతూ, నగర కోట నుండి భారీ ఫిరంగుల్ని విజయ సూచకంగా పేల్చారు. కానీ ఆ నగరం ఈ విజయాన్ని తమకందించిన తమ వీరుల్ని రెండు సంవత్సరాల తర్వాత వారంతా నెపోలియన్ వెన్నంటి వెళ్లి రెండు సంవత్సరాల తర్వాత తిరిగొచ్చే దాకా చూడలేకపోయింది. ఇక ఈ మహా విజయంతో దక్కిన అవకాశం వల్ల తాను యూరప్ స్వాతంత్ర్యాన్ని సాధించిపెట్టిన వానిగా కనిపించడం కోసం అలెగ్జాండర్1 ప్రతిజ్ఞ చేశాడు నెపోలియన్ అంతాన్ని చూస్తానని! 1814 మార్చి 31 నాడు దాదాపు వంద సంవత్సరాల తర్వాత సెయింట్ పీటర్స్ బర్గ్ నగరాన్ని నిర్మించడమూ, సంస్కరణలను అత్యంత పట్టుదలతో మొదలు పెట్టడమూ పీటర్ దీ గ్రేట్ చేసిన తర్వాత, ఇప్పుడు అలెగ్జాండర్ తన శ్వేతాశ్వాన్ని అధిరోహించి, పారిస్‌లో ప్రసిద్ధి కెక్కిన వీరుల పథమైన 'ఛాంప్స్ - ఎలైసీస్' రాజమార్గంపై ముందుకు మార్చి చేసుకుంటూ వెళ్లాడు. (నెపోలియన్ బోన పార్టీ విప్లవ విజయం సాధించాక, పారిస్ నగరంలోని ఈ మార్గాన్ని తన వీర విజయానికి చిహ్నంగా, అమర వీరులకు నివాళులర్పించే పేర నిర్మించాడు. ఇప్పుడు ఈ అవెన్యూ నుండి అలెగ్జాండర్ ముందుకు వెళ్లాడన్నమాట. నెపోలియన్ సేనల్ని తరుముతూ - రచ).

అతడిని అనుసరిస్తూ మార్చింగ్ చేసుకుంటూ వచ్చిన సైనికాధికారులంతా సెయింట్ పీటర్స్ బర్గ్‌లోని ప్రభు వర్గం సంతానమే. ఒక శతాబ్దానికి ముందు సంస్కరణలు చేయకుండా, మధ్య యుగాల సంస్కృతిలో ఉన్న రష్యా కనీసం బాల్టిక్ సముద్రంపై కూడా ఆధిక్యాన్ని చూపలేకపోయింది. ఇదంతా యూరప్‌కు తెలుసు. ఇప్పుడలాంటి రష్యా యూరప్‌ను రక్షించినదిగానే గాక, యూరప్‌లో అత్యంత శక్తివంతమైన సభ్యదేశం! అలాంటి స్థితిని సాధించడానికి శతాబ్దం పాటు కృషి జరిగింది – ఆధునికత కోసం కొత్త ఆలోచనలతో దాన్ని మొదలెట్టిన పీటర్ ది గ్రేట్ (సంస్కరణల ముసుగులో యూరపియన్ సంస్కృతిపై వెర్రి వ్యామోహంతో అతడు బలవంతంగా రుద్దిన వెర్రి నాగరికత కోసం ప్రజలపై జరిపిన తీవ్ర అణచివేతకు అతని కుటుంబ సభ్యులు కూడా కొందరు బలికావడం ఆ సంస్కరణల కనిపించని రెండో వేపు – రచ), దానికి కేవలం ఒక చిహ్నంగా నిలిచిపోయిన సెయింట్ పీటర్స్ బర్గ్ నగరం. రష్యా ఈ విజయం – ఒక ముసుగు లాగా – ఏమాత్రం సరిదిద్దలేని లోపాలను, అలాగే ఇతరులను ప్రలోభపరిచేలా ఉండే నమ్మకాలను కలిగి, రష్యా (సామాజిక స్థితి) పద్ధతి, పునాది పరంగా చాలా బలంగా ఉన్నదని భ్రమింపజేస్తుంది. కానీ ఈ పద్ధతి తిరిగి దాడులకు గురైంది.

### డిసెంబ్రిస్టు సొసైటీ ఎదుగుదల

**1) ప్రథమ సంకేతం : సెమినోవ్‌స్కీ సంఘటన**

సెమినోవ్‌స్కీ అనే పేరు ఒక సైనిక రెజిమెంటుకు పెట్టిన పేరు. రష్యన్ సైన్యంలో గల అతి పురాతన రెజిమెంట్లు రెండింటిలోనూ ఈ రెజిమెంటు ఒకటి. ఈ రెజిమెంటు అలెగ్జాండర్1కు చాలా ఇష్టమైన రెజిమెంటు. ఎందుకంటే, ఇందులోని అధికారులంతా సెయింట్ పీటర్స్‌బర్గ్ నగరానికి చెందిన అత్యున్నత స్థాయి ప్రభువర్గానికి చెందిన వారవడమే గాక, వారిలో చాలా మంది బాగా చదువుకున్నవారూ, ఉదారవాద భావాలు కలిగినవారూ. వీరిలో పలువురు తర్వాత డిసెంబ్రిస్టు ఉద్యమంలో పనిచేశారు. ఈ రెజిమెంటులో పనిచేస్తున్న ప్రైవేట్లతో (కింది స్థాయి సైనికులు) ఈ అధికారులకు మర్యాదపూర్వక సాధారణ సంబంధాలు ఉన్నాయి. ఈ రెజిమెంటులో కార్పొరల్ పనిష్మెంట్లు (కింది స్థాయి సైనికులపై, వారు చేసే తప్పులను బట్టి, అధికారులతో నడుచుకునే విధానాన్ని బట్టి అధికారులు విధించే శిక్షలు – రచ) లేవు. వాటిని ఈ రెజిమెంటు అధికారులు రద్దు చేశారు. ఈ నెపోలియన్ యుద్ధాల నుంచీ, మొత్తం విదేశీ కాంపైన్ నడిచేదాకా, ఎన్నో కఠిన పరిస్థితులను ఎదుర్కొన్న వీరంతా, కింది స్థాయి సైనికులలో ఎలాంటి అవిధేయ చర్యల్నీ గుర్తించలేదు. 1815లో సెయింట్ పీటర్స్ బర్గ్‌కు ఈ రెజిమెంటు తిరిగి వచ్చేదాకా, ఏ సైనిక యూనిట్‌కైనా గర్వకారణమనిపించే ఈ రికార్డును ఈ రెజిమెంటు కలిగి ఉంది!

అయితే త్వరగానే ఈ రెజిమెంటులో గల ఉదారవాద వాతావరణం సంగతి సంప్రదాయిక వాదుల దృష్టికి వచ్చింది. 1820లో నాటి రక్షణ, ప్రధాన మంత్రిగా ఉన్న రాకుమారుడు అరక్షీవ్, ఈ సెమినోవ్‌స్కీ కమాండర్‌గా ఉన్న గౌరవనీయుడైన జనరల్ యాకోవ్ పొత్యోమ్కిన్‌ని ఉత్తిపుణ్యానికి, నిర్దాక్షిణ్యంగా ఉద్యోగం నుండి తొలగించాడు. ఆ తర్వాత ఆ రెజిమెంటుకు కమాండర్‌గా కలనల్ ష్వార్జ్‌ని నియమించాడు. దాంతో వెంటనే డ్యూటీలో చేరిన కలనల్ ష్వార్జ్, పాత కార్పొరల్ పనిష్మెంట్లను పునరుద్ధరించడమే గాక, తాను పదవిలోకి వచ్చిన మరు క్షణం నుండే శిక్షల్ని అతి క్రూరంగా, చట్టబద్ధమైనవి కాకుండా కూడా విధించడం మొదలెట్టాడు.

దీంతో 1820 అక్టోబర్ 16న పలువురు సైనికులు ఒకచోట సమావేశమై, ఈ తీవ్ర శిక్షల్ని ఇక భరించలేమని తీర్మానించుకుని, కలనల్ ష్వార్జ్‌కు వ్యతిరేకంగా ఫిర్యాదు చేయాలనుకున్నారు. దాంతో వారింకా ఫిర్యాదు కూడా చేయక మునుపే ఆ సైనికుల్ని సైన్యం అరెస్టు చేసి, పీటర్ అండ్ పాల్ కోటలో బంధించింది. ఆ వెంటనే మిగిలిన రెజిమెంటులోని వారంతా వెళ్లి తమ సహచరులను వెంటనే విడుదల చేయాలనీ, అలాగే కలనల్ ష్వార్జ్‌ను ఆ పదవి నుంచి తొలగించాలనీ గట్టిగా పై అధికారులను కోరారు. అందుకు సమాధానంగా పై అధికారులు ఆ మొత్తం రెజిమెంటును అరెస్టు చేసి జైల్లో పెట్టి కొన్ని రోజుల తర్వాత వారందరినీ దూర ప్రాంతాల్లో గల వేర్వేరు సైనిక స్థావరాల్లో నియమించారు. వారికి గల పూర్వ హక్కుల్ని 1823లో మాత్రమే పునరుద్ధరించారు!

సెమియోనోవ్స్కీ రెజిమెంటులో జరిగిన పై చర్యల ఫలితంగా పలు సంఘటనలు జరిగాయి. అందులో ఒకటి ఆ రెజిమెంటు మాజీ అధికారులు, తమ మధ్యగల స్నేహ సంబంధాలను, తాము ఆ రెజిమెంటు నుండి వేరే స్థానాలలోకి బదిలీ అయినా వదిలిపెట్టక కొనసాగించారు. ఇలాంటి వారిలో ఒకరు మురావియేవ్ – అపోస్తోల్. ఇతడు, భవిష్యత్తు దక్షిణాది సొసైటీ నాయకుల్లో ఒకడు. నిజాయితీగల ఈ పాత మిత్రులు రాబోయే తిరుగుబాటును సమర్థించడమే గాక, 1825లో ఆ దక్షిణాది సొసైటీ జరిపిన తిరుగుబాటులో స్వయంగా పాల్గొన్నారు కూడా! ఇది జరగకుండా నివారించడం కోసం, కనీసం దానికి 'స్థానికత' జోడించ బడకుండా ఉండడం కోసం, వారంతా సెయింట్ పీటర్స్ బర్గ్ నగర వాసులైనందున, దూరంగా వారిని బదిలీ చేసి, వేర్వేరు యూనిట్లలో నియమించడం ద్వారా వారికి స్థానిక ప్రజలతో నిత్య సంబంధాలైతే లేకుండా చేయగలిగారు కానీ, వారి తిరుగుబాటు స్వభావాన్ని పెద్ద స్థాయిలో, డిసెంబ్రిస్టు రూపాన్ని సంతరించుకోవడానికి అది మరింత విశాల ప్రాంతాలలోకి విస్తరించడానికీ దోహదపడ్డారు. అసలు ఆ తిరుగుబాటు మొదట పీటర్స్ బర్గ్‌లోనే మొదలు కావడం జారిష్టు అధికార వర్గానికి చెంపపెట్టు అని కూడా చెప్పవచ్చు. సెమినోవ్‌స్కీ సంఘటన పొడిగింపే 1825 డిసెంబర్‌లో సెయింట్ పీటర్స్ బర్గ్‌లో ఏదైతే జరిగిందో ఆ మహా విషాదకర సంఘటన, డిసెంబ్రిస్టు తిరుగుబాటు అని చెప్పడంలో అతిశయోక్తి ఏమీలేదు. సైన్యంలో పెల్లుబికిన అసంతృప్తి నియంత్రణ సరిగ్గా జరగనప్పుడు సెమినోవ్‌స్కీ సంఘటన జరిగింది. ఈ సెమినోవ్‌స్కీ సంఘటన తర్వాత దేశంలో పలు రాజకీయ గ్రూపులు విప్లవ లక్ష్యాలతో, పలు రహస్య సొసైటీల్ని నిర్వహించడం మొదలెట్టారు. ఇలాంటివే పశ్చిమ యూరప్‌లోనూ ఉన్నాయి. కానీ ఇలాంటి పరిణామాలు సరాసరి బహిరంగంగా వ్యక్తం కావడం, 1825 డిసెంబర్ నెలలోనే, రష్యాలోనే జరగడం గమనార్హం!

*(ఇంకా ఉంది)*

*(రచయిత రష్యన్ విప్లవాల, లెనిన్ జీవిత చరిత్ర పరిశోధకుడు, సాహిత్యకారుడు, విమర్శకుడు)* వీ

# డేవిడ్ హార్వే: పెట్టుబడి - 7 ప్రధాన వైరుధ్యాలు

***పెట్టుబడిదారీ వ్యవస్థ తనలోని పదిహేడు అంతర్ వైరుధ్యాల వల్ల పతనం దిశగా పయనిస్తుందని డేవిడ్ హార్వే చేసిన విశ్లేషణలోని ఏడు ప్రాథమిక వైరుధ్యాలను వివరిస్తున్నారు* రమేష్ పట్నాయక్**

*(...గత సంచిక తరువాయి భాగం)*

డేవిడ్ హార్వే తన ప్రతిపాదనల పరిమితులను స్పష్టంగా పేర్కొనకపోయినా, మనం ముందుగానే గమనించినట్లు తను అమెరికా లేదా అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలకు చెందిన ఈ మధ్యకాలపు, అంటే రెండవ ప్రపంచ యుద్ధానంతర ఆర్థిక చరిత్రను ఇక్కడ క్రోడీకరిస్తున్నాడు. డేవిడ్ హార్వే: '... ఆర్థిక విధానం, సిద్ధాంతాల మధ్య సమాంతరమైన మార్పులు జరుగుతూ వచ్చాయి. మార్క్స్ పెట్టుబడి వాల్యూం రెండులో సుమారు ఒడంబడికలో ఉన్న కీన్స్ డిమాండు మానేజ్‌మెంట్ అనే ఆర్థిక శాస్త్ర ఆలోచనలు 1960లలో ఆధిపత్యంలో ఉండగా 1980ల తరువాత మార్క్స్ వాల్యూం ఒకటిలో పేర్కొన్న విషయాలతో సుమారు ఒడంబడికతో ఉన్న ద్రవ్య నియంత్రణ వాదుల, సప్లై సైడ్ మానేజ్‌మెంట్ సిద్ధాంతాలు ప్రాధాన్యత సంతరించుకున్నాయి. పెట్టుబడిదారీ దేశాలలో ఆలోచనలలోనూ, ప్రభుత్వ విధానాలలోనూ సంభవించిన ఈ మార్పుల చరిత్ర మార్క్స్ పెట్టుబడి మొదటి, రెండవ వాల్యూంలలో విశ్లేషించబడిన ఉత్పత్తికి, విలువ వాస్తవీకరణకు మధ్య ఉన్న వైరుధ్యపూరితమైన ఐక్యతకు ఒక సంబంధాన్ని చూడడం ప్రధానమైన విషయమని నేను భావిస్తాను....' అంటాడు. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల ప్రస్తుత వైరుధ్యాలకు సంబంధించినంత వరకు డేవిడ్ హార్వే చెప్పిన ప్రతి విషయం, ప్రధానంగా సరుకుల ఎగుమతికి అవకాశం లేని దేశాలకు పూర్తిగా వాస్తవమైనదే.

తరువాత డేవిడ్ హార్వే రుణ సౌకర్యం గురించి మాట్లాడుతున్నాడు. ఈ విషయంలో కొన్ని అంశాలను ముందుగా మనం చర్చించుకున్నాం. డేవిడ్ హార్వే పరిశీలనలను ఇక్కడ గమనిద్దాం. డేవిడ్ హార్వే: 'కష్టకాలంలో పెట్టుబడి ఎదుగుదలకు రుణవ్యవస్థ 'కొనుగోలు దారులకు రుణాలు ఇవ్వడం' నిర్మాణాత్మక పాత్ర పోషించింది. అయితే రుణ వ్యవస్థ వలన అదనపు విలువ ఉత్పత్తికి, దానిని లాభంగా వాస్తవీకరించుకోవడానికి మధ్య వైరుధ్యం సరుకులలో ఉన్న విలువకు, డబ్బురూపంలో దాని వ్యక్తీకరణకు మధ్య వైరుధ్యంగా మారిపోయింది. ఈ రుణవ్యవస్థ ఒకవైపు, పెట్టుబడి నిరంతరాయ ప్రవాహానికి ఆటంకం కలిగించే ఎన్నో సమస్యలకు ఉపశమనం కలిగించగా అదే సందర్భంలో సరకుల ధరల అధివూహాగానాల (స్పెక్యులేషన్)కు దారితీసింది. గృహ సౌకర్య ధరల బుడగ ఇందుకు ఉదాహరణ. రుణ సౌకర్యంపై నియంత్రణలు అదనపు విలువను ఉత్పత్తి చేయడం, దానిని వాస్తవీకరించు కోవడం అనే సమస్యను తీవ్రతరం చేస్తుంది. కాగా రుణ సౌకర్య వితరణకు ఉన్న నిబంధనలను తొలగిస్తే, నియంత్రణలను ఉపసంహరిస్తే అది అడ్డూ అదుపూ లేని అధివూహాగానాలకు ప్రధానంగా ఆస్తుల విషయంలో అధివూహాగానాలకు వరద గేట్లను తెరుస్తుంది. 'పెట్టుబడి ఎన్ని కుప్పిగంతులు వేసినా' ఎప్పటికీ మౌలిక సమస్య అయిన ఉపయోగపు, మారకపు విలువల మధ్య ఉన్న వైరుధ్యం, సామాజిక శ్రమకు, డబ్బురూపంలో వ్యక్తమయ్యే దాని విలువకు మధ్య ఉన్న వైరుధ్యం మాత్రం రద్దుకాజాలవు. ఈ వివిధ వైరుధ్యాల మధ్య అంతఃసంబంధాలు పదే పదే ద్రవ్య, వాణిజ్య సంక్షోభాలకు దారి తీస్తాయి' అంటాడు. డేవిడ్ హార్వే: 'అదనపు విలువ ఉత్పత్తి, లాభాల వాస్తవీకరణ అనే వైరుధ్యానికి అనేక ద్వితీయ వైరుధ్యాలు అంటి పెట్టుకుని ఉన్నాయి. అదనపు విలువ ఉత్పత్తి అయ్యేది పని స్థలం అంటే పరిశ్రమ వద్ద, కాగా అది వాస్తవీకరణ పొందేది అంటే ధన రూపంలో లాభంగా మారేది మార్కెట్‌లో అన్న విషయం తెలిసిందే. అయితే ఈ లాభంలో బ్యాంకువాడు, భూయజమాని, సరుకులు అమ్మిపెట్టే వ్యాపారి, పన్ను రూపంలో ప్రభుత్వం వాటాలు అడుగుతారు. కొన్ని సందార్భాలలో ఆ వాటాలే ఎక్కువై పారిశ్రామిక పెట్టుబడి దారుడికి మిగిలేది స్వల్పం అవుతుంది. ప్రధానంగా 'ద్రవ్య రంగంలోనూ, వ్యాపార రంగంలోనూ మోనోపలి ఏర్పడినప్పుడు' బ్యాంకులు అధిక వడ్డీని, వ్యాపారులు అధిక రిబేటును గుంజుతారు. చైనాలో వ్యాపార రంగంలో ప్రవేశించిన వాల్ మార్ట్ అక్కడ పరిశ్రమలలో ఉత్పత్తి అయిన లాభాలన్నింటిని గుంజుతుంది' అంటాడు. అదనపు విలువ సృష్టి పరిశ్రమలలో జరిగినా దాని నుండి లాభం పారిశ్రామిక పెట్టుబడిదారునికి కాక ఇతర పెట్టుబడిదారులకు చెందడం వలన పారిశ్రామిక పెట్టుబడి తగినంతగా పెరగదు అంటాడు డేవిడ్ హార్వే. అది నిజమే. కాని పెట్టుబడి ఎక్కడికీ పోదు. స్థిరాస్తి యజమానుల వద్దకు చేరిన లాభాలతో వారు మొనోపలి కనిష్ట ధరలకు చిన్న ఆస్తిపరులు ఆస్తిని కొనివేస్తారు. స్థిరాస్తిపరుల ఆస్తి పెరుగుతూ ఉంటుంది. తమ ఆస్తులు అమ్ముకున్నవారు వచ్చిన ధనంతో మార్కెట్‌లో వస్తు సేవలు కొనుగోలుచేస్తారు. ఇదికొంత డిమాండును సృష్టిస్తుంది. ఇక లాభాలు పొందిన వ్యాపార సంస్థలు చిన్న చిన్న వ్యాపార సంస్థలను దివాళా తీయిస్తాయి. తమ వ్యాపారాలను తెగనమ్ముకున్న చిన్న చిన్న వ్యాపారులు కూడా ఫకీరులుగా మారిపోయే క్రమంలో వివిధ సరుకులకు కొంత కాలం కొంత డిమాండును కల్పిస్తారు. బ్యాంకులు కూడా ఇదే విధంగా మోనోపలివైపు ప్రయాణిస్తున్న విషయం తెలిసిందే. అంతేకాదు, ఆ పెట్టుబడి వర్గాలలో (వస్తు తయారీ పరిశ్రమ, స్థిరాస్తి, వ్యాపారం) ఎవరికైనా విస్తరణావకాశాలు లేనప్పుడు వారు తమ లాభాలను బ్యాంకులలో వేస్తూంటారు, లేదా లాభాలు వచ్చే రంగాలలో షేర్లు కొనుగోలు చేస్తూంటారు. ఈ పెట్టుబడి విభాగాల మధ్య బ్యాంకింగ్, షేర్ మార్కెట్ వ్యవస్థల ద్వారా ఒక విధమైన సంలీనత ఉంది. కార్ల్ మార్క్స్ చెప్పినట్లు పెట్టుబడి అధిక లాభాల విభాగాల వైపు కదులుతూ లాభాల రేటులో ఒక సరాసరి పరిస్థితిని కల్పిస్తూ ఉంటుంది. స్థిరాస్తి, వ్యాపార రంగాలు లాభాల పంపకంలో అధికాధికంగా బలమైన పోటీదారులుగా పారిశ్రామిక పెట్టుబడిని ఒక గడ్డు సమస్యలోనికి నెట్టివేసాయి. అలాగే స్థిరాస్తిలో భూమి మాత్రమే కాక రైల్వేలు రోడ్లు, ఓడ రేవులు, విమానాశ్రయాలు వంటివి కూడా ఉన్నప్పుడు, అవి కూడా మోనోపలి పెట్టుబడిగా మారినప్పుడు పరిశ్రమలు తమకవసరమైన రవాణాకు మోనోపలి ధరలు చెల్లించాల్సి వస్తుంది. అంటే ఆ మేరకు సరుకులు ఉత్పత్తి చేసే పరిశ్రమల లాభాలలో కోత పడుతుంది . దీనినే డేవిడ్ హార్వే ఇక్కడ నొక్కిచెప్తున్నాడు.

కార్మికుల నుండి వారు సృష్టించిన అదనపు విలువ దోపిడీ చేయబడిన తరవాత దానిని ఎవరు భుక్తం చేస్తే మనకేమని ఊరుకోలేము. ఎందుకంటే ఆర్థిక అభివృద్ధి అనేదానిని వస్తువుల ఉత్పత్తి, పరిమాణాలు, ప్రమాణాలతో కొలుస్తారు. కాబట్టి ఉత్పత్తి అవుతున్న లాభాలు పారిశ్రామిక పెట్టుబడిదారులకు ఎక్కువగా చేరితే, వస్తూత్పత్తి రంగం మరింత అభివృద్ధి చెందుతుంది. అందుకే లాభాలు స్థిరాస్తిదారులకు, వ్యాపారులకు, బ్యాంకులకు అధికాధికంగా దఖలుపడడం అభివృద్ధికి ఆటంకంగా చెప్తారు. స్థిరాస్తిదారులను, వ్యాపారులను, బ్యాంకర్లను ఉత్పత్తిచేయకుండా అద్దెలు వసూలు చేసుకుని బతికే వర్గాలుగా పారిశ్రామిక పెట్టుబడిదారులే కాక ఆర్థిక వేత్తలు కూడా విమర్శిస్తారు. పారిశ్రామిక పెట్టుబడిదారుడు ఉత్పత్తిని నిర్వహించి అదనపు విలువ సృష్టికి కారకుడైతే మిగిలిన పెట్టుబడి వర్గాలు (బ్యాంకులు, వ్యాపారులు, స్థిరాస్తిదారులు) ఉత్పత్తి ప్రక్రియతో సంబంధం లేకుండా లాభాల పంపకంలో మాత్రం వాటాకు వస్తారనే విమర్శ ఉంది. ఇది న్యాయాన్యాయాలకు సంబంధించిన విషయం కాదు. అదనపు విలువ సృష్టించిన కార్మికుల నుంచి అది లాగివేయబడిన తరువాత న్యాయాన్యాయాల చర్చ ఏం ఉంటుంది. లాభాలలో వాటా పారిశ్రామిక పెట్టుబడిదారులకు ఎక్కువగా మిగిలితే పెట్టుబడి వస్తూత్పత్తి వైపు ఎక్కువగా జరుగుతుందనేది, వస్తూత్పత్తి పెరుగుతుందనేది ఇక్కడ ప్రధాన విషయం. రిబేటు తీసుకుని వ్యాపారం చేయవలసిన వ్యాపారులు మోనోపలిగా మారి, పైచేయి ఎలా సాధించారో డేవిడ్ హార్వే వివరించలేదు. నిజానికి వ్యాపారంలో మోనోపలి ఏర్పడడం వలన వాణిజ్య సంక్షోభం రాలేదు. పారిశ్రామిక సరుకులు కొనుగోలు చేసేవారు లేకపోవడంతో వస్తువును ఉత్పత్తి చేయడం కంటే అమ్మి పెట్టడమే గొప్ప విషయంగా మారిపోయింది. అందుకే పారిశ్రామిక వర్గాల కంటే వ్యాపార వర్గాలకు ప్రాధాన్యత పెరిగింది. అంతేకాదు, పారిశ్రామిక రంగం క్యాపిటల్ ఇంటెన్సివ్ కాగా వ్యాపార రంగం లేబర్ ఇంటెన్సివ్. ఫలితంగా లాభం రేటు వ్యాపారం రంగంలో ఎక్కువగా ఉంటుంది. ఈ విషయాలను మనం గత అధ్యాయాలలో కూడా చర్చించాము.

డేవిడ్ హార్వే ఇక్కడ మరొక్క సమస్యను చర్చిస్తున్నాడు. డేవిడ్ హార్వే కార్మికులు తమ సమిష్టి పోరాటాల ద్వారా తమ కనీస వేతనాల కంటే అదనంగా తాము సృష్టించిన అదనపు విలువలో కొంత భాగాన్ని జీత భత్యాలుగా పొందగలిగితే దానిని తిరిగి హస్తగతం చేసుకోవడానికి పెట్టుబడి వివిధ రూపాలలో ప్రయత్నిస్తుంది.... వారు వాడే సరుకుల ధరలు పెంచడం ద్వారా, ఇంటి అద్దెలు పెంచడం ద్వారా వారిపై పన్నులు పెంచడం ద్వారా దీనిని సాధిస్తారు అంటాడు. పరిశ్రమలలో ట్రేడ్ యూనియన్ పోరాటాల ద్వారా సాధించుకున్న వేతనాల పెరుగుదలను మార్కెట్‌లో ధరలు పెంచడం ద్వారా పెట్టుబడిదారీ వర్గం కాజెయ్యడానికి ప్రయత్నించడం వాస్తవమే. అయితే, ఇలా చెపితే ఎలా ఉంటుందంటే జీతాలు పెంచుకోవడానికి కార్మిక వర్గం చేసిన పోరాటాల వలన ప్రయోజనం ఏమీ ఉండదని చెప్పినట్లు ఉంటుంది. వెస్టర్న్ ఇటువంటి వాదనలనే లేవనెత్తినప్పుడు మార్క్స్ ఆ వాదనను తిరస్కరించాడు. కార్మికులు తమ పోరాటాల ద్వారా వేతనాలు పెంచుకుంటే వారు కొనుగోలు చేసే సరుకులకు డిమాండు పెరుగుతుందని, అప్పుడు తాత్కాలికంగా వాటి ధరలు పెరుగుతాయని, ఆ సరుకులు ఉత్పత్తి చేసే పరిశ్రమలు అధిక లాభాలు చూస్తాయని, అయితే అనతి కాలంలోనే ఆ రంగం వైపు పెట్టుబడులు ప్రవహించడం వలన ఉత్పత్తి పెరుగుతుందని ధరలు తగ్గి సరుకులు విలువకు సర్దుకుంటాయని చెప్తాడు. మరొక విషయం ఏమంటే, ఒక దేశంలో కార్మికుల పోరాటం సార్వత్రికమైతే ఆ దేశంలో కార్మికుల జీవన ప్రమాణాలు ఉన్నత స్థాయిలో స్థిరీకరించ బడతాయి. అప్పుడు 'అవసర శ్రమ' వాటా పెరిగి 'అదనపు శ్రమ' వాటా తగ్గుతుంది. అయితే, ఇదంతా సాధారణంగా అభివృద్ధిచెందిన దేశాలలో జరుగుతుంది. ఏదేమైనా పోరాట ఫలితాలను తిరిగి గుంజుకోవడానికి ప్రయత్నం జరగదని కాదుకాని ఆ ప్రయత్నంలో పెట్టుబడి ప్రతీసారి విజయం పొందుతుందని చెప్పలేము.

ఈ సందర్భంలో డేవిడ్ హార్వే సామాజిక భద్రత విషయం చర్చించాడు. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఒకవైపు మార్కెట్ సంక్షోభాన్ని ఎదుర్కోవడానికి, ఇంకా ప్రధానంగా కార్మికుల విప్లవ తిరుగుబాటును ఎదుర్కోవడానికి పెట్టుబడిదారీ దేశాల ప్రభుత్వాలు సంక్షేమ రాజ్య విధానాలను అమలు చేయడం ప్రారంభించిన విషయం తెలిసిందే. అత్యధిక సోషలిస్టు రాజ్యాలు కూలిపోయిన తరువాత, పెట్టుబడిదారీ రాజ్యాలు తిరిగి రెండవ ప్రపంచ యుద్ధ పూర్వ పరిస్థితికి మారుతున్నాయి, కఠినమైన రాజ్యాలుగా మారిపోతున్నాయి. పెట్టుబడిదారీ రాజ్యాలు సామాజిక రక్షణలను రద్దుచేస్తున్నాయి. దీనినే డేవిడ్ హార్వే నిరాశ్రయులను చేయడం ద్వారా పెట్టుబడి సమీకరణ (అక్యూమిలేషన్ బై డిస్పొజిషన్) అని అన్నాడు. ఇప్పుడు పెట్టుబడిదారీ దేశాలు పెన్షన్లను రద్దుచేయడమే కాక విద్యా, వైద్యం, సాగునీరు, తాగునీరు, మునిసిపల్ సేవలన్నింటినీ ప్రైవేటు పరం చేస్తూ మొత్తం సామాజిక భద్రతలను తుడిచిపెడుతున్నాయి. దీని వలన పెట్టుబడికి రెండు లాభాలు జరుగుతున్నాయి. ఒకటి ప్రభుత్వానికి డబ్బులు మిగులుతాయి, కాబట్టి ప్రభుత్వం పెట్టుబడిదారులకు (రైతులకు కాదు) రుణమాఫీ పథకాన్ని అమలు చేయవచ్చు. దీనినే వారు నిర్వహణలో లేని ఆస్తులు (నాన్ ఫంక్షనింగ్ అసెట్స్)ను రద్దుచేయడమని సాధారణ ప్రజలకు అర్థం కాని భాషలో చెప్తారు. రెండవ ప్రయోజనం ఏమంటే విద్య, వైద్యం, సాగునీరు, తాగునీరు, మునిసిపల్ సేవలు వంటి సామాజిక రంగాల నుండి ప్రభుత్వం వైదొలుగుతున్నందున ఆయా రంగాలలో పెట్టుబడిదారులు వ్యాపారం చేసుకోవచ్చు. ప్రపంచంలో అనేక దేశాలు ఈ విధంగా ప్రజలను పెట్టుబడి కోరలకు అప్పజెప్తున్నాయి. అందుకు అంగీకరించని దేశాలనే అమెరికా వివిధ దొంగ సాకులు చూపి రోగ్ దేశాలని పేరుపెట్టి వాటిపై దండయాత్ర చేసి వాటిలో తమ తాబేదారులను నియమించి సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలను అమలు జరిగేటట్లు చూస్తున్నది.

ప్రభుత్వం కల్పించే సౌకర్యాలను సామాజిక వేతనం అని కూడా అనవచ్చు. విద్య, వైద్యం, సాగునీరు, తాగునీరు, మున్సిపల్ సేవలు వంటి సామాజిక రక్షణ చర్యలు ఉపసంహరిస్తే పెట్టుబడిదారులకు ఒనగూడే ప్రయోజనాలు మనం పైన పరిశీలించాము. అయితే అక్కడతో విషయం పూర్తి అయినట్లు కాదు. ఈ రంగాల నుంచి ప్రభుత్వం ఉపసంహరించుకున్నందున కార్మికులు విద్యా, వైద్యం వంటి ప్రతి సేవా కొనుగోలు చేయవలసి రావడం వలన వారి కనీస జీవితావసరాల కొనుగోలుకు అదనంగా డబ్బు అవసరం అవుతుంది. గతం కంటే అదనంగా వేతనం అవసరం అవుతుంది. కనీస వేతనాలు పెరగవలసి ఉంటుంది. అందుకై వారు సమరశీలంగా పోరాడుతారు. పోరాటాలు అనేక సందర్భాలలో విజయవంతం అవుతాయి. వారు చేసే శ్రమలో అవసర శ్రమ శాతం పెరిగి అదనపు శ్రమ శాతం తగ్గుతుంది. అంటే అదనపు విలువ తగ్గుతుంది. అంటే లాభాలకు ప్రాతిపదిక కుంచించుకు పోతుంది. ఈ ప్రక్రియ అభివృద్ధిచెందిన దేశాలకు పూర్తిగా వర్తిస్తుంది. అంటే సామాజిక వేతనం రద్దయినప్పుడు పరిశ్రమలో ఇచ్చే వేతనాలు పెరగవలసి ఉంటుందన్న మాట. అంతేకాదు, సుమారు అభివృద్ధిచెందిన దేశాలలో వాస్తవంగా వేతనాలు పోరాటాల వలన పెరుగుతాయి కూడా.

భారతదేశం వంటి అభివృద్ధి చెందుతున్న దేశాలలో విషయం ఇంత సరళంగా ఉండదు. ఇక్కడ నిరుద్యోగ సైన్యాలు ఎక్కువగా ఉంటాయి. ప్రభుత్వం కల్పించే సామాజిక రక్షణలు తగ్గినంత మాత్రాన కార్మిక వేతనాల

పెంపుదలకు చేసే పోరాటాలు విజయవంతం కావు. పూర్తిగా వేతనాలపై ఆధారపడే కార్మికులు కనీస అవసరాలు కూడా తీరకుండా పనిచేయవలసి వస్తుంది. వారి పిల్లలను వారి స్థాయికి కూడా వారు అభివృద్ధి చేయలేక పోతారు. అంటే కనీస వేతనాలు లేక తమను తాము పునరుత్పత్తి చేసుకోలేక పోతారు. వేతనాలు మాత్రమే కాకుండా భూములు ఇతర ఆస్తులు ఉన్నవారు వాటిని అమ్ముకుంటూ తమ పిల్లలను చదివించు కుంటారు. వారు భవిష్యత్ కార్మికులవుతారు. ఇప్పటి కార్మికుల పిల్లలు పరిచారికలవుతారు. అంటే రైతులు ఆస్తులు కోల్పోయి ఏమీ లేని కార్మికులవుతారు. ఇప్పటికే ఏమీ లేని కార్మికులు ఆ స్థితిని కూడా కోల్పోయి పరిచారికలవుతారు. అత్యంత తక్కువ వేతనాలు ఉన్న సేవారంగాలలో బతుకు తెరవుకై ప్రయత్నిస్తారు. కాని అదికూడా గ్యారంటీ ఉండదు. పీడిత వర్గాలు అతలాకుతలం అవుతాయి. అందుకే అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రభుత్వం సంక్షేమ రంగాన్ని నీరుకారిస్తే తీవ్ర సామాజిక సంక్షోభం ఏర్పడుతుంది. తీవ్ర వ్యతిరేకత వస్తుంది. సామాజిక సేవలు, సంక్షేమ రంగాలను రద్దుచేయాలంటే ముందుగా ప్రజల మధ్య సాధారణ ఐక్యతను విచ్ఛిన్నం చేయవలసి ఉంటుంది., ఎన్నికలను రద్దుచేయవలసి ఉంటుంది. అంటే ఫాసిజమే మార్గం. ప్రస్తుత పాలకులు అటువైపే అడుగులు వేస్తున్నారు. కార్మికులు, రైతులు, దళితులు, మహిళలు, మైనారిటీలు దీనిని ఆపగలరా అని చూడవలసి ఉంది.

ఆర్థిక సూత్రం మేరకు మనం చెప్పుకోవాలంటే పరిశ్రమ యజమాని ఇచ్చే వేతనం, ప్రభుత్వం సామాజిక సేవల ద్వారా అందించే విలువల మొత్తం కార్మికుల కనీస వేతనంగా ఉంటుంది. అభివృద్ధిచెందిన దేశాలలో సామాజిక సేవలు తగ్గితే, సుమారు వెంటనే పరిశ్రమలో ఇచ్చే వేతనాలు పెరగాలి, పెరుగుతాయి. అయితే, అభివృద్ధి చెందుతున్న దేశాలలో సామాజిక సేవలు తగ్గినంత మాత్రాన పరిశ్రమలలో వేతనాలు పెరగవు. రైతులు, వృత్తికారులు చిన్న చిన్న ఆస్తులున్న వారు తమ ఆస్తులను కోల్పోయి (అంటే వివిధ మార్గాలలో పెట్టుబడిదారులకు తమ ఆస్తులు అప్పజెప్పి) బుక్కా ఫకీరులవుతారు. ఈ విధంగా వర్గ విభజన తీవ్రతరం అవుతుంది. అంతేకాదు, జనాభా అదనంగా తేలుతుంది! అంటే మార్కెట్‌కు కార్మికులుగా గాని లేదా కొనుగోలుదారులుగా గాని అవసరం లేని జనాభా! వివిధ విభాగాల ప్రజలు జీవితపు అంచులకు నెట్టివేయబడతారు. ఆత్మహత్యలు ఒక నియమం అవుతాయి. అయితే, దీనితోపాటు మరొక ప్రక్రియ సమాంతరంగా జరుగుతుంది. అభివృద్ధిచెందిన దేశాలలో పెట్టుబడిదారులు మొత్తం భూములను, అడవులను, గనులను, నదులను, సామాజిక సంపదనంతా తమ ప్రైవేటు ఆస్తిగా మార్చుకున్న చరిత్ర తెలిసినదే. అటువంటి ప్రక్రియ నేడు భారత దేశం వంటి దేశాలలో జరుగుతున్నది. పెట్టుబడిదారుల దృష్టి పరిశ్రమలలో, వ్యాపారాలలో లాభాల మీద కంటే నేడు వీటిమీదే ఎక్కువ ఉందని చెప్పవచ్చు. ఇది ఒకప్పుడు ఇంగ్లాండులో జరిగిన ఆదిమ సంచయం (ప్రిమిటివ్ అక్యూములేషన్) వంటిది. ఈ పరిస్థితులలో ఇతర కారణాల వలన సామాజిక తిరుగుబాట్లు వస్తే అవి ఈ ప్రక్రియను కూడా అడ్డుకుంటాయి. అందుకే సామాజిక సేవలను రద్దుచేయడానికి ప్రభుత్వాలు అంత ధైర్యం చేయడం లేదు. అయితే ప్రపంచ సలహా మేరకు సామాజిక సేవలను ప్రభుత్వ సంస్థల ద్వారా కాకుండా ప్రైవేటు యాజమాన్యాల ద్వారా రీయింబర్స్‌మెంట్ పద్ధతిలో ఇస్తున్నారు. ఇది కూడా బెడిసి కొడుతుంది. పెట్టుబడి ఏ మార్గం ఎంచుకున్నా ఆ దారి వారిని ఎక్కువ దూరం తీసుకు వెళ్ళలేదు.

అనేక విషయాలు చర్చించిన తరువాత డేవిడ్ హార్వే ఒక సూత్రీకరణ చేస్తాడు. డేవిడ్ హార్వే సూత్రీకరణలో ఉత్పత్తి పక్షం, వాస్తవీకరణల పక్షం అన్న మాటలను వాడతాడు. పరిశ్రమలో వేతనాల వాటా తగ్గించి ఎక్కువ అదనపు విలువను ఉత్పత్తి చేయడానికి ప్రయత్నించడాన్ని ఉత్పత్తి పక్షం ఆర్థిక వ్యవస్థ అని, వాస్తవీకరణ వద్ద అంటే ఎక్కువగా అమ్ముకునేందుకు వీలైన పరిస్థితులు కల్పించుకునే విధానాన్ని డిమాండు పక్షం లేదా వాస్తవీకరణ పక్ష ఆర్థిక వ్యవస్థ అని అంటారు. డేవిడ్ హార్వే: 'ఉత్పత్తికి, దాని వాస్తవీకరణకు మధ్య ఉన్న వైరుధ్య పూరిత ఐక్యత కార్మికుల తలరాతకు ఎంతవరకు వర్తిస్తుందో పెట్టుబడికి కూడా అంతవరకు వర్తిస్తుంది. ఈ పరిస్థితి నుంచి చేయదగ్గ తార్కికమైన నిర్ధారణ ఏమంటే జీవితం, కార్యాచరణల వ్యాప్తంగా వర్గ వైరుధ్యం, వర్గ పోరాటాల మధ్య ఆవశ్యకంగా ఒకానొక వైరుధ్య పూరితమైన ఐక్యత ఉన్నదన్నదే'...అంటాడు. ఈ వ్యక్తీకరణ చూస్తుంటే కార్మిక వర్గం, పెట్టుబడిదారీ వర్గం రెండు వర్గాలు కూడా సమస్యలను ఎదుర్కొంటు న్నాయి, అవి రెండూ వైరుధ్యంలో ఉన్నా కలసి జీవించాలి, కలసి కార్యాచరణ సాగించాలి, కావున, రెండు వర్గాలు ఒక సామాన్య పరిష్కారం కనుగొనడం సాధ్యమే అని డేవిడ్ హార్వే చెప్తున్నట్లు అనిపిస్తున్నది. మనకు తెలిసినంత వరకు సాధారణ సందర్భంలో రెండు వర్గాలు వివిధ నిర్దిష్ట పోరాటాల వారిగా రాజీ పడతాయి. రాజీ సహజంగానే వర్గ బలాబలాలపై ఆధారపడి ఉంటుంది. అయితే, రాజీ పడడం సామాన్య పరిష్కారం కనుగొనడం ఎంతమాత్రమూ కాదు. సామాన్య పరిష్కారం అన్న పదబంధాన్ని హార్వే వాడకపోయినా ఐక్యతకు హార్వే ఇచ్చిన ప్రాధాన్యత అదే అర్థాన్ని ఇస్తున్నది. ఈ కింద ఆయన చూపిన ప్రత్యామ్నాయం కూడా అదే అర్థాన్ని ఇస్తున్నది. ఇక విప్లవ సందర్భంలో వర్గ పోరాటం అమీ తుమీ తేల్చుకుంటుంది. ఈ విషయం డేవిడ్ హార్వే అసలు రాయడు.

డేవిడ్ హార్వే : 'ఉత్పత్తి, దాని వాస్తవీకరణల మధ్య సంబంధాన్ని తారుమారు చేయడమే ఈ వైరుధ్యం మనలను నడిపించే రాజకీయ లక్ష్యం కాగలదు. విస్తృత ప్రజానీకానికి అవసరమైన ఉపయోగపు విలువలను అంచనా వేయడం, దానికనుగుణంగా ఉత్పత్తిని నిర్వహించడం అనేది వాస్తవీకరణ స్థానాన్ని ఆక్రమించాలి. దీనిని రాత్రికి రాత్రి చేయడం సాధ్యం కాకపోవచ్చు. అయితే క్రమ క్రమంగా మౌలిక అవసరాలను సరుకు లక్షణం నుండి విముక్తి చేయడం అనేది సాధ్యమయ్యే ఒక దీర్ఘకాల పథకంగా ఉండగలదు. ... మారకపు విలువను పెంచుకుంటూ పోవడం అనే లక్ష్యం కాకుండా ఉపయోగపు విలువను ఉత్పత్తి చేయడం అనే లక్ష్యం ఆర్థిక వ్యవస్థను నడిపించే సాధనంగా ఉండాలన్న భావనకు ఇది (తారుమారుచేయడం) సరిగా సరిపోతుంది.' అంటాడు. ఇంకా 'ఇది చాలా పెద్ద లక్ష్యంగా కనిపిస్తే ఐరోపాలో సోషల్ డెమోక్రాటిక్ రాజ్యాలు (ప్రధానంగా స్కాండినేవియన్ దేశాలు) 1960ల నుండి తమ పెట్టుబడిదారీ వ్యవస్థను ఒడిదుడుకులు లేకుండా నడుపుకోవడానికి డిమాండు పక్ష మేనేజ్‌మెంటు వైపు తమ ఆర్థిక విధానాన్ని దిశానిర్దేశం చేసుకున్న విషయాన్ని గుర్తుచేసుకుంటే ఉపయోగంగా ఉంటుంది.... ఉత్పత్తి – వాస్తవీకరణ పద్ధతిని తారుమారు చేయడం అనే పెట్టుబడిదారీ వ్యతిరేక ఆర్థిక విధానం కాంక్షించే పనిని వారు, అర్ధ మనస్కంగా చేసినా పాక్షికంగా సాధించారు.' అంటాడు. నిజానికి 'ఉత్పత్తి, దాని వాస్తవీకరణల మధ్య సంబంధాన్ని తారుమారు చేయడం' అంటే మారకపు విలువను పెంచుకుంటూ పోవడం అనే లక్ష్యం స్థానంలో ఉపయోగపు విలువలను ఉత్పత్తి చేయడం అనే లక్ష్యం పాదుకొల్పడమా? ఈ విషయంపై హార్వే ఎటువంటి వివరణ ఇచ్చినట్లు లేదు. ఒకప్పుడు కీన్స్ విధానాలను అవలంభించిన అమెరికా క్రమంగా లాభాల సంక్షోభాన్ని ఎదుర్కొని ఆ విధానాలను పక్కన పెట్టేసింది. స్కాండినేవియన్ దేశాలు ఒక్క మినహాయింపు. అటువంటి మినహాయింపు మరికొన్ని దేశాలకు సాధ్యం కావచ్చునేమో కాని అటు అమెరికాకు గాని ఇటు భారతదేశానికి గాని సాధ్యం కాదు. డేవిడ్ హార్వే చూపిన రాజకీయ పరిష్కారాలు ఆమోదించడం కొంత కష్టంగానే ఉంది. ఇంతటితో ఏడవ వైరుధ్యంపై చర్చ ముగిద్దాం.

*(కన్వీనర్, ఆంధ్రప్రదేశ్ విద్యాపరిరక్షణ కమిటీ)* వీ

### సిఎఎ, ఎన్ఆర్సి, ఎన్పిఆర్లకు నిరసనలు

విజయవాడలో సిఎఎ, ఎన్ఆర్సి, ఎన్పిఆర్లకు వ్యతిరేకంగా సిపిఐ, సిపిఎం పార్టీలతో పాటు 36 ప్రజా హక్కుల సంఘాల ఆధ్వర్యంలో జనవరి 31న విజయవాడలోని మాకినేని బసవపున్నయ్య స్టేడియంలో బహిరంగ సభ నిర్వహించారు. ఫిబ్రవరి 2న బహుజన రచయితలు, కవులు, కళాకారులు 'భారత రాజ్యాంగాన్ని పరిరక్షించుకుందాం పేరుతో ఉస్మానియా యూనివర్సిటీ లోని జి. రాంరెడ్డి డిస్టెన్స్ హాల్లో బహుజన రచయితల వేదిక ఆధ్వర్యంలో సాహిత్య జాతర నిర్వహించారు. మహిళా గర్జన, ఆజాద్‌బాగ్ పేరుతో తూర్పుగోదావరి జిల్లా కాకినాడలోని బాలాజీ చెరువు వద్ద ముస్లిం మహిళలు నిరసనలు కొనసాగిస్తున్నారు. ఫిబ్రవరి 18న వీరికి సిపిఐ, సిపిఎం, ప్రజా సంఘాల నాయకులు సంఘీభావం తెలిపారు. మనమంతా భారతీయులం, రాజ్యాంగ విలువలను రక్షించుకోవాల్సిన అవసరం ఉందని తెలిపారు.

### ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక సభలు

ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక ఐదవ మహాసభలు మహబూబ్‌నగర్‌లో ఫిబ్రవరి 8, 9 తేదీల్లో హెచ్.బి. పాలెస్ ఫంక్షన్ హాల్లో 'నేరము,శిక్ష- భిన్న కోణాలు' అంశంపై జరిగాయి. ప్రారంభోపన్యాసం ప్రొ. హరగోపాల్ చేశారు. శిక్షానేరాలకు శాశ్వత నిర్వచనాలు లేవని, కాలం మారేకొద్దీ, సమాజంపై అవగాహన పెరుగుతున్న కొద్దీ శిక్షలపై అభిప్రాయాలు మారుతూ వస్తున్నాయని హరగోపాల్ అన్నారు. నేరాన్ని వ్యక్తికోణంలో కాకుండా మూలాలను గుర్తించే కోణంలో చూస్తే నేరాల నిరోధానికి అది దోహదపడుతుందన్నారు. నేరానికి నేరం పరిష్కారం కాదన్నారు. ఆంధ్రజ్యోతి సంపాదకులు కె. శ్రీనివాస్ సమాజం సమిష్టి నైతిక విలువలను పెంచుతూ నేరాలను నిరోధించాలన్నారు. నిర్భయ ఘటన నిందితుల్ని చంపడంలో ప్రతీకారమే తప్ప... నేర నివృత్తికి ఆస్కారముండదన్నారు. నేరాన్ని అదుపు చేయాలంటే శిక్షల విషయంలో సంస్కరణాత్మకంగా ఉండాలని అన్నారు.

### మాడభూషి రంగనాథం మృతి

పిలుపు పత్రిక సంపాదకుడు, పౌరహక్కుల సంఘం నాయకుడు మాడభూషి రంగనాథం(72) అనారోగ్యంతో బాధపడుతూ సికిందరాబాద్‌లోని కిమ్స్‌లో చికిత్స పొందుతూ ఫిబ్రవరి 18న మృతిచెందారు. రంగనాథం స్వస్థలం తూర్పుగోదావరి జిల్లా పుట్టకొండ గ్రామం. ఆయన విద్యార్థి దశలోనే కమ్యూనిస్టు రాజకీయాల పట్ల ఆకర్షితులయ్యారు. ఆంధ్ర యూనివర్సిటీలో పియుసి చేసి హైదరాబాద్‌కు వచ్చారు. సికిందరాబాద్ కుట్రకేసులో రాజ ద్రోహం అభియోగం మోపడంతో ఐదేళ్లు జైలు శిక్ష అనుభవించారు. పౌర హక్కుల సంఘం వ్యవస్థాపక కార్యవర్గ సభ్యుడిగా పని చేశారు. 1975లో తొలి ప్రపంచ తెలుగు మహాసభలకు వ్యతిరేకంగా నిరసన సభలో పాల్గొని అరెస్టయ్యారు. తుదివరకు విప్లవోద్యమ సానుభూతిపరుడిగా కొనసాగారు.

### కమ్యూనిస్టు ప్రణాళిక పుస్తకావిష్కరణ

కార్ల్ మార్క్స్, ఎంగెల్స్ రాసిన 'కమ్యూనిస్టు ప్రణాళిక' విడుదలై 172 ఏళ్లైన సందర్భంగా దాని తెలుగు అనువాదాన్ని సిపిఐ నారాయణ, సిపిఎం రాఘవులు ఫిబ్రవరి 21న ఢిల్లీలో ఆవిష్కరించారు. అదే రోజు హైదరాబాద్ లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో 'రెడ్ బుక్ డే సందర్భంగా ప్రముఖ కవి కె. శివారెడ్డి కమ్యూనిస్టు ప్రణాళికను ఆవిష్కరించారు. శ్రామికులను, పెట్టుబడిదారులను అధ్యయనం చేసి మార్క్స్, ఎంగెల్స్ ఈ మేనిఫెస్టో అందించారని వక్తలు తెలిపారు. దోపిడి శక్తులను అర్థంచేసుకొని తిప్పికొట్టడానికి పీడిత ప్రజలకు కమ్యూనిస్టు ప్రణాళిక ఆయుధమన్నారు.

### సుప్రీం వ్యాఖ్యలపై దళిత బహుజనుల నిరసనలు

ఉద్యోగాలు, ప్రమోషన్ల కోసం రిజర్వేషన్లు కల్పించాలన్నది ప్రాథమిక హక్కు కాదని సుప్రీం కోర్టు చేసిన వ్యాఖ్యలను నిరసిస్తూ ఆంధ్రప్రదేశ్‌లో ఫిబ్రవరి 23న నిరసనలు కొనసాగాయి. ఎస్సి, ఎస్టి, బిసిల కోసం భారత రాజ్యాంగం కల్పించిన హక్కులను కాలరాస్తున్నారని, దీనిపై కేంద్ర ప్రభుత్వం స్పందించాలని నిరసనకారులు డిమాండ్ చేశారు. పశ్చిమగోదావరి జిల్లాలో భీమ్ ఆర్మీ చీఫ్ చంద్రశేఖర్ ఆజాద్ రావన్ పిలుపుమేరకు బంద్ నిర్వహించారు. విశాఖ జిల్లా అనకాపల్లి, విజయనగరం, కృష్ణా జిల్లా మచిలిపట్నం, శ్రీకాకుళాలలో దళిత, ఆదివాసి, బిసి ఉద్యోగ సంఘాల జెఏసి ఆధ్వర్యాన ధర్నాలు, ర్యాలీలు నిర్వహించారు. భారత రాజ్యాంగం కల్పించిన హక్కులను కాలరాయ బడుతున్నాయని, వీటిని సాధించుకోవడానికి సమిష్టి పోరాటం చేయాలని నిర్ణయించారు. మతోన్మాదుల పాలనలో దళిత, ఆదివాసి, వెనుకబడిన వర్గాల రిజర్వేషన్లను ఎత్తివేసే కుట్ర జరుగుతుందని అన్నారు.

### జయమ్మ మృతి

నక్సలైట్ ఉద్యమంలో కీలక పాత్ర పోషించిన నాయకురాలు పోతన్నపల్లి జయమ్మ (70) అనారోగ్యంతో బొడ్డపాడులో ఫిబ్రవరి 24న కన్నుమూశారు. ఆమె స్వగ్రామం శ్రీకాకుళం జిల్లా బొడ్డపాడు. జనశక్తి న్యూడెమొక్రసీ నాయకుడైన తండ్రి నర్సింహులు ప్రేరణతో చిన్న వయసులోనే ఉద్యమంలోకి వెళ్లింది. నర్సింహులు జలంతరకోట ఎన్‌కౌంటర్‌లో మరణించడంతో దళకమాండర్ బాధ్యతలను స్వీకరించి చాలా కాలం పనిచేశారు. ఉద్యమ సహచరుడు ఎన్‌కౌంటర్‌లో మృతిచెందినా ఉద్యమంలోనే కొనసాగారు. జయమ్మ శ్రీకాకుళం జిల్లా దరి సింగుపురం వద్ద 1995లో అరెస్టవడంతో 12 కేసులు నమోదు చేశారు. అనారోగ్యంతో బెయిల్‌పై వచ్చిన జయమ్మ బయటనే ఉండి ఉద్యమాల్లో పాల్గొన్నారు. సోంపేట ఉద్యమం నుంచి కాకరపల్లి ఉద్యమం వరకు చురుకైన పాత్ర పోషించారు.

### ట్రంప్ భారతదేశ రాకను వ్యతిరేకిస్తూ నిరసనలు

అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ భారతదేశం పర్యటనను నిరసిస్తూ ప్రజా సంఘాల ఐక్య వేదిక ఆధ్వర్యంలో ఫిబ్రవరి 24న బేగంపేటలోని అమెరికా కాన్సులేట్ కార్యాలయం ముందు నిరసన ప్రదర్శన చేశారు. ప్రజా సంఘాల ఐక్య వేదిక ఆధ్వర్యంలో పలు సంఘాల నాయకులు కాన్సులేట్ సమీపానికి చేరుకొని ప్లకార్డులు, జెండాలతో డొనాల్డ్ ట్రంప్ గో బ్యాక్.. అంటూ నిరసన తెలుపగా పోలీసులు వారిని అరెస్టుచేశారు. బషీర్‌బాగ్‌లో ఎస్‌యుసిఐ(సి) ఆధ్వర్యంలో డోనాల్డ్ ట్రంప్ దిష్టిబొమ్మను దహనం చేశారు. కార్మిక వర్గ ప్రయోజనాలను బలిపెట్టే ఒప్పందాలు రెండు దేశాల మధ్య జరగబోతున్నాయని విమర్శించారు.

### నిర్బంధ వ్యతిరేక వేదిక ధర్నా

తెలంగాణ రాష్ట్రంలోని ప్రజా సంఘాల నాయకుల అరెస్టులు, నిర్బంధాలకు వ్యతిరేకంగా ఫిబ్రవరి 25న 'నిర్బంధ వ్యతిరేక వేదిక' ఆధ్వర్యంలో హైదరాబాద్‌లోని ఇందిరా పార్క్ వద్ద ధర్నా చౌక్‌లో ధర్నా నిర్వహించారు. ఈ ధర్నాలో పాల్గొన్న వక్తలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేసే యుఎపిఎ చట్టానికి, నిర్బంధాలకు, అక్రమ అరెస్టులకు వ్యతిరేకంగా మాట్లాడారు. ఈ ధర్నాలో ప్రొ. హరగోపాల్, ప్రొ. విశ్వేశ్వరరావు, సామాజికవేత్త చుక్కా రామయ్య, సిపిఐ నాయకులు నారాయణ, చాడ వెంకట్‌రెడ్డి, టిజెఎస్ అధ్యక్షుడు ప్రొ. కోదండరాం, విమలక్క, రమా మెల్కొటేలతో పాటు అనేక మంది ప్రజలు హాజరయ్యారు.

### రాజధానిపై ప్రభుత్వం దిగి రావాల్సిందే

రాజధాని విషయంలో వైఎస్ జగన్మోహన్ రెడ్డి ప్రభుత్వం దిగి వచ్చేవరకు తమ పోరు ఆపేది లేదని అమరావతి రైతులు ముక్తకంఠంతో నినదించారు. అమరావతిని ఏకైక రాజధానిగా కొనసాగించాలంటూ రైతులు చేస్తున్న పోరాటం 72 రోజులకు చేరింది. రైతులు రిలే దీక్షలు కొనసాగిస్తున్నారు. పేదలకు అమరావతిలో భూములు ఇస్తున్న ప్రభుత్వం రైతులు త్యాగం చేసిన భూములు ఇవ్వడం కాదని, ప్రభుత్వానికి ఉన్న భూమిని పంచుకోవాలని డిమాండ్ చేశారు. వీ

## అసోం సర్కారుతో బోడో నేతల శాంతి ఒప్పందం

ప్రత్యేక బోడోలాండ్ డిమాండ్‌తో దశాబ్దాలుగా హింసాత్మక మార్గంలో పోరాటాలు చేస్తున్న జాతీయ బోడోలాండ్ ప్రజాస్వామ్య కూటమి (ఎన్‌డీఎఫ్‌బీ). అఖిల బోడో విద్యార్థి సంఘం (ఏబీఎస్‌యూ). ఐక్య బోడో ప్రజల సంస్థ (యూబీపీవో)లతో అసోం ప్రభుత్వం జనవరి 27న కీలక ఒప్పందాన్ని కుదుర్చుకుంది. దీనిప్రకారం ప్రస్తుతం బోడోలాండ్ ప్రాదేశిక మండలి (బీటీసీ) పరిధి నాలుగు జిల్లాల (కోక్రాఝర్, బక్సా, చిరాంగ్, ఉదాల్‌గురి)ను ప్రత్యేక రాష్ట్రంగా చేయడమో.. కేంద్ర పాలిత ప్రాంతంగా ప్రకటించడమో చేస్తారు. ఈ ప్రాంతాలతోపాటు..బోడోలు అధికంగా నివసించే గ్రామాలను కలుపుకొని బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంతం (బీటీఆర్) ఏర్పాటు చేస్తారు. ఇందులో భాగంగా జనవరి 30న 1615 మంది బోడో తీవ్రవాదులు లొంగిపోయారు.

## బ్యాంక్ ఉద్యోగుల సమ్మె

వేతన సవరణ చేపట్టాలన్న డిమాండ్‌తో పాటు ఐదు రోజుల పని విధానంతో ఇతర సమస్యల పరిష్కారం కోరుతూ జనవరి 31, ఫిబ్రవరి 1న దేశవ్యాప్త బంద్‌కు పిలుపునిచ్చారు. ఈ బంద్ వల్ల దేశవ్యాప్తంగా బ్యాంకింగ్ కార్యకలాపాలు స్థంభించాయి. యునైటెడ్ ఫోరం ఆఫ్ బ్యాంక్ యూనియన్స్ ఆధ్వర్యాన చేపట్టిన సమ్మెలో బ్యాంకు ఉద్యోగులు పెద్ద ఎత్తున పాల్గొని విజయవంతం చేశారు. ఢిల్లీ, ముంబై, చెన్నై, కోల్‌కత్తా లతో పాటు దేశంలోని అన్ని ప్రాంతాల్లో పలు ప్రభుత్వ రంగ బ్యాంకులకు చెందిన లక్షలాది ఉద్యోగులు సమ్మెలో పాల్గొని కేంద్ర ప్రభుత్వ, ఇండియన్ బ్యాంక్ అసోసియేషన్ (ఐబిఏ) తీరుకు నిరసనగా ర్యాలీలు తీశారు. బ్యాంకుల ముందు శిబిరాలు ఏర్పాటు చేసి, సమస్యలను పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ నినాదాలు చేశారు. ప్రభుత్వం స్పందించకపోతే మళ్లీ సమ్మెకు దిగుతామని హెచ్చరించారు.

## ఫోర్స్ అంతర్జాతీయ సదస్సు

దేశంలో కనీస గుర్తింపు లేకుండా జీవిస్తున్న అనాథలకు రాజ్యాంగంలో హక్కులు కల్పించాలని, వారికోసం పార్లమెంట్‌లో ప్రత్యేక చట్టం చేయాలని వక్తలు అభిప్రాయపడ్డారు. అనాథల ప్రాథమిక హక్కుల కోసం ఫోర్స్ ఫర్ ఆర్ఫన్ రైట్స్ అండ్ కమ్యూనిటీ ఎంపవర్‌మెంట్ (ఫోర్స్) ఆధ్వర్యంలో హైదరాబాద్ శివారులోని ఓ కన్వెన్షన్ సెంటర్‌లో ఫిబ్రవరి 7, 8 తేదీల్లో అంతర్జాతీయ సదస్సు జరిగింది. అనాథ బాధలను, వారి అస్తిత్వాలను అర్థం చేసుకోవాలని అన్నారు. అనాథల కోసం పలు సంస్థలు పనిచేస్తున్నా.. వారి హక్కులు ప్రశ్నార్థకంగా మారాయన్నారు. అనాథల సమస్యలను పట్టించు కోవాల్సిన బాధ్యత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలతోపాటు సమాజంపైన ఉందన్నారు.

## ఢిల్లీ శాసనసభ ఎన్నికల ఫలితాలు

ఢిల్లీ శాసనసభకు గల మొత్తం 70 స్థానాలకు జనవరి 8న ఎన్నికలు జరిగాయి. జనవరి 11న ఎన్నికల కమిషన్ ఫలితాలను విడుదల చేసింది. ఈ ఎన్నికల్లో ఆమ్ ఆద్మీ పార్టీ 62 స్థానాలు, బిజెపి 8 స్థానాల్లో గెలుపొందాయి. కాంగ్రెస్ పార్టీ అత్యధిక స్థానాల్లో డిపాజిట్లను కూడా దక్కించుకోలేదు. ఓట్ల శాతాన్ని పరిశీలిస్తే ఆమ్ ఆద్మీ పార్టీకి 53.57; బిజెపికి 38.51; కాంగ్రెస్‌కి 4.26; ఇతరులు 3.20 శాతం ఓట్లు పోలయ్యాయి. ఆమ్ ఆద్మీ పార్టీ పూర్తి ఆధిక్యతతో అధికారంలోకి వచ్చింది. ఫిబ్రవరి 16న రామ్‌లీలా మైదానంలో ఆమ్ ఆద్మీ పార్టీ కన్వీనర్ అరవింద్ కేజ్రీవాల్ మూడోసారి ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు. ఆయనతో పాటు ఇతర శాఖల మంత్రులతో లెఫ్టినెంట్ గవర్నర్ అనిల్ బైజాల్ ప్రమాణ స్వీకారం చేయించారు.

## భీమా కోరేగాం కేసు ఎన్ఐఏకు బదిలీ

భీమా కోరెగాం కేసును పుణె పోలీసుల నుంచి తమకు అప్పగించాలని జాతీయ దర్యాప్తు సంస్థ కోరడం మహారాష్ట్ర ప్రభుత్వం అంగీకారం తెలుపడంతో పుణె కోర్టు ఫిబ్రవరి 14న ఆదేశాలు జారీచేసింది. ఈ కేసుకు సంబంధించిన రికార్డులు, ప్రొసీడింగ్‌లు, పోలీసులు స్వాధీనం చేసుకున్న ఆయుధాలు, వస్తువులను ముంబైలోని ప్రత్యేక ఎన్ఐఏ కోర్టుకు తరలించాలని, నిందితులందరినీ ఫిబ్రవరి 28 లోపు ఆ కోర్టులో హాజరుపరచాలని పుణె కోర్టు అడిషనల్ సెషన్స్ జడ్జి ఆదేశించారు. ఈ కేసులో నిందితులైన గౌతమ్ నవ్‌లఖ, ఆనంద్ తెల్‌తుంబ్డేలకు ముందస్తు బెయిలివ్వడానికి బాంబే హైకోర్టు తిరస్కరించింది.

## విమర్శకులు జాతి వ్యతిరేకులు కారు - జస్టిస్ చంద్రచూడ్

సుప్రీం కోర్టు న్యాయమూర్తి జస్టిస్ డివై చంద్రచూడ్ గుజరాత్‌లోని అహ్మదాబాద్‌లో లా విద్యార్థులను ఉద్దేశించి ఫిబ్రవరి 15న ప్రసంగించారు. తమతో విభేదించే వారిని జాతి వ్యతిరేకులుగానో, ప్రజాస్వామ్య వ్యతిరేకులు గానో ముద్రవేస్తే రాజ్యాంగ విలువలకూ, ప్రజాస్వామ్య వ్యవస్థకూ శరాఘాతంగా మారుతుందని హెచ్చరించారు. వివిధ అంశాలపై విభేదించడం, అసమ్మతి తెలపడం ప్రజాస్వామ్య వ్యవస్థకు రక్షక కవాటంగా పనిచేసి పటిష్టం చేస్తుందన్నారు. ప్రశ్నించేవారినీ, విమర్శించేవారినీ, అసమ్మతి తెలిపేవారినీ అణచివేస్తే ఈ చర్యలు రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక రంగాల అభివృద్ధి మూలాలనూ ధ్వంసం చేస్తాయని హెచ్చరించారు.

## ఛత్తీస్‌గఢ్‌లో ఎన్‌కౌంటర్

ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలో గత రెండు నెలలుగా 'ఆపరేషన్ ప్రహార్' పేరుతో చేపట్టిన కూంబింగ్‌లో భాగంగా ఫిబ్రవరి 21న అర్ధరాత్రి నుంచి తొండమ్మ, దుర్మా, బద్దేకదేవల్, కసాల్పయాడ్ అటవీ ప్రాంతాల్లో వేర్వేరుగా జరిగిన ఎన్‌కౌంటర్‌లలో 8 మంది మావోయిస్టులు మృతిచెందారని పోలీసు అధికారులు తెలిపారు. ఆపరేషన్ ప్రహార్‌లో భాగంగా 16 ఎన్‌కౌంటర్‌లు జరగ్గా ఫిబ్రవరి 22న జరిగిన ఎన్‌కౌంటర్లతో మృతుల సంఖ్య పెగరవచ్చని ఎస్‌పి చలబ్ సిన్హా తెలిపారు. ఘటనా స్థలంలో ఉన్న రక్తపు మరకలను బట్టిచూస్తే ఇంకా ఎక్కువ మంది మావోయిస్టులు గాయపడి ఉంటారని అంటున్నారు.

## డోనాల్డ్ ట్రంప్ భారత పర్యటన

అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ ఫిబ్రవరి 24, 25 తేదీల్లో భారతదేశం పర్యటించారు. ఫిబ్రవరి 24న అహ్మదాబాద్‌లోని మోతెరా స్టేడియంలో నిర్వహించిన 'నమస్తే ట్రంప్' కార్యక్రమంలో ప్రసంగించారు. ఉగ్రవాదాన్ని కట్టడి చేయడంలో కలిసి పనిచేయడానికి సిద్ధంగా ఉన్నామన్నారు. రక్షణ సంబంధాలను గణనీయంగా విస్తరించుకోవాలని తీర్మానించుకున్నామని పేర్కొన్నారు. వాణిజ్య ఒప్పందాన్ని రూపొందించుకునేందుకు కసరత్తు చేస్తున్నామన్నారు. ఫిబ్రవరి 25న డోనాల్డ్ ట్రంప్ గౌరవార్థం రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ ఢిల్లీలోని రాష్ట్రపతి భవన్‌లో అధికారిక విందు ఇచ్చారు. ఇరు దేశాల మధ్య వ్యూహాత్మక భాగస్వామ్యానికి భారతదేశం పూర్తిగా కట్టుబడి ఉందని రాష్ట్రపతి అన్నారు.

## సిఏఏ వ్యతిరేక ఆందోళనలు

దేశ రాజధాని ఢిల్లీలో గత ఐదు రోజులుగా సిఏఏ వ్యతిరేక ఆందోళనలు ఘర్షణకు దారితీశాయి. ఈ ఘర్షణల్లో ఒకరిపై ఒకరు రాళ్లు విసురుకున్నారు. ఢిల్లీలోని ఈశాన్య ప్రాంతంలోని బస్తీల్లో ఆందోళన కారులను చెదరగొట్టేందుకు పోలీసులు బాష్పవాయు గోళాలు ప్రయోగించి లాఠీ చార్జి చేశారు. దీంతో ఆందోళనకారులు ఇళ్లకు, షాపులకు, వాహనాలకు నిప్పుపెట్టారు. ఫిబ్రవరి 26 నాటికి ఈ అల్లర్లలో 27 మంది మృతి చెందగా 250 మందికి గాయాలయ్యాయి. క్షతగాత్రుల్లో 30 శాతం మందికి తూటా గాయాల య్యాయని, 106 మంది ఆందోళనకారులను అరెస్టు చేసినట్లు పోలీసు అధికారులు తెలిపారు. అల్లర్లు జరుగుతున్న చాంద్‌బాగ్, జఫ్రాబాద్, భజన్‌పురా, యమునావిహార్, మౌజ్‌పూర్ ప్రాంతాల్లో భద్రతాదళాలు ఫ్లాగ్ మార్చ్ చేశాయి. వీ

## బ్రెగ్జిట్ సంపూర్ణం

యూరోపియన్ యూనియన్ (ఇయు) నుంచి బ్రిటన్ వైదొలగింది. జనవరి 31న బ్రెగ్జిట్ ఒప్పందానికి ఇయు పార్లమెంట్ ఆమోదముద్ర వేసింది. పార్లమెంట్‌లో బ్రెగ్జిట్ ఒప్పందానికి అనుకూలంగా 621–49 ఓట్ల తేడాతో అంగీకారం తెలిపారు. ఈ సందర్భంగా యాభై ఏండ్ల పాటు సాగిన అనుబంధాన్ని గుర్తు చేసుకున్నారు. అంతకు ముందే బ్రెగ్జిట్ ఒప్పందంపై ఇంగ్లండ్ రాణి ఎలిజబెత్–2 అధికారిక ఆమోద ముద్ర వేశారు. ప్రధాని బోరిస్ జాన్సన్ కూడా ఈ ఒప్పందంపై సంతకం చేశారు. బ్రెగ్జిట్ తరువాత ఇయు బ్రిటన్ మధ్య వాణిజ్య సంబంధాలపై ప్రభావం చూపనుంది. ఫిబ్రవరి 3న ప్రధాని బోరిస్ జాన్సన్ ఒకపక్క స్వేచ్ఛాయుత వాణిజ్య ఒప్పందానికి సిద్ధంగా ఉన్నామని అంటూనే సమాఖ్య నిబంధనలను అమలు చేయాలనే ఆలోచన లేదని ప్రకటించారు. దీనిపై ఇయు కూడా తమకు ప్రయోజనం లేని ఒప్పందం కంటే పొత్తు లేకుండా ఉండడమే మేలని తేల్చి చెప్పింది. బ్రెగ్జిట్ నిబంధనల ప్రకారం మరో పదకొండు నెలల్లో బ్రిటన్ ఇయుతో వాణిజ్య ఒప్పందాలను కుదుర్చుకోవాల్సి ఉంది.

## బెల్జియంలో కార్మికుల నిరసన

బెల్జియంలో కార్మికులు భారీ ర్యాలీతో ప్రభుత్వానికి వ్యతిరేకంగా జనవరి 31న నిరసన ప్రదర్శనలు చేశారు. ప్రభుత్వం అనుసరిస్తున్న కార్మిక వ్యతిరేక విధానాలపై ఆందోళన వ్యక్తం చేశారు. ఈ నిరసన ప్రదర్శనలో బెల్జియం సోషలిస్ట్ ట్రేడ్ యూనియన్, జనరల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ బెల్జియం లేబర్ కార్మికులతో పాటు పలు సంఘాలు కలిసి భారీ ర్యాలీ నిర్వహించాయి. కర్మాగారాల యాజమాన్యాల ప్రయోజనాల కోసం పాకులాడుతూ కార్మికుల సంక్షేమాన్ని విస్మరిస్తున్నాయనీ, కార్మికుల ఆరోగ్య భద్రతను పట్టించుకోవడం లేదనీ నిరసన తెలిపారు. అరకొర వేతనాలతో అధిక పనిగంటలు పనిచేయిస్తున్నారనీ, వారి హక్కులను కాలరాస్తున్నారనీ, ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు కార్పొరేట్ సంస్థలకు లబ్ధిచేకూరేలా ఉన్నాయని విమర్శించారు. కార్మికులకు సామాజిక, ఆరోగ్య భద్రత కల్పించాలని డిమాండ్ చేశారు.

## ఇరాక్ ప్రధాన మంత్రిగా మహ్మద్ అల్లావీ

ఇరాక్‌లో రెండు నెలల నుంచి నెలకొన్న రాజకీయ అనిశ్చితికి తెరదీస్తూ మహ్మద్ అల్లావీని ప్రధానమంత్రిగా నియమించారు. ఈ మేరకు ఫిబ్రవరి 2న అధ్యక్షుడు బర్హామ్ సాలిహ్ అధికారికంగా ప్రకటించారు. గత సంవత్సరం అక్టోబర్ నుంచి ప్రభుత్వ వ్యతిరేక ఆందోళనలు కొనసాగుతున్నాయి. ఇరాక్‌లో నిరుద్యోగ సమస్యను పరిష్కరించాలని, అవినీతిని నిర్మూలించాలని, పాలనను తిరిగి గాడిలో పెట్టాలని డిమాండ్ చేస్తూ ఆందోలనలు కొనసాగుతున్నాయి. గత నవంబర్‌లో అప్పటి ప్రధాని అబ్దెల్ అబ్దుల్ మహ్దీ తన పదవికి రాజీనామా చేశారు. దీంతో పాలన పూర్తిగా గాడి తప్పడంతో పరిస్థితిని అదుపులోకి తేవడానికి మహ్మద్ అల్లావీని ప్రధానిగా నియమించారు. నెలరోజుల్లోపు ఆయన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాల్సి ఉంటుంది. ఒకవేళ ప్రభుత్వ ఏర్పాటులో ఆయన విఫలమైతే ముందస్తు ఎన్నికలు జరిగే అవకాశముంది.

## డొనాల్డ్ ట్రంప్‌పై వీగిన అభిశంసన

అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్‌పై ప్రవేశపెట్టిన అభిశంసన తీర్మానం వీగిపోయింది. అధికార దుర్వినియోగం, చట్టసభలను అడ్డుకునే ప్రయత్నం వంటి అభియోగాలపై రెండు వారాల విచారణ అనంతరం సెనెట్ ట్రంప్‌ను నిర్దోషిగా ప్రకటించింది. రిపబ్లికన్లు మెజారిటీగా ఉన్న సెనెట్‌లో అధికార దుర్వినియోగం అభియోగంపై 52–48 తేడాతో, సభను అడ్డుకున్నారన్న అభియోగంపై 53–47 ఓట్ల తేడాతో గెలుపొందారు.

## ప్రపంచ దేశాలను వణికిస్తున్న కరోనా వైరస్

జనవరి చివరి వారంలో చైనాలో కరోనా వైరస్ వ్యాప్తి చెందింది. ఇప్పుడు ఈ వ్యాధి తీవ్రరూపం దాల్చి ఇతర దేశాలలో తన ప్రభావాన్ని చూపుతోంది. జ్వరం, దగ్గు, శ్వాసకోశ సమస్యలతో మనుషుల ఆరోగ్యం దెబ్బతిని ప్రాణాంతకంగా మారుతోంది. ఇది ఒకరి నుంచి మరొకరికి సోకుతుండడం వల్ల బాధితుల సంఖ్య రోజురోజుకూ విపరీతంగా పెరిగిపోతోంది. చైనాలోని వుహాన్ నగరం కేంద్రంగా ఈ వ్యాధి విస్తరిస్తోంది. చైనా నూతన సంవత్సరం సందర్భంగా వుహాన్ నుంచి దాదాపు యాభై లక్షల మంది ఇతర ప్రదేశాలకు, దేశాలకు ప్రయాణించారు. వ్యాధి కేంద్రంగా ఉన్న వుహాన్ నగరాన్ని పూర్తి దిగ్బంధం చేశారు. రాకపోకలను పూర్తిగా నిషేధించారు. ఒక్క చైనాలోనే దాదాపు ఎనభై వేల మందికి ఈ వ్యాధి సోకింది. రెండు వేల ఏడు వందల మందికి పైగా మరణించారు. ఇరాన్‌లో 19, ఇటలీలో 12, దక్షిణ కొరియాలో 12, జపాన్‌లో ఇద్దరు కరోనా వ్యాధి వల్ల మరణించారు. ఈ వ్యాధి బారిన పడినవారి సంఖ్య రోజురోజుకూ పెరుగుతోంది. చైనాలో బాధితుల సంఖ్య క్రమంగా తగ్గుముఖం పట్టినా ఇది ఇతర దేశాలలో తన ప్రభావాన్ని చూపుతోంది.

## ఐర్లాండ్ పార్లమెంట్ ఎన్నికలు

ఐర్లండ్‌లో పార్లమెంట్‌కు ఫిబ్రవరి 8న ఎన్నికలు జరిగాయి. మొత్తం 160 స్థానాలకు జరిగిన ఎన్నికల్లో ఏ ఒక్క పార్టీకి మెజారిటీ దక్కలేదు. అయితే అనూహ్యంగా సిన్ ఫెయిన్ పార్టీ 37 స్థానాలను గెలుచుకుంది. ఇప్పటి వరకు పాలించిన ఫియానా ఫియాల్, ఫైన్ గాయెల్ పార్టీలు సాగించిన పాలన పట్ల ప్రజల్లో తీవ్ర అసంతృప్తి ఫలితంగా సిన్ ఫెయిన్ పార్టీ గెలుపొందింది. మొదటి ప్రాధాన్యత (పాపులర్) ఓట్లలో సిన్ ఫెయిన్ పార్టీ నాయకురాలు మేరీలో మెక్ డోనాల్డ్‌కు మిగతా నాయకుల కన్నా అత్యధిక శాతం (26.5 శాతం) ఓట్లు వచ్చాయి. అందరికీ ఆరోగ్యం, నివాసం అనే నినాదంతో మేరిలో విజయాన్ని సాధించారు. ఐర్లాండ్‌లో ఆర్థిక అసమానతలు తీవ్ర రూపం దాల్చాయి. అవి ఈ ఎన్నికల్లో ప్రభావాన్ని చూపాయి.

## గ్రీస్‌లో దేశవ్యాప్త సమ్మె

గ్రీస్‌లో కార్మిక సంఘాలు దేశవ్యాప్త సమ్మె చేశాయి. ఫిబ్రవరి 19న గ్రీస్‌లోని అరవై నగరాల్లో భారీ నిరసన ప్రదర్శనలు నిర్వహించాయి. సామాజిక భద్రతను ప్రైవేటీకరించాలనే గ్రీస్ ప్రభుత్వ నిర్ణయానికి వ్యతిరేకంగా ఈ ఆందోళనలు సాగాయి. ఈ ఆందోళనలకు దేశ ప్రజలందరూ కార్మికులకు మద్దతుగా నిలిచారు. అలాగే పదవీ విరమణ వయస్సును 67 సంవత్సరాలకు పెంచి, తద్వారా వయసు పైబడిన కార్మికులతో ఎక్కువ కాలం పనిచేయించి, వారికి అందాల్సిన ప్రయోజనాలను తగ్గించేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. దీనికి సంబంధించిన బిల్లును అధికార కన్జర్వేటివ్ న్యూ డెమోక్రసీ పార్టీ పార్లమెంట్‌లో ప్రవేశపెట్టింది. పలు కార్పొరేట్ సంస్థకు లబ్ధిచేకూరే విధంగా ఉద్యోగులకు అందజేసే ఇన్సూరెన్స్ విధానంలోనూ సమూల మార్పు తీసుకు వచ్చేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తోందని నిరసనకారులు విమర్శించారు. సామాజిక భద్రత ప్రైవేటీకరణ బిల్లును నిలిపివేయాలని డిమాండ్ చేసారు.

## మలేషియా ప్రధానమంత్రి మహతిర్ రాజీనామా

మలేషియా ప్రధానమంత్రి మహతిర్ మహ్మద్ తన పదవికి రాజీనామా చేశారు. ఫిబ్రవరి 24న మలేషియా రాజుకు తన రాజీనామా లేఖను అందజేశారు. మహతిర్ అహ్మద్ నాయకత్వంలోని పర్తి ప్రబూమి బెర్సతు మలేషియా పార్టీ, మరో కీలక నేత అన్వర్ ఇబ్రహీం నాయకత్వంలోని పార్టీ ఖేదిలాన్ రఖ్యాత్ కూటమిగా 2018లో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. అయితే అన్వర్‌కు అధికార పగ్గాలు అప్పగించే అంశంలో నెలకొన్న ప్రతిష్టంభన ఈ రాజకీయ సంక్షోభానికి దారితీసింది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(జనవరి 1 నుండి జనవరి 31, 2020 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (862), ఆంధ్రప్రదేశ్‌లోని 12 జిల్లాలలో (744) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1606)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 2 | – | 16 | 19 | 10 | 6 | 7 | 2 | 1 | 2 | 2 | 1 | 5 | 29 | 34 | – | – | – | 2 | – |
| హైదరాబాద్ | – | – | – | 7 | 13 | 4 | 7 | 3 | 3 | 5 | 8 | 12 | 4 | 5 | 17 | 11 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 3 | – | 4 | 3 | 3 | 5 | 2 | 1 | 2 | – | 2 | 1 | 4 | 15 | 8 | – | – | – | – | – |
| ఖమ్మం | – | – | 1 | 5 | 13 | 1 | 4 | – | 1 | 3 | – | 2 | – | 3 | 20 | 12 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | – | 1 | 1 | 2 | 2 | 2 | 3 | 2 | 2 | 2 | 3 | 2 | 4 | 39 | 1 | – | – | – | – | 1 |
| మెదక్ | 1 | 14 | – | 9 | 10 | 8 | 2 | 2 | 1 | 4 | 4 | 6 | 6 | 9 | 14 | 18 | – | – | – | 4 | 2 |
| నల్గొండ | – | 2 | – | 6 | 5 | 2 | 3 | 2 | 1 | 2 | 2 | 3 | 3 | 4 | 17 | 6 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | 2 | – | 5 | 7 | 2 | 4 | 3 | 1 | 2 | 1 | 3 | 1 | 3 | 16 | 8 | – | – | – | – | – |
| వరంగల్ | 2 | 19 | 2 | 4 | 3 | 1 | 3 | 6 | 1 | 3 | 2 | 2 | 5 | 13 | 20 | 32 | – | – | – | 3 | 1 |
| రంగారెడ్డి | – | 3 | – | 7 | 6 | 3 | 5 | 2 | 4 | 3 | 3 | 5 | 6 | 4 | 23 | 14 | – | – | – | – | 2 |
| **తెలంగాణ** | **3** | **45** | **4** | **64** | **81** | **36** | **41** | **30** | **17** | **27** | **24** | **40** | **29** | **54** | **208** | **144** | **-** | **-** | **-** | **9** | **6** |
| అనంతపురం | – | 5 | 3 | 4 | 19 | – | 2 | – | – | 1 | 4 | 2 | 12 | 4 | 46 | – | – | – | – | – | – |
| చిత్తూరు | | | | | | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | |
| కడప | – | 2 | – | – | 9 | – | – | – | – | 1 | – | – | – | 5 | 14 | 12 | – | – | – | – | – |
| గుంటూరు | – | 3 | – | 5 | 6 | 3 | 5 | 2 | 1 | 3 | 1 | 2 | 3 | 4 | 15 | 7 | – | – | – | – | – |
| కృష్ణా | – | 3 | – | 7 | 8 | 2 | 6 | 2 | 1 | 2 | 3 | 2 | 2 | 3 | 13 | 8 | – | – | – | – | – |
| కర్నూలు | – | 4 | – | 3 | 7 | 2 | 3 | – | 2 | 4 | 4 | 5 | 2 | 1 | 14 | 12 | – | – | – | – | 2 |
| తూర్పు గోదావరి | – | – | – | 4 | 4 | 1 | 7 | – | 1 | 1 | 4 | 7 | 1 | 1 | 22 | 16 | – | – | – | 1 | – |
| ప్రకాశం | – | 2 | – | 4 | 6 | 3 | 4 | 2 | 1 | 2 | 2 | 4 | 2 | 3 | 21 | 14 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 3 | 9 | 1 | 14 | 3 | – | – | 1 | – | 1 | 1 | 21 | 9 | – | – | 1 | – | – |
| పశ్చిమ గోదావరి | – | – | – | 4 | 6 | 2 | 4 | 3 | 1 | 2 | 3 | 2 | 1 | 2 | 13 | 7 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 6 | 5 | 3 | 4 | 2 | 2 | 4 | 1 | 2 | – | 3 | 17 | 13 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | – | 2 | 3 | 2 | 2 | 1 | 1 | 1 | 2 | 1 | 2 | 4 | 15 | 9 | – | – | – | – | 2 |
| విశాఖపట్నం | – | – | – | 6 | 9 | – | 1 | 1 | 1 | 4 | 1 | – | 3 | 1 | 8 | 10 | – | – | – | 5 | – |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **19** | **3** | **48** | **91** | **19** | **52** | **16** | **11** | **25** | **26** | **27** | **29** | **32** | **219** | **117** | **-** | **-** | **1** | **6** | **4** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 120 |
| కుట్రరాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| ప్రపంచీకరణ ప్రాభవంలో... | విద్యాభూషణ్ | 120 |
| మార్క్స్ రాసిన పెట్టుబడి | డేవిడ్ స్మిత్, ఫిల్ ఇవాన్స్ | 200 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |
| మానని గాయాలు | తెలంగాణ విద్యావంతుల వేదిక | 100 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |
| శాస్త్రీయ విద్యా విధానం | ఆకుల భూమయ్య | 30 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| జెండర్ కులం | ఉమా చక్రవర్తి | 150 |
| బొజ్జా తారకం నీలిజెండా వ్యాసాలు | హెచ్.బి.టి | 250 |
| ఇది రిజర్వేషన్ల దేశం | బొజ్జా తారకం | 150 |
| అంటరాని తనం ఇంకానా? | బొజ్జా తారకం | 50 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 150 |
| గులాంగిరి | జోతిబా పూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| వెలివాడల వెతలు | కుల నిర్మూలన ప్రచురణ | 100 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం | విరసం ప్రచురణ | 50 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| గోదావరి వచ్చినపుడు | ఆర్. ఉమామహేశ్వరి | 280 |
| హైదరాబాద్ స్వాతంత్ర్య సంరంభం | ఎన్. వేణుగోపాల్ | 25 |
| పద్య సాహిత్యం:సంఘ చరిత్ర | బూదరాజు రామకృష్ణ | 25 |
| నగరంలో కర్ఫ్యూ | మలుపు ప్రచురణ | 75 |
| నరమేధాలూ నియోగాలూ | బి. విజయభారతి | 250 |
| జీనా హైతో మర్‌నా సీకో | కాత్యాయని | 100 |
| పరిమళించిన మానవత్వం | ప్రొ. జి. హరగోపాల్ | 120 |
| సన్నిహితుల జ్ఞాపకాలలో అంబేద్కర్ | హెచ్‌బిటి | 200 |
| మా జ్ఞాపకాల్లో కెవిఆర్ | వకుళాభరణం లలిత | 80 |
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| టిపు సుల్తాన్ | యార్లగడ్డ నిర్మల | 150 |
| నా మాటే తుపాకి తూటా | విమల, కాత్యాయని | 120 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ పూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |
| కశ్మీర్‌లో నిషిద్ధ రాత్రి | బషారత్ పీర్ | 170 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ కవిత్వం | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 200 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీలాదేవి | 75 |
| సహచరులు | వరవరరావు | 100 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| తత్వశాస్త్ర దారిద్ర్యం | కార్ల్ మార్క్స్ | 150 |
| తలకిందుల లోకం | మనీషా సేథి | 150 |
| ప్రశ్నలు అలాగే ఉన్నాయి | ఎం. రాఘవాచారి | 150 |
| సముద్ర స్వరం | పాలమూరు అధ్యయన వేదిక | 150 |
| వ్యక్తిత్వమే కవిత్వం | మలుపు ప్రచురణ | 100 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| 30 ఇయర్స్ దండకారణ్య కల్చరల్ మూవ్‌మెంట్ | ఎన్.ఎం. చేతనా | 250 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహా ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర | విరసం ప్రచురణ | 250 |
| ఆవాజ్ | విరసం ప్రచురణ | 65 |
| మెరిసే అక్షరాల వెనుక | సృజన ప్రచురణ | 30 |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు | విరసం ప్రచురణ | 80 |
| పికెఎం ప్రభాకర్ రచనలు | విరసం ప్రచురణ | 70 |
| కార్మికవర్గ విప్లవం-విప్లవ ద్రోహి కౌట్స్కీ | విరసం ప్రచురణ | 60 |
| భీమా కోరేగాం 12 - వివి | స్వేచ్ఛా సాహితి ప్రచురణ | 50 |
| యుద్ధం స్త్రీ ప్రకృతికి విరుద్ధం | ఎస్.అలెక్సీయెవ్ | 100 |
| రగులుతున్న అడవి | నందినీ సుందర్ | 290 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| మేరువు | విరసం ప్రచురణ | 90 |
| మానధనులు | హావర్డ్ ఫాస్ట్ | 150 |
| దండకారణ్య కథలు (2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 150 |
| వనవాసి | బిభూతిభూషణ్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు - రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 120 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నిషిద్ధ | నల్లూరి రుక్మిణి | 180 |
| మాటిగరి | గుగి వా థియోంగో | 120 |
| మట్టికాళ్ల మహారాక్షసి | గుగి వా థియోంగో | 200 |
| బంది | గుగి వా థియోంగో | 200 |
| నేను చావును నిరాకరిస్తున్నాను | జి.ఎన్. సాయిబాబా | 125 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 224 - March 2020 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/02/2020 ● Postal Regn. No. HD/1100/2020-22



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao